# అంకితం

నా రచనలపై తమ నిష్పాక్షిక విమర్శలూ, సలహాలు అందిస్తూ
ఎల్లప్పుడూ నా అభ్యున్నతిని కాంక్షించే
అక్కయ్య — శ్రీమతి కొర్రపాటి సుశీలాదేవికీ
బావగారు — శ్రీ భాస్కరరావుగారికీ
గౌరవాభిమానములతో
'రచయిత్రి'

* * * *

"రుక్మిణిలాటి ఆడపిల్లలు అరుదుగా ఉంటారు. గడుసుతనం, ఆత్మరక్షణ, వివేకము,సమయస్ఫూర్తి సమపాళ్ళలో రంగరించి సృష్టికర్త సృజించిన బంగారు తల్లి."

— మన స్వత్వాలు

"ఎదుటివారి బలహీనతల్ని తెలుసుకున్నప్పుడు, వాటిని సరిదిద్దాలనుకోకుండా, వాటి నలా వుంచే మన పని మనం చేసుకుపోతే, ఉభయుల గౌరవానికి భంగం లేకుండా ఉంటుంది-"

—పంజరకీరాలు

పవని నిర్మల ప్రభావతి-జననం కనిగిరి (నెల్లూరు జిల్లా)లో. స్కూలు ఫైనలుదాకా చదివారు. 1954 నుండీ వీరి రచనలు ప్రచురితం అవుతున్నాయి. ఎన్నో కథలు; వ్యాసాలు; 'శలభాలు,' 'ఉదయ కిరణాలు,' 'సప్తవర్ణాలు' మొదలైన నవలలు వ్రాశారు. ఈ పరంపరలో వీరి నవల 'మనుషులు-మనసులు' (EPB 56) ఇది వరకు వెలువడింది. 'పంజరకీరాలు'—'పంజరం' అన్న పేరుతో పత్రికల్లో



# మనస్తత్వాలు
# పంజర కీరాలు

పవని నిర్మల ప్రభావతి

**Manastatwalu-Panjara Keeralu**
*by*
PAVANI NIRMALA PRABHAVATI

*Publishers :*
M. Seshachalam & Co.,

*First Edition :*
**December, 1972**

*Cover Design :*
**BAPU**

*Printers :*
WELDUN PRESS,
MADRAS-21

*Distributors :*
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
Rashtrapathi Road, Secunderabad.

**Price Rs. 2-50**



# 1

"నమః పూర్వాయగిరయే
పశ్చిమాయాద్రయేనమః
జ్యోతిర్గణానాంపతయే
దినాధిపతయేనమః॥"

ఆదిత్య హృదయం పెద్దగా చదువుతూ. తలెత్తి చూచాడు గోపాలకృష్ణయ్య. తూర్పు దిక్కున అరుణ రాగరేఖలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. నెత్తిమీద—పాలచెంబులతో నిండిన బుట్టతో, గేటు త్రోసుకుని లోపలికి వస్తోంది పాలుపోసే కనకమ్మ.

"కలకలలాడే ముఖం, మంచి అవయవ సౌష్ఠవం, ఐదుగురు పిల్లల తల్లయినా వన్నెతగ్గని లావణ్యం! కనకమ్మ! అలా వయ్యారంగా నడిచి వస్తుంటే, నా గుండెలు ఝల్లుమంటున్నాయి! తస్సదియ్యా ఏ కులమైతేనేం? అందం, ఆకర్షణ ఒక డబ్బ సొమ్మా?" అనుకున్నాడు గోపాలకృష్ణయ్య. మనసులో చెలరేగుతున్న భావ సంచలనానికి తర్జుమాలా, ఆయన బుర్రమీసాల మాటున మొలక నవ్వు వెలసింది....

"అమ్మగోరూ! పాలండీ!" బుట్ట జాగ్రత్తగా దింపుకుని, వరండా మెట్లమీద కూర్చుని కేక వేసింది కనకమ్మ.

"ఆహాఁ! ఏం కంఠస్వరం! కిన్నెర కంఠమంటే ఇదే గాబోలు! ఇల్లాలూ వుంది ఎందుకూ? గార్దభ కంఠస్వరమూ

అదీనూ!'' అలాగే కనకమ్మను చూస్తూ అనుకున్నాడు గోపాల కృష్ణయ్య.

"వస్తూన్నా కనకమ్మా!" లోపల్నుంచి జగదాంబ కేక విని త్రుళ్ళిపడ్డాడు గోపాలకృష్ణయ్య. గబగబ గొంతు సవరించుకుని తిరిగి స్తోత్రం మొదలెట్టాడు.

''ఆతపీ మండలీ మృత్యుః,
పింగళస్సర్వతాపనః
కవిర్విశ్వోమహాతేజా
ర కః సర భవోద్భవః॥''

ఆ కంగారులో గోపాలకృష్ణయ్యకు తనేం చెబుతోంది, స్తోత్రం ఎంతవరకూ వచ్చిందో కూడా తెలియ లేదు. ఆశ్చర్యంగా భర్తవేపు చూచింది—జగదాంబ. ఇందాక తను కుంపటి అంటిస్తూ, భర్త బిగ్గరగా ''నమః పూర్వాయగిరయే........'' అంటూండడం స్పష్టంగా వింది! ఈ లోగా ఏం పుట్టి మునిగిందో స్తోత్రపఠన ఆగి పోయింది ....అందుకు కారణం బహుశా కనకమ్మరాకే అయ్యుండ వచ్చని ఆయనగారి దొంగచూపుల వాలకంచూచి తను పసి గట్టేసింది! కాని స్తోత్రం మర్చిపోయి తిరిగి వెనక్కి వెళ్ళేంత పరాకు వుందనుకోలేదు.

ముఖం చిట్లించి, భర్తవేపే వో మారు చూసి, చూపులు తిప్పుకుంది జగదాంబ.

"అమ్మగారూ! మన గేదె యింకా ఈనలే?'' అంది కనకమ్మ. ''ఈనలేదే కనకం! ఈనితే యీ అగచాట్లెందుకు మాకు! ఏదోలే! నీళ్ళు కలపకుండా పాలు పోస్తున్నావ్! గేదె గొడ్డు ఈన గానే, నీ డబ్బు లెక్కకట్టి ఇచ్చేస్తా....'' అంది జగదాంబ!

"అయ్యో అయ్యో! ఎంత మాటమ్మగారూ! కలిపి కలిపి మీకే కలపాలా నీళ్ళు? మీరేం పాడి చెయ్యనోరా ఏమిటి? నేనీళ్ళ

కలిపితే తెలుసుకోలేకపోవటానికి? డబ్బుకేం తొందర లేదు లెండమ్మ గారూ! మీకాడే వుంచండి...."

కనకమ్మ, మెల్లిగా నెత్తిమీది కుదురు సరిచేసుకుని. బుట్ట ఎత్తుకుని వెనక్కు తిరిగింది!

"ఓహో! బుట్ట ఎత్తుకోవటంలో కూడా ఏం హొయలే!" అనుకున్నాడు గోపాలకృష్ణయ్య లొట్టలేస్తూ! కానీ అంతలోనే జగదాంబ తీక్షదృష్టి తన మీదే వుందనేది గుర్తుకు వచ్చిందాయనకు. దప్పున స్తోత్రం లంకించుకున్నాడు.

"వ్యోమనాథ స్తమోభేదీ
ఋగ్యజుస్సామ పారగః
ఘనవృష్టిరపాంమిత్రో
వింధ్యవీథీప్లవంగమః"

"మరే! కనకమ్మతోబాటు స్తోత్రం కూడా వెనక్కు తిరిగి నట్లుందే?" వెటకారంగా, ఈసడించుకుంటూ అంది జగదాంబ.

భార్య కటుస్వరంతో తన తప్పు కొద్దిగా అర్థమైంది గోపాలకృష్ణయ్యకు. కానీ అలా తేలిపోవటం ఆయనకు సుతరామూ ఇష్టమూ లేదు. అలవాటూ కాదు!

"ఏమిటే నీగోల? ప్రశాంతంగా దైవప్రార్థన చేసుకో నివ్వవు?" చిరాకు ప్రదర్శించాడు.

"నాది గోలే మరి! స్తోత్రం చివరినుంచి మొదటికి వస్తూ దోవనపోయే ఆడవాళ్ళని చూస్తూ కూర్చుంటే, సూర్యాస్తమయాని కయినా, ఆదిత్య హృదయం పూర్తవుతుందా?"

"నోర్ముయ్! వెధవ్వాగుడూ. నువ్వూ!" గోపాలకృష్ణయ్య పురుషాహంకారం పైకి వచ్చింది.

"నాది వెధవ్వాగుడూ? నా నోరు మూయిస్తారు! అందాకా బాగానే వుంది. ఎటొచ్చి స్థిమితంలేని మీ మనసు నోరు మూయించ లేక పోతున్నారు! ఏభై ఏళ్ళు దాటినా దొంగచూపులు తగ్గ లేదు! ఎవరో మహానుభావుడు సెలవిచ్చాడు....ఐదు పదులు దాటాక కూడా వంకరచూపు తగ్గని వాడికి, వల్ల కాట్లోకి వెడితే తప్ప, ఆ జాడ్యం వలదట...."

"చాల్లే! మాటలు నేర్చిన కుక్క వయ్యావ్!"

"హుఁం! ఎవరి కర్మ కెవరు బాధ్యులు? ఎవర్ని మోసగించ టాని కీ ప్రార్థనలు? తెల్లారురఝామున లేచి ఏక గోలచేస్తూ గొంతు చించుకున్నంత మాత్రాన, ఆ దేవుడు మాత్రం హర్షిస్తాడా? చుట్టు ప్రక్కల వాళ్ళ నిద్ర చెడగొట్టి, స్తోత్రాలతో చెవులు దిబ్బళ్ళుకొట్టడం మినహా ఓ భక్తా? పాడా?" జగదాంబ హృదయంలోని అక్కసంతా వెళ్ళగక్కేసింది.

"భక్తి సూక్ష్మం నీకు తెలిసేడిచిందేమిటే?" గోపాల కృష్ణయ్య గాంభీర్యం ఎరువు తెచ్చుకున్నాడు.

"నాకేం తెలుస్తుంది? మీకే తెలియాలి ఆ భక్తి సూక్ష్మాలు...."

"ఏమమరి....వినేనా తరిస్తావు! 'తను హృద్భావుల సఖ్య మున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనార్చనముల్, సేవయు, నాత్మలో నెరుకయున్, సంకీర్తనల్, చింతనంబను' ఈ తొమ్మిది భక్తి మార్గాలున్నాయే పిచ్చిదానా! కలియుగంలో భగవన్నామ సంకీర్త నానికే ముక్తి లభిస్తుందే వెర్రి పీనుగ!"

"ఆహా! రోజూ వింటున్నదేగా ఈ భక్తిసూక్ష్మం? భగవ న్నామ సంకీర్తనంతోబాటు పరాయి ఆడవాళ్ళని చూపులతో మింగు తుంటే కూడా ముక్తి లభిస్తుందని సెలవిచ్చారా ఆ గ్రంథాలలో? చెట్టంత కొడుకూ, కోడలూ వున్నారు........ మొగుడు చచ్చిన వయసు పిల్ల ఇంట్లోపడి అఘోరిస్తోంది....సిగ్గులేకుంటే సరి! చచ్చి ఏ లోకా న్నున్నారో అత్తగారూ, మామగారూ, తగిన పేరే పెట్టారు మీకు....!

ఇక మనవళ్ళూ, మనవరాళ్ళూ వచ్చి వెక్కిరించాక మానుతారేమో ఈ వంకర చూపు!"

భళ్ళున నవ్వాడు గోపాలకృష్ణయ్య.

"మనల్ని మనవడు వెక్కిరించటానికి అసలు మనవడంటూ ఏడీ?" మాటతోబాటు, మనసులో తళుక్కున ఏదో ఆలోచన మెదిలింది గోపాలకృష్ణయ్యకు.

"సర్లెండి! తెల్లారి లేచి ఎందుకొచ్చిన గొడవ మీతో? ఆ పూజలేవో ముగించండి...... కాఫీ త్రాగుదురుగాని," కోపంగా లోపలికి వెళ్ళిపోయింది జగదాంబ. పాలగిన్నె తీసుకుని, పెరట్లో నుంచి, పళ్ళు తోముకుని, ముఖం తుడుచుకుంటూ, ఎదురు వచ్చింది కమల.

"ఏమిటమ్మా గొడవ?" అంది తల్లి వేపు నిశితంగా చూస్తూ.

కూతురు వేపు చూచిన జగదాంబ గుండె చెరువయ్యింది, క్షణకాలం; సన్నగా, తెల్లగా, పొడవుగా, మెరుపు తీవెలావుండే కమల ముఖంమీద ఎర్రని బొట్టుకు చోటు లేదు! తెల్లగా నాజూగ్గా వున్న చేతులు గలగలలాడే గాజులకు నోచుకోలేదు. బోసిపోయి వున్న మెడలో పసుపుత్రాడు కిక ఆస్కారం లేదు! కమల బాల వితంతువు!

"భగవాన్! బంగారు బొమ్మలాటి నా తల్లి కి రాతెందుకు రాశావు?" లోపల భావాలను అణచుకుంటూ నిట్టూర్చింది జగదాంబ.

'ఏమిటమ్మా? నాన్నా, నువ్వూ ఏదో వాదించుకుంటున్నారు?" మళ్ళీ అడిగింది కమల.

"ఏమీ లేదులే. నువ్వెళ్ళి గ్లాసులు పట్టుకురా. పాలు కాచి, కాఫీ కలిపిస్తాను!" జగదాంబ మాట మార్చి, తన పనిలో మునిగిపోయింది.

# 2

సప్తాశ్వరథారూఢుడై సూర్యభగవానుడు ఉరకలు, పరుగులు పెడుతున్నాడు.

"కమలేదీ?" వంటపనిలో మునిగివున్న భార్య నడిగాడు గోపాలకృష్ణయ్య.

"దాని స్నేహితురాలు శారదకు సుస్తీగా వుందట. చూసొస్తా నని వెళ్ళింది. ఎందుకూ?"

ఏదో ప్రత్యేకమైన విశేషముంటేనే గానీ, ఇంట్లో వాళ్ళని గురించి భర్త భోగట్టా చేయడనే సంగతి తన ముప్పై సంవత్స రాల గృహిణీ జీవితంలో ఆమె తెలుసుకున్న మొదటి విషయం.

'ఊఁరికేనేలే! ఇందాక నువ్వో మాటన్నావు గుర్తుందా' గోడ వారగా పీట వాల్చుకుని కూర్చున్నాడు.

'ఎన్నో అన్నాను. ఏ మాటని గుర్తుంటుంది?' తను అన్న ఏ మాట ఆధారంగా, ఏ గాలిదుమారం లేవదియ్యాలని భర్త చూస్తు న్నాడో బోధపడలేదు జగదాంబకు.

'....మనవడు....మనవరాలని....'

'ఊఁ(.... ....అయితే?'

'మన మురళి ఎలాగూ మా మీనాక్షమ్మ అక్కయ్య కూతురు లలితను పెళ్ళిచేసుకోలేదు గదా?''

జగదాంబ కీ ఉపోద్ఘాతం అర్థంకావడం లేదు. తమ కున్న ఒక్కగా నొక్క కొడుకు మురళి! అతగాడు ఎం. ఏ. ప్యాసయి, ప్రస్తుతం గుంటూరు కాలేజీలో లెక్చరర్‌గా వుంటున్నాడు.

వాడికి తన మేనకోడలయిన లలితను ఇచ్చి పెళ్ళిచెయ్యాలని ఇటు గోపాలకృష్ణయ్యగారూ, అటు ఆడబడుచు మీనాక్షమ్మా, మహా ప్రయత్నాలు చేశారు!

కానీ మురళికి లలితంటే సుతరామూ ఇష్టం లేదు. అందుకే అతగాడు, తన కాలేజీ స్నేహితురాలైన 'రాధ' అనే అమ్మాయిని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళి అయి కూడా ఏడు సంవత్సరాలు నిండుతోంది........

"ఏం—నా మాట వినబడుతోందా?" గోపాలకృష్ణయ్యగారి అరుపుతో, ఆలోచనలనుంచి తేరుకుంది జగదాంబ.

'ఊఁ! మన మురళి రాధను పెండ్లాడి షుమారు ఏడేళ్ల నిండ వస్తోంది కూడాను!' వాస్తవం గుర్తుచేసింది.

'ఆ! ఏడ్చాడులే! మన కులంగాని పిల్లను ప్రేమించి పెళ్ళి అఘోరించాడులే!'

"ఏలాగో ఓలా లెండి! ఈడూజోడుగా సంసారంసాగిస్తున్నారు హాయిగా! మీరు, కోడల్ని మనింటికి రానివ్వనంత మాత్రాన ఇప్పుడు వాడి బ్రతుక్కేం లోటు వచ్చింది!" కోడల్ని ఇంటికి రానివ్వకుండా భర్త శాసనం చేశాడనే అక్కసు వెళ్ళగక్కింది జగదాంబ.

"అవన్నీ జరిగిపోయిన కథలు...."

"ఇక ఇప్పుడు జరగబోయే దేమిటో?"

"అదే చెబుతున్నానుగా? నువ్వింందాక మనవళ్ళూ, మనవరాళ్ళు అనగానే, నాకో కొత్త ఆలోచన వచ్చింది" సాలోచనగా భార్యవేపు చూచాడు గోపాలకృష్ణయ్య.

ఏమిటన్నట్టు చూపింది జగదాంబ.

"రాధకు ఇంతవరకూ, పిల్లాపీచూ కలగక పోయిరి. ఆ సాకుపెట్టి, ఆ అమ్మాయికి విడాకు లిప్పించి, మన కులం పిల్లను

చూచి పెళ్ళిచేద్దాం మురళికి.... సీతాపతి రెండు రోజులకో జాబు వ్రాస్తున్నాడు, తన కూతురు రుక్మిణి నిస్తానంటూ...." ఒక్క గుక్కలో చెప్పేశాడు, ఏదో బూజు దులుపుకున్నట్లు!

నిశ్చేష్టురాలై చూస్తోంది జగదాంబ!

'అదేమిటే? కళ్ళల్లోనుంచి ప్రాణంపోయిన దానిలా చూస్తావ్? ప్రాయశ్చిత్తం చేయించి, మళ్ళీ పెళ్ళి చెయ్యొచ్చు మన వాడికి! అంతెందుకూ? మా పెదనాన్న కొడుకు సుబ్బారావు నీకు గుర్తులేడూ? మన పెళ్ళయ్యాకేగా వాడు చచ్చిపోతా? వాడు....ఎవరు? మా సుబ్బారావు....ఇలాగే, ఓ కంసాలి అమ్మాయిని ప్రేమించానంటూ గోలెట్టి మా పెదనాన్న వాళ్ళకు తెలీకుండా, పెళ్ళిచేసుకు తీసుక చక్కా వచ్చాడు! అయితే మా పెదనాన్నా, దొడ్డమ్మా మనలా దద్దమ్మల్లా చూస్తూ వూరుకోలేదు. ఆ పిల్లకేదో మంచి మాటలు చెప్పి పాషాణపు మందేదోపెట్టి, గుట్టు చప్పుడుకాకుండా చంపేశారు! జ్వరంవచ్చి చచ్చిపోయిందని, అందర్నీ నమ్మించి శోకాలుపెట్టి ఏడ్చారు! ఆ తర్వాత సుబ్బారావుకు ప్రాయశ్చిత్తం చేయించారు. మళ్ళీ కులమింటి పిల్లనుతెచ్చి పెళ్ళి చేశారు. అయితే ఈ మారు సుబ్బారావుకే నూరేళ్ళు నిండాయనుకో! అకస్మాత్తుగా, కాస్తంత కడుపునొప్పివచ్చి, తల్లిపెట్టిన వాముతింటూ తింటూనే పుటుక్కున చచ్చి వూరుకున్నాడు! అది వేరే సంగతనుకో.... ...."

జగదాంబ కళ్ళు చింతనిప్పులయ్యాయి. భర్త హృదయంలోని వక్రపు ఆలోచన స్పష్టంగా బోధపడిందా క్షణంలోనే! ఆయనగారికి మురళి, తన మేనగోడలు లలితను చేసుకునివుంటే, లలితతోబాటు, మీనాక్షమ్మ ఆస్తి యావత్తూ, వచ్చివుండేదనే ఆశ వుంటూండేది! మీనాక్షమ్మకూ, లలిత తప్ప, మరిక సంతానమూ లేదు.

అది కుదరకపోవటమూ, పైగా మురళి రాధను వివాహం చేసుకోవటంతో అగ్గిబుగ్గయి పోయాడు! రాధతోబాటు కనీసం ఓ యాభై వేల ఆస్తో, డబ్బో అప్పనంగా వచ్చిపడుంటే, బహుశా పరాయి కులమనే పట్టింపు కూడా అంతగా పెట్టుకొనేవాడు కాదేమో!

అదీ జరగలేదు! రాధ చిన్నతనంలోనే తల్లీ, తండ్రి పోయారట! రాధ మేనమామ రాధను ఎలాగో చదివించి వదిలేస్తే, తన బరువు తీరిపోతుం దనుకున్నాడు! రాధ అదృష్టం బావుండి, మురళితో స్నేహం కలియటం, మురళి ఆమెను వివాహం చేసుకోవటం, చిన్నతనంనుంచీ, చీడపురుగులా పెరిగిన రాధ, సీతాకోక చిలుకలా మారి, ఆనందమయ జీవితం గడపటం జరుగుతోంది!

అలాటిది_ ఇప్పుడు ఏదో ఓ సాకుతో రాధనూ, మురళినీ విడదీయటమా? సీతాపతిగారంటే ఎవరో కాదు! మీనాక్షమ్మ మరది గారే! ఆయనకు ఏడుగురు ఆడపిల్లలు!

కట్నం కానుకలు లేకుండా, ఎలాగో ఓలా, ఆ ఆడపిల్లల్ని వదలించుకోవాలని సీతాపతి ఆలోచన! అందుకే మురళికే రుక్మిణిని కట్టబెట్టాలని, అందుకుగాను, ఎన్నెన్నో పథకాలు వేస్తున్నాడు గోపాలకృష్ణయ్యతో రహస్యంగా!

"ఏమంటావే జగం?"

త్రుళ్ళిపడింది జగదాంబ! మరునిమిషంలో అపరకాళీ అవతారంలా మారిపోయింది!

"నా కంఠంలో ప్రాణముండగా జరగనివ్వను. కులమో, కాదో, మురళికి నచ్చింది! వాడు పెళ్లిచేసుకున్నాడు, లక్షణంగా కాపురం చేస్తున్నారు, వాళ్ళిద్దరూ! వాడిసుఖంకంటే మనక్కావాల్సిం దేముంది? ఏదో ఓ సాకుపెట్టి వాళ్ళ చిన్నసంసారం ఛిన్నాభిన్నం చేద్దామనే? ఎన్ని సంసారాలిలా కూల్చామో, ఎన్ని పాపాలుచేశామో క్రితం జన్మలో! ఈ జన్మలో చూడండి! మన కళ్ళెదుట లక్షణంగా కాపురం చేసుకోవాల్సిన పిల్ల కమల.... ఒక్కగా నొక్కపిల్ల, విధవరాలై ఏడుస్తోంది! ఇంకా చాల్లేదూ ఈ జన్మకు?"

"ఉష్! అలా అరుస్తావెందుకూ? సలహా యిమ్మన్నాను గానీ, నీతులు చెప్పమన్నానా? పిల్లలసాకు గాకుంటే మరోటి ..." గోపాలకృష్ణయ్య లేచాడు.

"హుం! ఎలా అయితేనేం? వాళ్ళ జీవితాలు పాడుచేసి, వాడికి రెండో పెళ్ళి చేస్తానంటారు అవునా?" జగదాంబ అరిచింది.

"జగం! నా పట్టుదల నీకు తెలుసు....ఏడేళ్ళుగా, వాడు నాకు తెచ్చిన అపవాదు అంతా ఇంతా కాదు...."

"ఏం? ఏ మపవాదు తెచ్చాడు? కులంగాని పిల్లను చేసుకున్నా డనేగా! అదొక్కటేగా మీరు చూపుతున్న సాకు? ఓ కులమనీ, స్థల మనీ లేకుండా, ఎందరి ఇళ్ళ చుట్టూరా తిరగలేదు మీరు? నిజానికి మనదేకులం?"

"నోర్ముయ్! ఆడకుంకవు! నీ సలహా ఏమిటి? నా ఇష్టంవచ్చి నట్లు చేసుకుంటా!" గోపాలకృష్ణయ్య గబగబ వాకిట్లోకి వెళ్ళి పోయాడు.

"వెళ్ళండి! వెళ్ళండి! జన్మజన్మలకూ సరిపడా ఘోరాలు చెయ్యండి!" నిస్సహాయురాలిలా అరుస్తూ కుప్పగా కూలబడింది జగదాంబ! ఆమె తలలో ఆలోచనలు సుడులుతిరుగుతున్నాయి. గత మంతా గిర్రున తిరుగుతోంది.

# 3

గోపాలకృష్ణయ్య స్వభావం చిత్రమైంది. వయస్సులో ఉన్న ప్పుడు, వారకాంతల ఇళ్ళచుట్టూ ప్రదక్షిణాలు చేశాడు! ఎప్పుడో ఏ నిమిషంలోనో భార్యమీద జాలి, ప్రేమ పుట్టుకొచ్చేవి. తాత్కాలి కంగా అలాటి సమయాలలో ఆయన ప్రదర్శించిన అనురాగపు నటన తాలూకు ప్రతిబింబాలే- మురళి, కమల!

కమలకు పదిహేను సంవత్సరాలు నిండగానే వివాహం అయింది! కానీ, కమల కాపురానికూడా వెళ్ళకముందే, కనీసం దాంపత్యజీవితంలోని మొదటి మెట్టుమీద కాలుంచకముందే, వివాహమైన మరునటినెలలోనే, పెళ్ళికొడుకు టైఫాయిడ్‌వచ్చి హఠాత్తుగా చనిపోయాడు! పారాణి మాయకముందే, విధవగా మారింది కమల!

మురళి, ఎం ఏ. చదువుతూ, సెలవులకు ఇంటికొచ్చాడు. రాధ విషయం చెప్పాడు జగదాంబతో. "మన కులంగాని అమ్మాయినా?...." అంది ఆశ్చర్యంగా జగదాంబ.

ఓ వేపు భర్త హెచ్చరిక గుర్తుకొస్తూనేవుంది ఆవిడకు. "ఇదుగో! వాడా రాధనే పెళ్ళిచేసుకుంటే, నా ఆస్తిలో చిల్లిగవ్వ దక్కనివ్వను . ఈ గడప తొక్కనివ్వను!"

"పోనీ లలితలో నీకేంలోటు కన్పించిందిరా?" బి. ఏ. పాసయి నవనాగరకంగా మెరుపుతీగెలా వుంటుంది లలిత ...

"అమ్మా! లలితంటే నాకేమిటో అసహ్యం! లలిత గుణాలు నాకు నచ్చవు! మీనాక్షమ్మత్తయ్య అహంకారం, నాన్న చంచల స్వభావం లలిత కళ్ళల్లో కన్పిస్తాయమ్మా నాకు....నిజం చెప్పమ్మా! లలితను నీ కోడలుగా చేసుకోవటం నీకుమాత్రం ఇష్టం వుందా? కేవలం నాన్న పట్టుదలే కదూ? నాన్నకు ఎంతసేపూ లలితకంటే, లలితతెచ్చే ఆస్తిమీదే వుంది మనసు! కానీ నాక్కావల్సింది, ఆనందమయమైన దాంపత్యజీవితమమ్మా! ఆస్తికాదు!"

జగదాంబ మాట్లాడలేకపోయింది! అవును, మురళి చెప్పేదాంట్లో అబద్ధమేముంది? లలిత స్వభావం అహంకారపూరితమైందే కాదు, మురళి అన్నట్లు చంచలమైందికూడాను! కాలేజీలో ఎందరో ఆడపిల్లలు చదువుతుంటారు! కానీ లలితలా, మగపిల్లలతో వెకిలిగా, అతిచనువుగా ప్రవర్తించేవాళ్ళు ఎక్కువమంది వుండరనీ, ఎన్నో మార్లు ఎందరో చెప్పగా తనువిన్నది....

"పోనీ పరాయికులం కాకుండా...."

జగదాంబ మాటలు మధ్యలోనే త్రుంచేశాడు మురళి.

"అమ్మా! కులం కులం అని ప్రాకులాడుతారు; నిజానికి కులం మతం కేవలం మనం కల్పించుకున్న 'అహానికి' నిదర్శనలే నమ్మా! మా నాన్న దేకులం? మా తాతగారి దేకులం? సానికొంపల చుట్టూరా తిరిగేవారుట తాతగారు....నాన్నకూడా అంతే! కులమనే ముసుగువేసుకుని దానిమాటున నానా ఘోరాలు, నీతిబాహ్యమైన పనులూ చేసేకంటే, పరాయికులం పిల్లను పెళ్ళిచేసుకోవటంలో తప్పేముందీ?"

జగదాంబ చదువుకున్న స్త్రీకాదు! పాతకాలపు ఛాందసపు తల్లే కావచ్చు....అయినా, మురళి వాదనలో ఏమాత్రం పొరబాటు ఆమెకు కనిపించలేదు.

నిజమే. ఇష్టంలేని వివాహం చేసుకుని, జీవితాంతం విరస దాంపత్యం గడిపేకంటే. మనస్సుకు నచ్చితే _ చేసుకుంటే పరాయి కులం పిల్ల అయితేనేం? అదే స్వర్గతుల్యమైన జీవితమౌతుంది!

అందుకే జగదాంబ మరి రెట్టించలేదు వాదనను! మురళి, రాధ రిజిష్టరు మ్యారేజి చేసుకున్నారు! ఒక్కగా నొక్క కొడుకు! వాడి పెళ్ళి ఘనంగా, ఆనందంగా చేయలేకపోయామన్న దిగులు మాత్రం వేధించింది జగదాంబను! కారణం— గోపాలకృష్ణయ్య మరింతగా బిగుసుకుని వుండటమే!

తనకు కోడల్ని చూపించాలని, రాధను వెంటబెట్టుకువచ్చాడు మురళి. రాధ అందంగా, ఎంతో బావుంది! చక్కని సంస్కారం. అణకువ. ఆమె అణువణువునా ప్రతిఫలిస్తున్నాయి. కానీ గోపాల కృష్ణయ్య ఆగడంతో, ఆరోజే వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు!

రెండేళ్ళు జరిగాక, తన పట్టుదల కాస్త సడలించాడు గోపాల కృష్ణయ్య. అప్పుడప్పుడు మురళి వచ్చి వెళ్తున్నాడు. ఉత్తరాలు వ్రాసుకుంటున్నారు తండ్రి కొడుకులు.

ఆరునెలల క్రితం మురళి ఇక్కడికి వచ్చాడు. "ఏరా మురళీ! మీరేం పిల్లల సంగతి అనుకోలేదు!" అంది జగదాంబ.

మురళి నవ్వాడు. "మాకంటే ఎక్కువ, నీకే మనవణ్ణి ఎత్తుకోవాలని సరదాగా వున్నట్లుంది కదమ్మా! అయినా నా బిడ్డల్ని నాన్న ఇంట్లోకి రానిస్తారా" అన్నాడు.

జగదాంబ గుండెలు పిండినట్లయింది.

"అలా అనకు నాయనా! నిన్ను రానిస్తున్నారుగా మీ నాన్న! ఇక కొన్నాళ్ళు పోయాక కోడల్ని రానిస్తారు. ఆ తర్వాత మనవళ్ళని నెత్తికెత్తుకుంటారు. పంతాలూ, పౌరుషాలూ కలకాలం వుంటాయ్రా!" అంది.

"మొన్న నీ మధ్యనే రాధకు ఆపరేషన్ చేయించాను!"

'ఎందుకూ?" విస్మయంగా అడిగింది.

"పిల్లలు పుట్టటానికి!" మురళి నవ్వాడు

"తమాషా రోజులురా ఇవి! పిల్లలు వద్దనుకుంటే పుట్టరు! కావాలనుకుంటే పుడతారు!"

మురళి నవ్వాడు. "కాలం ఇంత త్వరగా మార్పు చెందుతున్నా, నాన్నలాటివాళ్ళల్లో మాత్రం మార్పు రావటం లేదమ్మా!"

"వస్తుంది నాయనా! అదీ వస్తుంది."

ఊరికి వెళ్ళేముందు మురళి మరీ మరీ చెప్పాడు కమల విషయం.

"అమ్మా! అలా కమలను ఇంట్లో కట్టిపడెయ్యటమెందుకు! దానికి దేవుడు చేసిన అన్యాయం చాలక మనమూ చెయ్యడమా! నా వెంట పంపండి.........ప్రైవేటుగా మెట్రిక్‌కు కట్టించి, తగిన సంబంధం చూసి పెళ్ళిచేద్దాం!"

జగదాంబ భయంతో బిగుసుకు పోయింది!

"అమ్మయ్యో! మీనాన్న చస్తే ఒప్పుకోరురా!" అంది.

"నీకు ఇష్టమున్నా, నాన్నకోసం ప్రతిపనీ చెయ్యటానికి భయపడ్తావమ్మా!....ఎలాగో నాన్నను ఒప్పిస్తాగా!" అన్నాడు.

"మరోమారు చూద్దాంలే నాయనా!" అంది జగదాంబ! ఆమెకూ మురళి ఊహే నచ్చింది!

మురళి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత మురళి వ్రాసే ప్రతి జాబులోనూ, రాధను గురించిన విశేషం ఏదేనా వుంటుందేమోనని తను ఆత్రంగా వినేది భర్త చదువుతూంటే! అలాటిదేమీ లేకపోవటంతో, నిస్పృహ ఆవరించేది....ఇలా సుమారుగా ఏడేళ్ళు గడచిపోయాయి....

ఈ రోజు ఈ వాగ్యుద్ధం....గోపాలకృష్ణయ్యపంతం....

"ఏమిటమ్మా? ఏమయింది?" కమలభుజంపట్టి కుదుపుతూ అడగటంతో, ఇహలోకం లోకి వచ్చింది జగదాంబ. గబగబ కన్నీళ్ళ తుడుచుకుంది.

"నా బ్రతుకిలా అయిందని, ఎన్నిసార్లు ఏడ్చినా లాభంవుందా అమ్మా?" అంది కమల ఓదార్పుగా! మరింతగా కెలికినట్లయింది జగదాంబకు....ఎలాగో సంబాళించుకుంది. "అలాగేతల్లీ!" అని మాత్రం అనగలిగింది. "భగవాన్! నాబిడ్డల జీవితాలు పాడుచెయ్యకు తండ్రీ!" మనసులోనే ప్రార్థించి, మౌనంగా, మళ్ళీ వంట పనిలో మునిగి పోయింది జగదాంబ ...

# 4

"ఆ హా! ఏం పర్సనాలిటీ....ఏం పర్సనాలిటీ?

స్వెట్టరు అల్లుతున్న రాధ తలెత్తి చూచింది. నిలువుటద్దం ముందు నిల్చుని, మురిసిపోతున్నాడు మురళి.

"భలేవారే! ఎంతసేపలా అద్దానికి అంటుకుపోయి, మిమ్మల్ని మీరు మెచ్చుకుంటారూ?" రాధ కిలకిల నవ్వింది.

"ఇదుగో అమ్మాయ్! అలా నవ్వితే నా కోపం వస్తుంది.... కాకున్నా నీ కెందుకు నాఊసు?" అన్నాడు మురళి నొక్కులక్రాపు మరోమారు దువ్వుకుంటూ!

"ఎంత అందగాళ్ళయినా అస్తమానూ మిమ్మల్ని మీరు పొగుడు కోవటం...."రాధ మాట పూర్తికాకుండానే పెద్దగా నవ్వాడు మురళి.

"ఓహ్! అదా సంగతి! నీ అందాన్ని వర్ణించలేదనా నీ బాధ! అయితేవిను....ఆహాహా! ఆచట్టిముక్కు అందం ఏమని వర్ణించను! పిలకజడ హొయలు....పిల్లికళ్ళచూపూ, తెల్లటి పొట్టి విగ్రహపు సొంపూ...."

రాధ తన చేతిలోని సూదు అక్కడ పడేసి లోపలి గదిలోకి వెళ్ళింది.

"రాధా! ఓ రాధాదేవీ! హమ్మయ్యో! ఇదంతా అలకే!" మురళి గబగబ లోపలికివచ్చాడు. పేముకుర్చీలోకూర్చుని రాధ పరాకు నటిస్తోంది.

"అలక వచ్చినా ఆడవాళ్ళకు అదీ ఓ అందమే!" రాధ దగ్గరగావచ్చి భుజాల చుట్టూ చేతులువేసి అన్నాడు మురళి.

"ఇప్పుడు వర్ణించారుగా నా అందం? ఈ అందాన్నే తెగమెచ్చు కొనేవారుగా?"

"రాధా! నీ నల్లటి పెద్దకళ్ళలో తియ్యటి లోకాలెన్నో కవి పిస్తాయ్ నాకు! చక్కగా వంకులు తిరిగిన పట్టుకుచ్చులాటి పొట్టి జడ అలా నీ భుజం మీదుగా ముందుకు పడివుంటే, ఎంచక్కా వుంది! ఆడవాళ్ళు మరీ గెడకర్రల్లా, సన్నగా, పొడుగ్గా వుంటే ఏం బావుండదు. నీలా అంత మరీపొట్టీ, మరీ పొడవుగాని సమ ఎత్తులో కుందనపు బొమ్మల్లా వుంటే అందం!"

"ఇలా ఎన్నికబుర్లు చెప్పేవారో? ఛీ... ఛీ....మీ మగవాళ్ళవి పాము నాలుకలు బాబూ!"

మూతి బిగించుకు కూర్చున్న రాధను చూస్తుంటే, నవ్వు ముంచుకువస్తోంది మురళికి.

"రాధా! ఈ రోజుల్లో ఇలా అలిగి బుంగమూతి పెట్టడం ఫ్యాషన్ కాదోయ్! సమానంగా నాతో పోట్లాడాలి! 'చట్టి ముక్కు' అంటూ నిన్ను ఉడికించాననుకో. 'బుర్రముక్కుండీ' మీది అనలేవూ? పిలకజడా అనగానే...."

రాధనవ్వింది. "....బట్టతలా....పొట్టి విగ్రహం అనగానే జెండా బొంగూ....చాల్లెండి....పిసినారి వెడదా మన్నారు. కబుర్లు పెట్టుకు్కూర్చున్నారు!"

మర్చేపోయాను సుమా! ఇదేమిటి? నీ అలంకరణ ఇంకా కాలేదే? శంకర్ కార్టూన్ లోలా నీ అలంకరణ పూర్తయేసరికి నాకు మూరెడు గడ్డం వచ్చేస్తుందా?"

మళ్ళీ మొదలెట్టారూ? మీరు మీ ప్రతిబింబాన్ని చూసుకుని మురిసిపోతూ క్రాపు దువ్వుకొనేంతలో నేను పది మార్లు అలంకరించు కోగలను...."

ఐదు నిమిషాలలో బయటికి వచ్చిన రాధ వేపు, అనిమిషునిలా చూస్తూనిల్చున్నాడు మురళి. ముదర ఎరుపు, జరీబార్డర్ ప్యూర్ క్రేప్ సిల్కుచీరె, పసుపుపచ్చ వెల్వెట్ జాకెట్టు, ఎర్రరాళ్ళ దుద్దులు, నుదుట ఎర్రని కుంకుమబొట్టు, వదులుగా రింగులు తిరిగివున్న జడలో ఒకే ఒక ఎర్రగులాబిపువ్వుతో, తెల్లని రాధ- మరింత తెల్లగా సంధ్యారుణ సమయంలో, అరవిరిసిన మల్లెపూవులావుంది. గబుక్కున రాధ దగ్గరగా వచ్చి, ఆమె చుట్టూ చేతులు వేశాడు మురళి....

''అరె!...ఓవేపుతైం అయిపోతూంటే....'' సుతారంగా మందలించింది రాధ....

"అయిపోనిద్దూ! నీ అందం కంటే, ఆ సినిమా ఎక్కువా ఏమిటి?"

"మరీ బావుంది ..."

సరదాగా సినిమానుంచి వచ్చి, భోజనంచేసి పడుకున్నారు రాధ ,మురళి. కాస్సేపట్లో మురళి నిద్రపోయాడు పైన చల్లటి జాబిల్లి. పాల నురుగలాటి పక్కమీద. తనప్రక్కనే మన్మథ సమాన రూపుడైన భర్త! ఎప్పుడూ సరదాగా నవ్వుతూ. నవ్విస్తూ అనుక్షణం ఇంద్ర ధనస్సులాటి రంగురంగుల జీవిత మాధుర్యాన్ని అణు వణువునా, చవిచూపే భర్త! ఇంతటి దివ్య వరం ఎందరు స్త్రీలకు లభిస్తుంది?

"భగవాన్! ఈ అదృష్టంచాలు! ఈ నాఅదృష్టం ఇలాగేవుంచు. మరేమీ కోరను!'' అప్రయత్నంగా పైకి వెలువడ్డాయి రాధ హృదయంలోని మాటలు. మురళిచుట్టూ చేతులువేసి తృప్తిగా నిట్టూర్చింది రాధ.

అందాకా నిద్ర నటిస్తున్న మురళి కంఠం ఆమెచెవిలో మధు రంగా ధ్వనించింది ''అయిందా నీ ప్రార్థన?'' అంటూ.

* * *

ఉదయం తొమ్మిది గంటల ప్రాంతంలో వరండాలో కూర్చుని పేపరు చూస్తున్నాడు మురళి. రాధ వంట చేస్తోంది. పోస్ట్ మ్యాన్ తెచ్చిచ్చిన కవరు అందుకుని ఆత్రంగా విప్పాడు మురళి మరు నిమిషంలో కెవ్వున కేక వేశాడు....

''రాధా! రాధా! త్వరగా రా!''

గాభరాగా బయటికి పరుగెత్తు కొచ్చింది రాధ.

''కొంప మునిగింది!'' అన్నాడు మురళి.

రాధకు కంగారు ఎక్కువైంది. "ఎవరి కే మయింది? త్వరగా చెప్పండి!'' అంది భయంగా.

"ఎవరిది?" ఏమో అయితే [illegible]

"అబ్బబ్బ! చంపక త్వరగా చెప్పండి!"

"నువ్వే చదువుకో! నే చెప్పలేను!" కవరు రాధ చేతికిచ్చి, ఉస్సురని కుర్చీలో కూర్చున్నాడు మురళి.

రాధ చదవటం మొదలెట్టింది.

"డియర్ మిష్టర్ మురళీ,

మా వ్యాపారం, మద్రాసునుంచి గుంటూరుకు మార్చు కుంటున్నాము. అదే సెంటరుగా చేసుకుందామని నిర్ణయించుకున్నాం. మా వ్యాపార బాగస్థులమంతా! పది రోజుల్లో నేను, మీ మరదలు లలిత (నా భార్య)కలసి అక్కడికి వస్తాం. ఈ లోపల వసతిగా వుండే బంగళా ఒకటి అద్దెకు చూడగోరుతాను. చెల్లాయి రాధను అడిగానని చెప్పగోరుతాను. మీకు శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించ గోరుతాను.

ఇట్లు,
మీ సోదర సమానుడు,
కృష్ణమోహన్

అందులోనే మరో కాగితం రాధకు అడ్రస్ చేయబడి వుంది.

"డియర్ రాధా!

మా మురళిబావ తన పెండ్లి గుట్టుచప్పుడుకాకుండా చేసు కున్నాడు కాబట్టీ, అదే సంవత్సరం నాకూ పెళ్ళయి, నేను మా శ్రీవారితో మద్రాసులోనే కాపురం పెట్టెయ్యటంతో, నిన్ను చూసే అవకాశం కలగలేదు. ఇప్పుడు ఏకంగా, మీ దగ్గరకే వస్తున్నాం మేం. మా బావకు, మా శ్రీవారు అన్ని వివరాలూ వ్రాశారుగా! నువ్వు కూడా మా బావకు రెకమెండ్ చేసి, త్వరలో మాంచి ఇల్లు బాడుగకు దొరికేలా చూడు. ముఖ పరిచయం లేకున్నా, నాకు నీవు

కదూ ?

ఇక వుంటా,
నీ సోదరి
లలిత

"ఇదేనా కొంప మునగటం?" కోపంగా మురళి వేపు చూచింది రాధ! చిన్నతనంనుంచీ ఇంత ఆత్మీయత, ఒక్క మురళి దగ్గర మినహా, మరే బంధువులనుంచీ తనకు లభ్యం కాలేదు! అలాటిది అయాచితంగా, లలిత తనను సోదరిగా మన్నించి, ఎంత చనువుగా, ఎంత ఆత్మీయంగా వ్రాసింది!

"ఆ! కొంప మునగటం గాక మరేమి టనుకున్నావు? వాళ్ళిద్దరూ ఎవరని నీ భావం?" విస్మయంగా అడిగాడు మురళి.

"అతగాడు కృష్ణమోహన్, ఆవిడ మీ మరదలు లలిత."

"ఊహూం, వుట్టి మరదలు కాదు! నాకు అర్ధాంగి కావాలని ఉవ్విళ్ళూరి, నువ్వు తన స్థానం ఆక్రమించుకున్నావని తెలిసి, వుడికి పోయి, పగబట్టిన కోడెత్రాచులా బుసకొట్టి మరీ వెళ్ళిన మరదలు" వ్యాఖ్యానించాడు మురళి.

"అవన్నీ మీ ఊహా గానాలు మాత్రమే! మీ మేనత్త కూతురు కాబట్టి, సహజంగా మీ మీద కొంత అనురాగమూ, అధికారమూ హెచ్చుపాళ్ళలో వుంచే వుండి వుండొచ్చు....మీరు తనను వివాహ మాడతారని వూహించి వుండొచ్చు.... మీరు నన్ను పెళ్ళాడారని తెలిసి కాస్త బాధపడి వుండొచ్చు... "

రాధ మాటలు ఇక సాగనివ్వకుండా, మురళి అడ్డుపడ్డాడు.... "ఇప్పుడు ఆ వెనకటి కోపం తీర్చుకోదల్చుకుని వుండొచ్చు.... వెర్రిపిల్లా! ఇంత అమాయకురాలివి....నువ్వెలా బి. ఏ. చదివావో.... నాకేం అర్థం గావటంలేదు!" జాలిగా చూచాడు మురళి

"సర్లెండి—లేనిపోని అర్థాలు కల్పించి, అనవసరంగా ఇత రులను యాగీ చెయ్యాలంటే. నే చెప్పలేను గానీ, కాస్త మామూలుగా ఆలోచిస్తే, పాపం లలిత చూడండి. ఎంత చనువుగా, ఎంత ఆత్మీయంగా, వ్రాసిందో!"

"సరే! ఇక నేనేం చెప్పగలను! నీ ఇష్టప్రకారమే వాళ్ళ నిక్కడకురానీ!"

"ఇది మరీ బావుంది! వాళ్ళిక్కడికి రావటానికి మన ఇష్టానిష్టాలేమిటి? ఎవరి పనులూ, ఎవరి అవసరాలూ వా— —!"

"అందుకే నోరు నొక్కుకున్నాను డియర్!"

"మరైతే త్వరగా దగ్గర్లో మాంఛి ఇల్లొకటి చూడండి. మీరూ మీ స్నేహితులూ కలిసి!"

"ఇల్లు చూస్తాను గానీ, దగ్గర్లో మాత్రంకాదు.... మనింటికి సుమారు రెండు మైళ్ళ దూరమన్నా వుండాలి...."

"అదేం?" విస్మయంగా అడిగింది రాధ.

"అదంతేనండీ రాధాదేవిగారూ! బంధువులకు.... అందునా లలితలాటి ప్రమాదకర బంధువులకు కొన్ని మైళ్ళ దూరంలో వుండటమే శ్రేయస్కరము!"

'మీ యిష్టం!'

# 5

అనుకున్న రోజురానేవచ్చింది. రాధ, మురళీ-లలితాకృష్ణమోహన్ల రాక కోసం ఎదురు చూస్తున్నారు. వాకిట్లో కారాగింది.... మురళీ,

రాధ సాదరంగా ఎదురు వెళ్ళారు. క్షణకాలం రాధ, లలిత పరస్పరం చూసుకున్నారు విస్మయంగా! తెల్లగా, సన్నగా, పొడవుగా, అతి నాజూకుగా, అత్యంత ఆకర్షణీయంగా వుంది లలిత! పొడుగుపాటి రెండు జడలు, చెవులకు ముత్యాలరింగులు కట్టుకున్న టెర్లిన్ చీరె- ఒక దాని కంటె మరొకటి అందంగా వున్నయ్! "ఇంత అందమూ, ఆకర్షణా వున్న మరదలిని మురళి ఎందుకు తిరస్కరించారో?" అనుకుంది రాధ విస్మయపడుతూ మనసులో.

అదే నిమిషంలో లలిత కూడా రాధను గురించి ఆలోచిస్తోంది. "తెల్లగా, బొద్దుగా అందంగా వుంది రాధ! అందంలో నాకే మాత్రం సాటిరాని ఓ శుద్ధ బుద్ధావతారంలా వుంటుంది అనుకుని నేను తృప్తిపడేదాన్ని తరచూ... కానీ మురళి బావ సెలక్షన్‌లో ఏ మాత్రం పొరబాటు లేదు నాలా అతిగా అలంకరించుకుంటే బహుశా నాకంటే కూడా అందంగా కనిపిస్తుంది రాధ."

"ముందు ఈ సంగతి చెప్పండి నిర్మొహమాటంగా! మా రాధ చేతివంట మీరు తింటారో లేదో నని, అవసరమైతే హోటలు నుంచి క్యారియర్లు పట్టించుకు వద్దా మనుకున్నాం. మరి మీరు....!"

మురళి మాటలతో త్రుళ్ళి పడ్డారు రాధ, లలిత!

"నో! నో! అలాటి పట్టింపులేమీ మాకు లేవు!" అన్నాడు కృష్ణమోహన్, నొచ్చుకుంటూ! చామన చాయ, ఆకర్షణీయంగా వున్నాడు.

లలిత బాగా తెప్పరిల్లింది. రాధ భుజం మీద స్నేహ పూర్వకంగా చెయ్యి వేసింది. "క్రొత్తగా మాట్లాడు తున్నావేం బావా? హోటల్స్‌లో, ట్రెయిన్స్‌లో, డిన్నరు పార్టీలలో, మన కందరికీ మడిగట్టుకు వండి, వడ్డిస్తున్నారా? నీకీ బుద్ధులేమిటయినా? సంబంధం కలిశాక, కులం వేరెలా అవుతుందీ? కాకున్నా, రాధా! ఇంత ఆకతాయి భర్త నెలా సహిస్తున్నావో నువ్వు?" అంది లలిత చలా

కీగా, కళ్ళు చిత్రంగా తిప్పుతూ, చెవుల రింగులు కదలలా తల వూగిస్తూ!

"మా కృష్ణమోహన్ నిన్ను భరించటంలేః అలాగే నన్నూ భరిస్తోంది రాధ! కాకున్నా ఈ అల్లరిపిల్లతో ఎలా వేగుతున్నారండీః" అన్నాడు మురళి నవ్వుతూ!

లలిత లానే లలిత మాటలూ, చనువూ, ఆత్మీయతా ఎంతో అందంగా, ఆహ్లాదకరంగా గోచరించాయి రాధకు. వాతావరణం తేలికగా హాయిగావుందిః రాధ నవ్వి వూరుకుంది. తర్వాత మెల్లిగా "లోపలికి రాండి...." అంది లలితతో.

"అరెః అండీః ఇదేమిటి రాధాః ఈ అండీలు కొండీలు మన కొద్దుః హాయిగా బంధుత్వాలనూ, గౌరవ వాచకాలనూ మర్చిపోయి, చక్కగా పేర్లతో చనువుగా పిలుచుకుందాం! అందులోవున్న ఆనందం మరి దేన్లోనూ వుండదుసుమాః" అంది లలిత....

"అలాగే లలితా!" కొండంత ఆనందం కలిగింది రాధకు.

"బాబోయ్, ఆడవాళ్ళిద్దరూ ఏకమై, మమ్మల్ని మర్చి పోయేరు!" అన్నాడు మురళినవ్వుతూ.

"ఊహూఁ! మీ మగాళ్ళెంత దగాకోరయినా, మా ఆడ జాతంతా ఒకటేః" అంది లలిత.... ఆ మాటలలోని వ్యంగ్యం మురళికి మాత్రమే బోధపడింది. చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

భోజనాలు అయ్యాక, సాయంత్రం, అందరూ కృష్ణమోహన్ కారులో, మురళి కుదిర్చిన బంగళాకు బయల్దేరారు. సుమారు రెండు మైళ్ళ దూరంలో, కొత్తగా కట్టిన "కాలనీ" అది. అక్కడక్కడా అరఫర్లాంగు కొకటి చొప్పున బంగళాలున్నాయ్. చుట్టూరా మైదానం. ప్రశాంతంగా, కళవారికి అనువుగావున్న ప్రదేశంః

"ఎలా వుందండీ బంగళాః టౌనుకు కాస్త దూరమే అయినా, పరిశుభ్రంగా వుంటుందని ఇక్కడ చూచాను. పైగా మరోవిషయం

మీకు బంగళాకొనె వుద్దేశముంటె, న్యాయమైన ధరకు ఇస్తానన్నాడు బంగళా యజమాని....ఏమంటారు?" అన్నాడు మురళి.

లలిత పకపక నవ్వింది...."అన్నీ నువ్వే చెప్పి, 'ఏమంటారు?' అంటే ఆయనేమంటారు మరి?"

మురళి సిగ్గుపడిపోయాడు...."సారీ! మీ ఉద్దేశం చెప్పారు కారు!" అన్నాడు కృష్ణమోహన్‌తో.

"చాలా బావుంది....కానీ ముందస్తుగా మా లలితకు నచ్చిందో లేదో కనుక్కోండి.. " అన్నాడు లలిత వేపు క్రీగంటచూస్తూ.

"ఏం లలితా?"

"నాకు బొత్తిగా నచ్చలేదు బావా!"

"చచ్చాం ఫో! ఇక త్వరలో దొరికే ఇళ్ళుకూడా ఏమీలేవు!" విస్పృహగా అన్నాడు మురళి.

"ఏమిటి బావా నీ వెర్రి? ఇదేం చీరెలూ, జాకెట్లూ సెలెక్టు చెయ్యడమా - ఇది కాకుంటే మరో షాపు కెడదాం అనుకోవటానికి? బంగళాకేం? దివ్యంగావుంది. ఎటొచ్చీ, మీ ఇంటికి చాలాదూరం...." మురళి హృదయంలోని గుట్టు కనుక్కున్నట్లు కళ్ళు చికిలించింది లలిత....

"బ్రతికించావు....ఏం చెయ్యను మరి? మా ఇంటికి దగ్గర్లో ఈమాత్రపు బంగళా లేదు...."

"ఏం రాధా? ఎంతసేపూ మా నోళ్ళు నెప్పెట్టాల్సిందేనా? బావా? రాద నసలు మాట్లాడ నివ్వవా?" అంది లలిత. రాధ చిరునవ్వు నవ్వి వూరుకుంది.

"ఆవిడ బదులూ, మా బదులూ, నువ్వే మాట్లాడేస్తున్నావ్ లలితా! మా కింకేం మిగులుతున్నాయి మాటలు?" కృష్ణమోహన్ నవ్వుతూ అన్నాడు.

రాత్రి పొద్దుపోయేవరకూ అక్కడే గడిపి, ఇంటికి బయ ల్దేరారు మురళి, రాధ.

"నేను వ్యాపారపు పనులమీద తరుచూ క్యాంపులకు వెడు తుంటాను....మీరు అప్పుడప్పుడు వస్తూండండి....'' అన్నాడు కృష్ణమోహన్ రాధవేపు, మురళివేపు చూస్తూ....

''తప్పకుండా! లలితా, నీకూ ఒక్కర్తెకూ ఇంట్లో తోచదు కదూ? తరుచు మా ఇంటికి వస్తూండు! బాగా ప్రొద్దుపోతుంది; మాకూ సందడిగావుంటుంది!" అన్నాడు మురళి.

''అలాగే!''

మురళి, రాధ ఇంటికి వచ్చేశారు ...

# 6

ఎంతగా బుర్ర బద్దలుకొట్టుకున్నా, సీతాపతి చెప్పే భాషలో, కొడుకుకు ఉత్తరం ఎలా వ్రాయాలో బోధపడలేదు గోపాల కృష్ణయ్యకు. నాలుగురోజులుగా, సీతాపతివచ్చి, యిక్కడే తిష్టవేసు క్కూర్చున్నాడు. రుక్మిణిని మురళికిచ్చి పెళ్లిచేసెయ్యమని.... అవసర మైతే, ఓ ఐదెకరాల మాగాణికూడా, రుక్మిణిపేరిట యిస్తాననీను.... సీతాపతి మాటలు గోపాలకృష్ణయ్య నమ్మితే నమ్మవచ్చు గానీ, వివేక మున్న మరే మనిషీ నమ్మడు! ఐదెకరాల మాగాణి యివ్వగలిగిన పెద్దమనిషి- పెద్దకూతుర్ని, ఓసారి పెళ్ళయిన కుర్రాడికి యిచ్చి ముడి పెడతానంటాడా?

అయితే, ఇంతదూరం ఆలోచించే ఓపిక గోపాలకృష్ణయ్యకు లేదు... ఏదో ఓ సాకుపెట్టి, మురళికి రాధను వదిలించి, ప్రాయశ్చిత్తం చేయించి, రుక్మిణినో, మరెవతనో, ఆ పళంగా కట్నంతోసహా, ముడి పెట్టించి, తన పెద్దరికం నిలుపుకోవాలనే కోరిక ఆయనలో ప్రబలంగా వుంది! దానికితోడు సీతాపతి, చెవులు దిబ్బెళ్ళుపడిపోయేలా రొద చేస్తున్నాడు పీకలమీద కూర్చుని!

ఆ మటుకు ఇక వేగలేక అన్నాడు గోపాలకృష్ణయ్య:

"అదికాదోయ్ సీతాపతీ! వెధవ చట్టాలెన్నో పీకల మీదున్నాయి చూడు! బహుభార్యాత్వం పనికిరాదని ఓ చట్టం. భార్య బ్రతికుండగా, భర్త వివాహం చేసుకోగూడదని మరో చట్టం. కట్నం అసలే తీసుకోకూడదనీ ఇంకో ముండమోపిచట్టం....ఇలా ఈ చట్టాలన్నీ ఏకమై, మనల్ని చట్రాలలో బిగిస్తున్నాయి సీతాపతీ!"

సీతాపతి భళ్ళున గాజుగ్లాసులు పగలగొట్టినట్లు నవ్వాడు. "చట్టాల దారి చట్టాలదీ....మనదారి మన దీనూ! అన్నాడు వేదాంతిలా, నవ్వు పొర మార్చుకుంటూ,

"అదేమిటోయ్. ఏదో అఘాయిత్యంచేసి, ఇద్దరం కలిసి శ్రీకృష్ణ జన్మస్థానం చూద్దా మంటావు?" గాభరా పడ్డాడు గోపాలకృష్ణయ్య.

"బావా! ఇంకా ఏమిటోననుకున్నాను.... నీది వెదురుబొంగు తత్వమే!" వెటకారంగా అన్నాడు సీతాపతి

"అంటే?" ఆశ్చర్యంగా అడిగాడు గోపాలకృష్ణయ్య.

"పైకి పొడుగ్గా, లావుగా కనిపించినా, లోపలంతా డొల్లేనని అర్థం!"

"సరిగ్గా చెప్పరాదూ?" విసుక్కున్నాడు గోపాలకృష్ణయ్య.

"ఈ రోజుల్లో చట్టాన్ని సక్రమంగా అమలుజరిపే వా డెవడయ్యా? బావా! 'కట్నాలు ఇవ్వటం, పుచ్చుకోవటం చట్టరూపేణా

నేరం' అన్నారు....బాగానేవుంది....కానీ ఇప్పటి కన్యాదాతనూ, పుచ్చుకొని వరుని తండ్రినీ, రెండూ చూస్తూ హర్షించని పెద్ద మనుషుల్ని చూపించు....మచ్చుకు ఒక్కణ్ణి! ఊహూ! లేరుబావా! లేరు అందాకా ఎందుకు? ఆ చట్టాన్ని ప్రవేశ పెట్టిన దేశనాయకులు కూడా, తమ కూతుళ్ళకు లక్షలకొద్దీ కట్నకానుకలు ఇస్తున్నారంటావా లేదా? పైగాగొప్పగా!మరి వీళ్ళందర్నీ ఎవరు శిక్షిస్తున్నారు?

క్షణకాలం అవాక్కుగా చూస్తుండి పోయాడు గోపాలకృష్ణయ్య.

"పురుషులకు భార్య బ్రతికుండగా, 'రెండో పెళ్ళి' నేరమన్నారు. బాటుగా చేసుకొనే వాళ్ళెంత మంది లేరు? వాళ్ళంతా చట్టప్రకారం భార్యాభర్తలు విడాకులిచ్చుకునే చేసుకుంటున్నారనుకున్నావా? ఊహూ!గుట్టుగా గుళ్ళో పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు! ఆడపిల్లనోరెంతలో మూయించాలయ్యా'

"ఆ పిల్ల ఒప్పుకోకుంటే? అప్పుడే వస్తుంది చిక్కు!" గోపాలకృష్ణయ్య ఆలోచనలో పడ్డాడు.

"వెంటా వెనక ఏ అండ చూసుకొని ఒప్పుకోదంటావు? పరువుగల తల్లిదండ్రులెవ్వరూ, తగునమ్మా అని, కూతుర్ని తీసుకుని కోర్టు కెక్కరు! ఇక నీ కోడలు రాధ లాంటి వాళ్ళా? ఏం చూసుకొని ఆ అమ్మాయి కోర్టు కెక్కుతుంది? ఆదరించే పుట్టింటివారా అనునయించే మెట్టినింటి వారా? ఎవరున్నారు?"

గోపాలకృష్ణయ్య మాట్లాడలేదు.

సీతాపతి ఇంకా సాగిస్తూనే వున్నాడు సంభాషణ. "చెరుకా! బెల్లం పెట్టమంటే పెడుతుందా? దాన్ని గానుగల్లో వేసి, పిప్పిచేసి, రసం తీసి, ఆ రసాన్ని మరిగిస్తే గానీ దారికి రాదు! భయం వల్లే పనులు జరుగుతాయి, బావా! భయంతోపాటు, కాస్త లౌక్యం జత చేస్తే దివ్యంగా నెరవేరుతాయి పన్లు!"

తత్వబోధ పూర్తయింది....

"మరైతే ముందస్తిగా ఉత్తరం వ్రాయమంటావ్?" అన్నాడు. గోపాలకృష్ణయ్య.

"ఊఁ! ఉత్తరంతో దారికి రాకపోతే, వుండనే వుందిగా భేదోపాయం!" బుర్ర మీసాలు కదలేశాడు సీతాపతి.

"సరే.... యీ రోజే రాసేస్తాను."

"మంచిది........ మరి నే వెళ్ళి, వారం రోజుల తర్వాత వస్తాను...." అన్నాడు సీతాపతి కూడా లేస్తూ.

సావిట్లో జరుగుతున్న యీ రహస్య సమాలోచ నేమిటో స్పష్టంగా బోధ పడలేదు జగదాంబకు. కానీ, సీతాపతి, గోపాల కృష్ణయ్య లిద్దరూ, కరటక దమనకుల్లా, యితరుల కొంపలు కూల్చటంలో ఘటికులని మాత్రం ఆమెకు తెలుసు. అందుకే లోలోపల గిలగిల లాడింది.... కానీ తనేం చెయ్యగలదు?

# 7

గుమ్మంలో అడుగుపెట్టిన లలిత ఠక్కున ఆగిపోయింది. వారగా వేసివున్న వాకిలి లోపల్నుంచి సంభాషణ స్పష్టంగా వినిపిస్తోంది. కుతూహలంగా వినసాగింది లలిత....

"అస్తమానూ ఇలా నా కొంగట్టుకు తిరుగుతూంటే చూచే వా ళ్ళేమనుకుంటారు?" అంది రాధ కంఠస్వరం.

"ఏమనుకుంటారు? మొగుణ్ణి కొంగు కట్టేసుకుం దనుకుంటారు. ఎవ రేమనుకుంటే మన కేం? హాయిగా నువ్వూ నేనూ యిలా...."

''అబ్బ! వదలండీ! స్టౌ మీద అన్నం పొంగి పోతోంది... స్టౌ ఆరిపోతోంది!''

''పోనిద్దూ....ఈ పూట క్యారియర్ తెప్పించేస్తాను హోటల్ నుంచి....నువ్వు నా దగ్గరుంటే, ఇక నాకేమీ అక్కర్లేదు.........''

ఇద్దరి నవ్వులూ, లలిత హృదయాన్ని బద్దలు చేస్తున్నాయి. ఇక బుసలు కొడుతున్న హృదయారాటాన్ని అణచుకోలేకపోయింది. దభీమని తలుపు నెట్టుకు లోపలికి వచ్చింది లలిత.

తుళ్లి పడారు మురళి, రాధ. మురళి గబుక్కున ప్రక్క గదిలో దూరాడు. రాధకు తప్పలేదు ...

ఎర్రవారిన బుగ్గలను దాచుకోవటానికి విఫల ప్రయత్నం చేస్తూ. ''రా లలితా! ఎంత సేపైంది వచ్చి?'' అంది ఎంతో ప్రయత్నం మీద....

''అబ్బే! ఇప్పుడే! మా బావ అలా పరుగెత్తా డేమిటి?'' లలిత పరిసరాల్ని పరీక్షగా చూస్తూ అంది.

''నిన్ను చూసే ఝడుసుకున్నాను లలితా!'' మురళి గది లోంచి అమాయకంగా వస్తున్నట్లు నటిస్తూ, నవ్వుతూ అన్నాడు. కానీ ఆ నవ్వు స్వతస్సిద్ధమైంది కాదని గ్రహించటాని కెంతో సేపు పట్టలేదు రాధకూ, లలితకూ.

''నే సంత ఝడుసుకునేలా వున్నానా బావా?'' కోపాన్ని పెదవులచాటునే అణుచుకుంది లలిత. కానీ ఆ కోపం తాలూకు ఛాయలు-ఆమె అదిరే అధరాలలోనూ, కళ్ళలోనూ ప్రస్ఫుటంగా ప్రతి ఫలిస్తూన్నాయి.

''అలా నేనన్నానా? నీ రాక అలా అనిపింపింపంతే! ఇంతకూ మా కృష్ణమోహన్ వూళ్ళో వున్నాడా? ఒకరీ రోజు సాయంత్రం మే మిద్దరం మీ యింటికి రావాలనుకుంటున్నాం కూడా'' మురళి గబగబ చెబుతున్నాడు. అంత ధారాళంగా అబ

ర్థాలు చెబుతున్న భర్తవేపు విస్మయంగా చూచి తల దించుకుంది రాధ....

"అవున్లే ...మీకు తీరొద్దూ: ప్రేమించి పెళ్ళిచేసుకున్న దంపతులు కదా? మామూలు దంపతులలా కాకుండా. ఎక్కువగా, క్రొత్త పోకడలతో సాగుతూంటుంది కాబోలు దాంపత్య జీవితం" లలిత నవ్వుతూ అన్నా, ఆ మాటలలో నిండివున్న అసూయకు చిరాకు కలిగింది మురళికి.

''ఇంతకూ కృష్ణమోహన్ ఊళ్ళో వున్నారో లేదో చెప్పావు కాదు.'' అన్నాడు మురళి మాట మారుస్తూ.

''లేరు.........బహుశా రాత్రికి వస్తారేమో ... అంచేతే ఇటు షాపింగ్ కని వచ్చి, మిమ్మల్ని పలకరించి వెళదామని వచ్చాను.... మరి వెళ్ళొస్తా!'' అంది లలిత.

"సాయంత్రం ఎలాగూ మేమూ మీ ఇంటికి వద్దామను కుంటున్నాంగా? అందరం ఒకే సారి వెళ్ళకూడదూ?'' అంది రాధ మర్యాదగా.

''ఊహూ(! కారు లేదు కదా? వారు తీసుకుళ్ళారు........ రిక్షాల్లో వెళ్ళాల్సిందేగా: ముగ్గురం ఓ రిక్షాలో ఎలా కూర్చుంటాం? కాబట్టి నే నలావెళ్ళి షాపింగ్ ముగించుకుని ఇంటికి వెళతాను. మీ రిద్దరూ తర్వాత రాండి.''

గబగబ వెళ్ళిపోయింది లలిత. తలుపు దభేలున మూసివేశాడు మురళి.

"హమ్మయ్య! తిన్నగా వెళ్ళింది. ఎదురుగా తిష్ఠవేసు క్కూర్చుంటుం దేమో నని హడలిపోయా నంటే నమ్మ! మొత్తం మీద మాంచి హుషారు నాశనం చేసింది!'' అన్నాడు మురళి రాధ ప్రక్కనే ఉస్సురని కూర్చుంటూ:

''ఏమిటి మీ ప్రవర్తన? ఆవిడతో అబద్ధా లాడేశారు? పైగా ముఖంలో కూడా ఏక చిరాకు ప్రదర్శించేశారు."

"నీకు తెలీదు రాధా! లలిత పద్ధతులు నాకు నచ్చవ్! చదువు కున్నదన్న మాటే గానీ సంస్కారం బొత్తుగా లేదు. ఇందాక, బహూశా, చాలా సేపై వుంటుంది తనొచ్చి! ఇక పట్టలేక, తలుపు త్రోసుకువచ్చి వుండాలి. ఆ సమయంలో లలిత ముఖంలో - అసూయ, ద్వేషం, ఎంతగా కన్పించాయో నాకు? అసలు చిన్నతనంనుంచీ లలిత తత్వమంతే! చాటునుంచి వినటం, చాటునుంచి చూడటం. ఒకటేమిటి? అన్నీ వెధవ బుద్ధులే! అందుకే నాకు లలితను పెళ్ళి చేసుకోవటం సుతరామూ ఇష్టంలేక పోయింది! మరదలైతేనేం? కుదురుగాలేక పోయాక!"

"పోనిద్దురూ! ఆ అమ్మాయి గుణంతో మన కేమిటి? కానీ, కనీసం మనింటికి వచ్చినప్పుడయినా, మర్యాదగా మాట్లాడి పంపటం మన విధి.... మనం సాయంత్రం వాళ్ళింటికి వెళ్ళొద్దూ?"

"తప్పుతుందా మరి?"

చిన్నపిల్లాడిలా చిరచిర లాడ్తున్న మురళిని చూసి నవ్వు కుంది రాధ.

# 8

అమావాస్య! గాఢాంధకారం నలువేపులా అలముకుని వుంది. నక్షత్రాలు మాత్రం ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయి ఈ రోజు తమదే రాజ్యం అన్నట్లు. మేడమీద ఆరుబయట స్తంభానికి ఆనుకొని, శూన్యంలోకి చూస్తూ నిల్చుని వుంది లలిత. స్తంభానికి అల్లుకుని విరగబూసివున్న మాలతీలత, చిరుగాలికి సయ్యాటలాడుతూ, లలిత

చెంపలను స్పృశిస్తోంది వుండి వుండి: కానీ లలిత కా వాతావరణం దుర్భరంగా తోస్తోంది. మనిషి హృదయం ఆనందంతో నిండి వున్నపుడు. పరిసరం ఎంత అసహ్యంగా వున్నా లెక్కలోకి రాదు. కాని ఆ మనిషి మనసే వికలమై వున్నపుడు ఎంతటి ఆహ్లాదకర వాతావరణం కూడా దుర్భరంగా తోస్తుంది.

సరిగ్గా లలిత హృదయం అలాగే వికలమై వుంది. గత మంతా ఆమె హృదయంలో దృశ్యాలుగా పరచుకుని గాయం సెల వేసి సల్లవుతోంది.

''ఈ రోజు ఎగిరెగిరి కులంగాని ఆ పిల్లను చేసుకుంటున్నా డనీ, నిన్ను పెళ్ళాడ నన్నాడనీ బాధ పడ్తున్నావా? పిచ్చి లలితా! చూస్తుండు....వాడి ఎగురుడంతా ఎలా తగ్గిపోతుందో! దాని ఆచా రాలకూ, మన ఆచారలకూ సరి పడదు. ఆ సంసారం మూణ్ణాళ్ళ ముచ్చట గాకుంటే అప్పు డడుగు. ఇలాటి ప్రేమ పెళ్ళిళ్ళు ఎన్ని చూడటం లేదు మనం రోజూ? మొదట 'ప్రేమ ప్రేమ' అంటూ మోజుపడి పెళ్ళి చేసుకోవటం, ఆ తర్వాత విడిపోవటం, జీవితాంతం అహోరిస్తూ గడపటం. చూస్తూనే వున్నాంగా? రాధా మురళిల బ్రతుకు కూడా అంతే! ఊరికే ఏడవకు....మురళి తలదన్నేవాణ్ణి తెచ్చి మేం నీకు పెళ్లి చేస్తాంగా?''

ఆ రోజు....గోపాలకృష్ణయ్య మామయ్య ఒక వేపు, తన తల్లి మీనాక్షమ్మ మరో వేపు కూర్చుని తనను అనునయిస్తుంటే, అదే కాంక్ష తన హృదయంలో బలంగా నాటుకు పోయింది! అను క్షణం భగవంతుణ్ణి అదే కోరుకుంది.

అస్తమానూ అదే దృశ్యాలుగా ఊహించుకుంది....

మురళి, రాధ....అస్తమానూ పోట్లాడుకుంటారు. విరసోక్తు లతో ఒకరి నొకరు నొప్పించుకుంటుంటారు. రాధ పద్ధతులూ, ఆచార వ్యవహారాలూ మురళికి క్రమేణా తల నొప్పిగా మారుతాయి: రాధకూ మురళి పద్ధతు లలాగే తోస్తాయి. ఇద్దరి కిద్దరూ ఒకరి మీద

మరొకరు నిందారోపణలు చసుకుంటూ ఈసురోమని కాలం వెళ్ళ బుచ్చుతుంటారు!

ఇలాటి ఊహలు లలితకు ఎంతో ఊరటనూ, ఉపశాంతినీ కలిగించాయి. మురళి పెళ్ళయిన రెండు నెలలు నిండకముందే, మీనాక్షమ్మ కృష్ణమోహన్‌తో లలిత వివాహం నిశ్చయం చేసింది. కృష్ణమోహన్ బి. ఎస్. సి. ప్యాసై, వ్యాపారం చేస్తున్నాడు. బంగారు పిచ్చుక. లలిత లావణ్యానికి మురిసిపోయి పెళ్ళికి అంగీకరించాడు.

భర్తగా కృష్ణమోహన్ తన నెంతగా ప్రేమిస్తాడో, ఎంతగా ఆదరిస్తాడో, అపురూపంగా చూచుకుంటాడో, తన కతగా డంటే అంత జుగుప్స, ఏహ్యాభావమూ. కృష్ణమోహన్ అందంగానే వుంటాడు....

అయినా తనకేమిటో అతగాడు తనకు తగడనే భావం.

అనుకోకుండా మద్రాస్‌నుంచి వ్యాపారం మార్చాలనుకోవ టంతో, లలితలో కొత్త ఊహలు తలెత్తాయి: మురళి బావ ఈ సరికి రాధతో విసిగిపోయుంటాడు.

"మనిద్దరం విడాకులిచ్చుకుందాం!" అనే నిర్ణయాని కొచ్చుం టారు వాళ్ళిద్దరూ. ముఖ్యంగా మురళి "హాయిగా మా లలితను వివాహమాడివుంటే ఎంత బావుండేది! ఇప్పుడయినా మునిగిపోయిం దేమీలేదు. రాధా! నువ్వూ నేనూ విడాకులిచ్చుకుందాం. లలితకు క్షమాపణలు చెప్పుకుంటాను." అంటూంటాడేమో తరచూ! ఇలాటి సమయంలో తాను అక్కడే కాపురం పెడితే ఎంతో బావుంటుంది. మెల్లిగా బావను ఆకర్షించి, ఆకట్టుకోవాలి. అతడు పశ్చాత్తాపంతో తనకేసి పరుగులు తీస్తూ, తనకు పాదాక్రాంతుడౌతుంటే, తనకోసం వెర్రులెత్తిపోతుంటే, గర్వంగా నవ్వుకోవాలి....ఇలాటి తియ్యటి కల లెన్నో కిన్నది....

కానీ ఇక్కడికొచ్చి, రాధా మురళిల దాంపత్యం చూడగానే మనస్సు భగ్గుమని మండిపోయింది! తనెంతగా వాళ్ళ విరస దాంపత్యాన్ని ఊహించుకుందో, అంతకు పదిరెట్లు ఆనందంగా, హాయిగా, చల్లగా వారి జీవితం సాగిపోతోంది. ఎంత నికృష్టంగా వుండాలని కాంక్షించిందో, అంతకు వెయ్యిరెట్లు ఉత్కృష్టంగా అనురాగపు వెల్లువ ప్రవహిస్తోంది వాళ్ళిద్దరిమధ్యా!

మురళిబావ, రాధ రెండు శరీరాలు, ఒకేమనసు అన్నంత అన్యోన్యంగా, ఆనందంగా వున్నారు.

నిన్న సాయంత్రం మురళి, రాధ- తనింటికి వచ్చారు. గెస్ట్సు రూంలో కూర్చోబెట్టి, నౌకరు కుర్రాడిచేత కాఫీ, టిఫిను పట్టించుకు రావటానికి వెళ్ళి, ఐదు నిమిషాల్లో తిరిగి వచ్చింది....

కానీ మురళి, రాధ మామూలు ప్రపంచంలో లేరు. గదిలో మూలగా పెట్టివున్న టేబిలుమీదున్న చందనపు అర్ధనగ్న స్త్రీమూర్తి బొమ్మ వేపు చూపిస్తున్నాడు మురళి, రాధకేసి కొంటెగాచూస్తూ. రాధ చిరునవ్వు నవ్వుతోంది ...నైలాన్ కర్టెన్‌లోంచి తనకిదంతా స్పష్టంగా కనిపిస్తోంది.

''ఎలా వుంది?'' రాధకేసి కన్నుగీటి అడుగుతున్నాడు మురళి.

''బావుంది....'' మెల్లిగా చెబుతోంది రాధ.

''ఊఁహూఁ! నాకేం బాగలేదు!

''ఏం? ఎందుకని?'' విస్మయంగా అడిగింది రాధ.

''నిజానికి నీకంటే ఏమీ బాగాలేదు. నీ అందం తప్ప నాకు మరే అందమూ నచ్చదు. నువ్వే ఆ విగ్రహంలా, అదే భంగిమలో నిల్చునివుంటే....''

రాధ చటుక్కున అతడి పెదవులు, తన తెల్లటి చక్కటి చేతి వ్రేళ్ళతో సున్నితంగా మూసివేసింది. ఆ చేతివ్రేళ్ళనలాగే ముద్దెట్టుకున్నాడు అతను.

"ఛ....ఏమిటీ అల్లరి? పైగా ఇతరుల ఇంట్లో? ఆవిడేమను కుంటుంది?'' అంటూన్న రాధ, గుమ్మంలో తనని చూచింది.... బిక్కచచ్చిపోయింది....

మురళి చేతిలోవున్న తనచేతిని గబుక్కున లాక్కుంది. మురళికూడా తలెత్తి తనని చూచాడు.........కానీ ఏమీ జరగనట్లే, టీపాయ్‌మీది ఫ్లవర్ వాజ్ సర్దుతూ, "లలితా! మరి ఇంత బంగళాలో కృష్ణమోహన్ లేకుండా, ఎలా ఒంటరిగా గడుపుతున్నావో నాకైతే బోధపడటంలేదు.........నేనే నీ పరిస్థితిలోవుంటే, బంగళాలోంచి బయటికి పరుగెత్తుదును!'' అన్నాడు అమాయకత్వం నటిస్తూ!

అతడి అమాయకత్వపు నటన, ఆ మాటలంటూ తన చిలిపి తనాన్ని కప్పిపుచ్చుకోవటానికి అతగాడు చేసే ప్రయత్నంలో రెప్పలు వాలిన అతగాడి కళ్ళు, చూడ ముచ్చటగావుండి, క్షణకాలం గుండె ఝల్లుమనిపించాయి లలితకు! ఎలాగో సంబాళించుకుంది ...

రాధ- తనకూ మురళికి మధ్య వున్న ఇనుపగోడలా కని పించిందా క్షణంలో! "పోనీ ఆయనగారు వూరికెళ్ళేటప్పుడల్లా నీకు కబురుచేసి మరీ వెళ్ళమంటాను. నాకు తోడుగావచ్చి, నాతో కబుర్లు చెబుదూగానీ!" అంది నవ్వుతూ.

వాటిని బావా మరదళ్ళ హాస్యాలుగా పరిగణించి రాధకూడా నవ్వేసింది.

తన మాటలకు వాళ్ళిద్దరూ అలా నవ్వుతూ త్రుళ్ళుతూంటే, చూస్తూ తను హర్షించలేకపోయింది లలిత ........వాళ్ళిద్దరూ వెళ్ళి పోయాక, హృదయభారం కొంత తగ్గినట్లు తోచింది. కానీ వుండి వుండి ఆగాయం రేగుతూనేవుంది, ఈగల్లాంటి అసూయా కెరటాలు ముసిరి!

ఎలాగయినా మురళినీ, రాధనూ వేరుచెయ్యాలి! వారిద్దరి అనురాగపు జీవితభాండాన్ని ముక్కలు చెయ్యాలి! చెరో దారీ అయి, ఏడుస్తుంటే తను మనసారా నవ్వుకోవాలి!

ఆ భావన లలితకు కొండంత బలాన్నిచ్చింది....

"లలితా!" క్రిందనుంచి పరిచిత కంఠస్వరం వినిపించి వులిక్కిపడింది లలిత!

భగభగ మండుతున్న కళ్ళనూ, హృదయాన్నీ అదుపులోకి తెచ్చుకుంటూ, మెట్లు దిగి క్రిందికి వచ్చింది. డ్రైవరు కారు గ్యారేజిలో పెడ్తున్నాడు.

నౌకరు, ఆ సరికే కృష్ణమోహన్‌కు ఫలహారం, పాలూ తయారుగా వుంచాడు,

"అదేమిటి లలితా అలా వున్నావు? ఒంట్లో బాగా లేదా?" లలితవేపు పరీక్షగా చూస్తూ ప్రేమగా అడిగాడు కృష్ణమోహన్.

"బాగానే వుంది. ముందు మీరు ఫలహారం కానీండి....!" మెల్లిగా భర్త చేతులను విడిపించుకుంటూ అంది లలిత.

'ఒక్కరోజు విడిచి వెళ్తానో లేదో, ఇలా అయిపోతావేమిటి లలితా?'

వెనకనుంచి సూటిగా వినవస్తున్న అనురాగపూరిత కంఠస్వరం. వినిపించుకొనే సహనంకూడా లలితలో లేదా క్షణంలో!

పక్కమీద కూర్చుంటూ, తనక్కాస్త దూరంలో కూర్చుని వున్న లలితను ఆశ్చర్యంగా చూచాడు కృష్ణమోహన్. ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగావుంది లలిత. ఉండి వుండి నిట్టూరుస్తోంది.

"లలితా ఏమిటాలోచిస్తున్నావ్?" లాలనగా భార్య తలమీద చెయ్యివేసి అడిగాడు కృష్ణమోహన్.

"ఏం లేదు!"

"ఏమీలేకుంటే రాణిగారికీ పరాకేమిటో?" ఆమెచుట్టూ చేతులు వేస్తూ అన్నాడు.

"అబ్బ! పరాకూ లేదు. చిరాకూ లేదు. ముందు మీ చేతులు తియ్యండి...."

నెమ్మదిగానే అంది గానీ, కరుకుదనం నిండివుం దా కంఠ స్వరంలో.

విస్మయంగా లలితవేపు చూచాడు కృష్ణమోహన్.

"ఉండవోయ్! ఎప్పుడెప్పుడు నీ ఒడిలో వాలిపోదామా అన్న ఆత్రంతో, మా పార్ట్నర్ శ్రీనివాసరావుమీద అన్నిపన్లూ రుద్ది, పరు గెత్తుకువచ్చాను.''

బలవంతంగా లలితను తనవేపు లాక్కున్నాడు.

"అబ్బ! ఏమిటీ మోటుసరసం? నాకేమిటో నీరసంగావుంది. నిద్రొస్తోంది. నిన్నరాత్రి కాస్త జ్వరంకూడా తగిలింది....'' చిరాగ్గా దూరంగా జరిగి, గబుక్కున దుప్పటి మీదకు లాక్కుని, కళ్ళు మూసుకు పడుకుంది లలిత.

"నిజంగా!'' కృష్ణమోహన్ గాభరాగా అడిగాడు.

లలిత పలకలేదు.

''మరి నాకు చెప్పలేదేం? డాక్టరుకు ఫోన్ చెయ్యనా?'' భార్య మీదకు వంగి మృదువుగా ఆమె పెదాల్ని స్పృశిస్తూ అడిగాడు.

"ఊఁహూఁ. ఇప్పుడు డాక్టరుకు ఫోన్ చెయ్యవద్దు ఏమీ వద్దు. నన్ను విశ్రాంతిగా నిద్రపోనివ్వండి....చాలు!''

''సరే! హాయిగా పడుకో!'' ప్రేమగా లలిత తలనూ, శరీ రాన్ని నిమురుతూ చాలసేపు కూర్చొని, తర్వాత మెల్లిగా పడుకుని నిద్రపోయాడు కృష్ణమోహన్. భర్త చెయ్యి తన మీద వున్నంత సేపూ, లలితకు ఉపశాంతికంటే అశాంతే ఎక్కువగా కలుగుతున్న ట్లయింది. అతడు నిద్రపోగానే, హాయిగా నిట్టూర్చి, మరింత దూరంగా జరిగి పడుకుంది లలిత.

# 9

నొక్కు ఎక్కువమంది వరాయిస్త్రీలతో పరిచయమైతే లేదుగాని రాధా! ఆడవాళ్ళ మనస్తత్వాలను మాత్రం కొద్దిగా ఆకళింపు చేసుకొనగలను....మా కమలది అదోరకం నిర్లిప్తస్వభావం. తొణకని నిండుకుండలాటిది దాని మనస్సు. మా అమ్మది మరోరకం. అస్తమానూ మా నాన్నను, నాన్న మనస్తత్వాన్నీ ఏవగించు కుంటూనే, తిరిగీ ఆయననే దైవంగాకొలుచు కుంటూంటుంది. లలితది సరేసరి! తనకు దక్కని ఫలం ఇతరులకూ్కడా లభ్యం కాకూడదనే అసూయా పూరిత మనస్తత్వం. ఇక నీ మనస్తత్వమేమిటో....''

ఒక ప్రశాంత సాయంసమయంలో అలా మొదలైంది సంభాషణ. మురళిమాటలు పూర్తికాకుండానే రాధ అందుకుంది:

''....చాలా మార్లుచెప్పారు—వెర్రిబాగులతనం, చాదస్తం, అమాయకత్వం....'' ప్రక్కింటి వాళ్ళపిల్లాడు గోపీకి చొక్కా గుండీలు సరిగా పెడూ అంది రాధ.

మురళి నవ్వాడు. 'అందులో అబద్ద మేముందీ? అలా గింజుకుంటావు?''

రాధ ముగ్ధమోహనరూపాన్ని ఓరగాచూస్తూ అన్నాడు.

''నిజమేమిటో మీరే చెప్పండి!''

''అలారా దారికి! ఇంత చదువుకున్నావ్.... ఇంకానీకు పిల్లలమీద మోజేమిటి?''

రాధకు కోపం వచ్చింది. "చదువుకున్న స్త్రీ మాతృత్వాన్ని కోరదా? కోరుకో కూడదనా మీ ఉద్దేశం? ఈ గోపీగాడెంత ముద్దుగా వున్నాడో చూడండి....''

"ఎంత ముద్దుగావున్నా, నువ్వెంత దగ్గరకు తీసినా. వాడు పక్కింటివాళ్ళబ్బాయేగానీ, మన సొంత బిడ్డడేం కాదు. అస్తమానూ వాణ్ణెందుకలా దగ్గరకు తీస్తావు?"

రాధ మాట్లాడలేదు. కానీ ఆమె చూపుల్లో అప్రసన్నత స్పష్టంగా కనిపిస్తోంది.

"అసలు బిడ్డలంటే నీ కెందుకంత మమకారం?"

"ఇది మరీ బావుంది. తల్లికాని స్త్రీ ఒక స్త్రీయేనా? అసలామెకు పరిపూర్ణత్వం సిద్ధించదు కూడాను." గోపీ క్రాపు సరిగా దువ్వి పిల్లవాణ్ణి కుర్చీలోంచి క్రిందికి దించింది.

''పుస్తకాలభాష అది" మురళి వెటకారంగా అన్నాడు.

''మరి మీ భాష్యమేమిటో సెలవిస్తారా?'' రాధకు నిజంగానే వచ్చింది కోపం.

''స్త్రీ పుట్టుకతోనే పరిపూర్ణత్వం నింపుకున్న ప్రాణి.''

"అదెలా?''

"అవును రాధా! 'కార్యేషుదాసీ, కరణేషు మంత్రి, భోజ్యేషు మాతా, క్షమయా ధరిత్రీ, రూపేచలక్ష్మి శయనేషురంభా' అనే షట్కర్మలలో స్త్రీలో మాతృత్వాన్నికూడా నింపాడు భగవంతుడు. ఇక అంతకంటె వేరే మాతృత్వమెందుకు స్త్రీకి?''

మురళి వాదన సబబుగానే వుంది. ఎన్నోమార్లు- అలసిన భర్త, తనగుండెల్లో ముఖం దాచుకు పడుకుంటే, అతగాడి తలా, వీపూ అప్రయత్నంగానే తనచేయి నిమురుతుంది. ఆ సమయంలో, అతగాడికంటె తను వయసులో చాలా పెద్దదైనట్లుగానూ, తన

ఒడిలో అతగాడో చిన్నబిడ్డడిలానూ, అనుభూతి కలుగుతుంది....

.. సహజంగా స్త్రీలో ఉండే మాతృత్వపు ఛాయలే అందుకు కారణం కావచ్చు....

అయినా, మనస్సు మాత్రం పూర్తిగా అంగీకరించదు. ఆ అనుభూతి క్షణికం. తిరిగి మరో స్పర్శతో అతగాడు భర్త అనే భావం. అతగాడికంటే తాను వయసులో చిన్నదనే భావమూ, స్త్రీ సహజమైన సిగ్గు, అనుభవంలోకివస్తాయి....

అందుకే శాశ్వతమైన మాతృత్వాన్ని కోరుతుంది స్త్రీ: ఓ సారి తల్లిగా మారిన స్త్రీకి, భర్త అనురాగంలోని ఆనందానికీ, అతగాడి కౌగిలిలోని మధురానందానికీ, పుత్రపరిష్వంగంలోని మరో విధమైన దివ్యానుభూతికి తేడా స్పష్టంగా తెలుస్తుంది.

"అదేమిటి? ఉన్నపళాన ఆలోచనలో పడ్డావ్?" రాధకు దగ్గరగా వచ్చి, ఆమె భుజాలమీద బలంగా చేతులువేసి కుదుపుతూ అడిగాడు మురళి. ఉలిక్కిపడింది రాధ.

"ఎలా అయినా చెప్పండి, షట్కర్మలలో నిర్వచించిన స్త్రీలోని మాతృమూర్తికి. మాతృప్రేమ క్షణికమేగాని శాశ్వతమైంది కాదు. అందువల్ల తాత్కాలికోపశమనం కలగవచ్చునేమోగాని, శాశ్వతమైన ఆనందానుభూతి కలగదు. గోపీలాటి బిడ్డ ఒక్కడేనా లేకుంటే బహుశా.... జీవితం నిస్సారమనిపిస్తుంది కాదూ?" రాధ నల్లని కళ్ళలో, మాతృత్వం వహించాలన్న కాంక్ష ప్రబలంగా, అగ్నిలా, ప్రజ్వరిల్లుతున్నట్లు తోచింది మురళికి. అయినా నవ్వేశాడు.

"ఊఁహుఁ నిస్సారమేమీకాదు, డజన్ల కొద్ది పిల్లలతో, వాళ్ళ రోగాలతో, రొచ్చులతో, చికాకులతో సతమతమౌతూ, జీవితంలోని అమూల్యమైనకాలం దిగుళ్ళతో, తెగుళ్ళతో, వ్యర్థమైపోతూంటే, ఏమిచెయ్యలేక, నిస్సహాయంగా ఏడుస్తూ ఎలాగో గానుగెద్దుల్లా జీవితాలని లాగే ఎందరో గృహిణులనూ, గృహస్థులనూ చూస్తుంటే మాత్రం....రాధా! ఆ సంతానం, ఆ సౌఖ్యమూ, ఆ మాతృత్వమూ -

లేదా సిత్రుత్వమూ, ఆ నరకమూ నాకు కలలో కూడా వద్దని పిస్తుంటుంది. హాయిగా చీకూ చింతా లేకుండా, చెట్టాపట్టా లేసుకుని వయసును హాయిగా అనుభవించ గలిగే అదృష్టం ఎందరు దంప తుల కుంటుంది ?''

రాధ పలకలేదు.

'పోస్ట్!'

''ఆదుర్దాగా వెళ్ళి ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరం అందు కున్నాడు మురళి.

''నాన్న ఉత్తరం వ్రాశారు రాధా !''

''చదవండి, ఏం వ్రాశారో !''

ఐదునిముషాల్లో ఉత్తరం లోలోపల చదువుకుని బొమముడి చాడు మురళి.

''ఏమిటి? ఏమయ్యింది? అందరూ కులాసాయేనా?''
ఆత్రంగా అడిగింది రాధ.

''ఊ! అంతా కులాసాయే !'' ముభావంగా అన్నాడు మురళి. ఏదో ఆ వుత్తరంలో వుందనీ, అది దాస్తున్నాడనీ క్షణంలో గ్రహించు కుంది రాధ.

''మరేం? మీ ముఖం అలా వివర్ణమైంది?''

''అలా కూర్చో రాధా! ఉత్తరం చదివ్వినిపిస్తాను....షాక్ తట్టుకోగలవా?'' మురళి రాధవేపు జాలిగా చూస్తూ అన్నాడు.

రాధకు అమితంగా భయంవేసింది. ''ఇంతకూ ఏం వ్రాసి వుందందులో?'' గాభరాగా అడిగింది.

''నాన్న ఏమని వ్రాశారో చూడు.'' మురళి పెద్దగా చదివాడు.
ఊపిరి బిగించి వినసాగింది రాధ.

‘‘చిరంజీవి మురళికి,

ఆశీర్వచనములు. ఇక్కడంతా క్షేమం. చి సౌ. రాధను గురించిన విశేషమేదైనా ప్రతిజాబులోనూ వుంటుందేమోనని మీ అమ్మ కొండంత ఆశతో ఎదురు చూడటం, నిరాశపడటం, మామూలయి పోయింది. రాధను డాక్టరుకు చూపించావా ? ఆపరేషన్ చేయించిన తర్వాత కూడా ఆమెకు తల్లిఅయ్యేసూచనలు కన్పించలేదంటే, బహుశా రాధలో, (నా ఉద్దేశంలో) రాధ శరీర తత్వంలో ఏదో లోపంవుండి వుండచ్చు... మురళి! పంతాలు పౌరుషాలు — అర్థంలేనివని నాకు తెలుసు! అయిన లోకం కోసం, కొంత బింకం ప్రదర్శించాల్సి, ప్రదర్శించాను ...... మన ఈ వంశానికి నువ్వొక్కడవే మగదిక్కువు. నీకు బిడ్డలు కలుగక మాకెంత క్షోభగా వుందో ఆలోచించు. ఒకవేళ రాధలోపమే అయితే, నీకు మళ్ళీ వివాహం చెయ్యాలని తల్లి దండ్రులుగా మేం కోరటంలో ఆశ్చర్యమూ, అసహజత్వమూ లేవనుకుంటాను.

ఏదేదో వ్రాశాను....వింపాదిగా జవాబు వ్రాయ గోరుతాను.’’

ఇట్లు, నీ తండ్రి

గోపాలకృష్ణయ్య

వింటున్న రాధ మ్రాన్పడి చూస్తూఉండి పోయింది ... తమకు సంతానం కలగక పోవటానికి. తనలోపమే అని నిర్ధారణ అయితే. ఇక మురళి తనకు దక్కకుండా పోతాడా ? మురళి తలి దండ్రులు అతగాడి ద్వారా వంశవృద్ధిని కోరడం, అందుకు తగిన ప్రయత్నం చెయ్యటం సబబుకాదని తనేవిధంగా అనగలదు?

ఉత్తరం విన్న రాధ కళ్ళల్లో నీళ్ళు స్పష్టంగా కనిపిస్తున్నాయి....మురళి గుండెలు పిండినట్లయింది,

గబుక్కున రాధ దగ్గరగావచ్చి, రాధ చుట్టూచేతులు వేశాడు....మౌనంగా అతగాడి గుండెలమీద తల ఆన్చింది రాధ.

"పిచ్చిరాధా! అలా కంగారు పడతావెందుకూ? నేనంత తెలివితక్కువవాణ్ణా? నీలాటి వజ్రాన్ని, పిల్లలసాకుతో, విసిరి పారేస్తాననుకున్నావా?" ఏమేమో చెప్పాలని అతగాడి హృదయం ప్రయత్నించిదేగాని, ఏ ఒక్క మాటాపైకి వెలువడలేదు.

"నన్ను ....నన్ను...." వెక్కిళ్ళతో రాధకిక మాటలు వెలువడలేదు ...సమాధానంగా మురళి ఆమెను గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు.... చాలాసేపటికి గానీ ఇద్దరూ సంబాళించుకోలేకపోయారు. "ఈ ముసలి పీనుగలు చూసేవా? రాధా! అసలు నాకు ఒకటనిపిస్తోంది. మనదేశంలో చిన్నదంపతులు సుఖంగా జీవించటానికి వీలులేక పోవటానికి ముఖ్యకారకులీ పెద్దవాళ్ళే! దగ్గరుండీ వేపుకుతింటారు. దూరంగా వుండీ కాపురాల్ని ధ్వసం చెయ్యాలని చూస్తారు. నిజానికి,నిజానికి..అరవై ఏండ్లు వచ్చిన ప్రతి పెద్దమనిషినీ, అదేదో దేశంలోలా, దేశబహిష్కరణ చేయడం మంచిపని...." ఆవేశంగా అన్నాడు మురళి. తండ్రిమీద అతగాడికి పీకెలవరకూ కోపం వచ్చింది.

"మనకూ అరవై సంవత్సరాలు రాగానే?" నవ్వటానికి ప్రయత్నిస్తూ అంది రాధ.

"మనంతట మనమే వెళ్దాం! నాన్నకో గుణపాఠం నేర్పుతాను." ధృఢనిశ్చయం చేసుకుని, గబగబా లెటర్‌ప్యాడ్ తెచ్చి ఉత్తరం వ్రాయటం మొదలెట్టాడు మురళి.

# 10

పెరట్లో, బావిగట్టున నిల్చుని పళ్ళుతోముకుంటున్న గోపాలకృష్ణయ్య తలెత్తి, పక్కయింటివారి పెరటివేపు చూచాడు. ఈ

మధ్యనే చనిపోయిన సుందరరామయ్య భార్య విశాలాక్షమ్మ, నూతి లోంచి నీళ్ళు తోడుకుంటోంది.

"చచ్చే ముండావాడు ఎలాగా చస్తున్నాడాయె! పాపం! ఈవిడెకు నెత్తిగొరిగించి, ముసుగు వేయించిందెందుకో? ఆ జుట్టే వుండివుంటే, ఈవిడ ఇంకా ఎంచక్కా వుండేది?" అనుకున్నాడాయన....

"ఏం బావా? మురళి దగ్గర్నుంచి ఉత్తరమేదైనా వచ్చిందా?" వస్తూనే అడిగాడు సీతాపతి.

"ఉదయాన్నే ఊడిపడ్డాడు నక్కవెధవ! ఎవరి కొంప ముంచటానికో?" అని లోలోపలే తిట్టిపోస్తూ, కాళ్ళకు నీళ్ళు తెచ్చింది జగదాంబ.

మురళి ఉత్తరం మాట వినగానే, విశాలాక్షమ్మను గురించి ఆలోచన చప్పున మాయమయ్యింది గోపాలకృష్ణయ్యకు ... "ఆ వచ్చింది! బాగానే వున్నారు!"

భార్య చూడకుండా, కన్నుగిలుపుతూ "తర్వాత వివరంగా మాట్లాడుకుందాం!" అనే భావన వ్యక్తంచేశాడు గోపాలకృష్ణయ్య.

సాయంత్రం జొన్నచేలవేపు వెళ్ళారిద్దరూ. చొక్కా జేబులోని ఉత్తరంతీసి సీతాపతిచేతికిచ్చి, ఏదో అగ్గిముట్టుకున్నట్లు చెయ్యి దులుపుకున్నాడు గోపాలకృష్ణయ్య. "నేను విసిరిన రాయి నాకేవచ్చి తగిలి, నా ముక్కు బద్దలుకొడ్తుందనుకోలేదు!" అన్నాడు కోపంగా.

సీతాపతి చిత్రంగా చూస్తూ, జాబు విప్పాడు.

"ప్రియమయిన నాన్నకు నమస్కారం.

నేను, రాధ క్షేమం. మీ ఉత్తరం అందింది. మీరు నా కుటుంబంమీద, మనవంశంమీద తీసుకుంటున్న శ్రద్ధకూ, వాత్సల్యానికీ నాకు చాలా సంతోషంగా వుంది! రాధను ఐదారుగురు డాక్టర్లకు చూపించాను. ఆమెకు సంతానం కలగకపోవటానికి ప్రత్యేకమైన

కారణమంటూ ఏమీలేదనీ, ఆమెలో ఎలాటి లోపమూ లేదనీ అందరూ ఏకగ్రీవంగా తీర్మానించారు. ఇక మిగిలింది నేను! బహుశా ఆ లోపమేదో నాలోనే వుండివుండాలని డాక్టర్ల ఉద్దేశం! ఆ మాట విని నేను బిక్కచచ్చిపోయానంటే నమ్మండి!

స్త్రీకి సంతానోత్పత్తిశక్తి లేకపోయినా, ఆమెలోని ఏ లోపమో కారణంగా, ఆమెకి తల్లి అయే అర్హత లేకపోయినా, ఆ స్త్రీ భర్తకు మరో వివాహం చెయ్యాలని నిర్ణయించడం బాగానేవుంది! కానీ భర్తలో అలాటి లోపం వుందని రూఢిఅయితే, భార్యకు మరో పురుషుడితో వివాహం చేయడానికి సమాజం ఒప్పుకుంటుందా?

మీ కొడుకు సంతానార్హతలేనివాడంటే, మీకెంత అప్రతిష్ఠో ఆలోచించండి....మీకు అంగీకారమైతే కమలను ఇక్కడ ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించి, మెట్రిక్ చదివిస్తాను....దానికి ఓవ్యాపకం వుంటుంది ...వెంటనే మీ క్షేమసమాచారములతో జవాబు వ్రాయ గోరుతాను.''

ఇట్లు మీ కుమారుడు,
మురళి

సీతాపతికి క్షణకాలం కళ్ళు బైర్లు గమ్మాయి. మురళి తండ్రిని మించిన లౌక్యం తెలిసినవాడనుకోలేదు! మురళిలాటి యువకుణ్ణి లొంగదీసుకోవడమంటే సామాన్యమైన విషయం కాదని స్పష్టంగా తేలిపోయింది. పైపెచ్చు మురళికి రాధమీద వల్లమాలిన ప్రేమనే విషయంకూడా తేలిపోయింది....

''చూశావా! చెప్పుచ్చుకు, ఎంచక్కా నా మొహం ఎలా పచ్చడి చేశాడో?'' ఉక్రోషంతో వుడికిపోతూ అన్నాడు గోపాల కృష్ణయ్య. సీతాపతి భొళ్ళు భొళ్ళున నవ్వాడు.

''పీడ తాడు తెగ! అయిందానికీ, కానిదానికీ, గొంతుకలో గులకరాళ్ళు పోసినట్లు ఘొల్లు ఘొల్లున నవ్వుతాడు....!'' లోలోపల విసుక్కుని, పైకి గంభీరంగా చూశాడు గోపాలకృష్ణయ్య— ఏమి టన్నట్లు.

"ఇంతమాత్రానికే నువ్వలా కుతకుతలాడిపోవటం ఏమీ బాగాలేదోయ్ బావా! ఓ రాయి గాకుంటే మరో రాయి...."

'అసలింత బాధెందుకూ? నీ పిల్లను మరొకళ్ళ పీకకు కట్టరాదూ?' అందామనుకుని, నాలుక చివరకు వచ్చిన మాటను ఆపుకున్నాడు గోపాలకృష్ణయ్య.

గోపాలకృష్ణయ్య కళ్ళలో భావాన్ని పసిగట్టాడు సీతాపతి.

"రుక్మిణిని మురళికే, రెండో పెళ్ళికేనా ఇవ్వాలని ఇంతగా ఎందుకు పాకులాడ్తున్నాననుకుంటున్నావ్? నీతోటీ, నీ కొడుకుతోటీ, ఎలాగేనా, మా వంశంలో ఎవరో ఒకరు సంబంధం కలపాలనే తీవ్రకాంక్షే...."

అదొక్కటే కాదని గోపాలకృష్ణయ్యకూ తెలుసు; తనద్వారా మురళికి సంక్రమించే ఆస్తి అని ఆయన వుద్దేశం; కానీ సీతాపతి మరో రెండాకు లెక్కువే చదివాడు

ఎం. ఏ. ప్యాసై, చక్కగా లెక్చరరుగా పని చేస్తున్న బావలాటి యువకుడు అల్లుడుగా రావాలంటే, తన చేతి దో పదివేలయినా వదలాలి.

ఈ లెక్కన ఏడుగురు ఆడపిల్లలకూ పెళ్ళిళ్ళు చేయాలంటే తననీ, తన ఆస్తి యావత్తూ కలిపి వేలం వేసినా సరిపోదు; అందుకే చౌకలో, ఎలాగో ఓలా ముడివేస్తే ఓ సమస్య తీరిపోతుంది....ఇదీ సీతాపతి మనసులో మాట.

"బావా!" గావు కేక పెట్టాడు సీతాపతి.

"ఏం? ఏమయ్యింది?" పంట కాలువ గట్టుమీద బారుగా వెడ్తున్న గండుచీమల దండులోని గండు చీమేదయినా కుట్టిందేమోననుకున్నాడు గోపాలకృష్ణయ్య.

"మా రుక్మిణేలాగూ స్కూల్ ఫైనలు ప్యాసయిందిగా?"

"అయితే?"

"గుంటూరులో అదేదో కాలేజి అన్నావు ...మురళి ఇంటికి దగ్గర్లో వుంది....? దాన్లో చేర్పిస్తాను రుక్మిణిని ... మురళిచేత ప్రైవేటు చెప్పించు కుంటుంది. పిల్లకు చదువూ అబ్బుతుంది.... భోజనానికి వగైరాలకు నేనే డబ్బిచ్చుకుంటాలే!"

సీతాపతివేపు ఆశ్చర్యంగా చూచాడు గోపాలకృష్ణయ్య. "పిల్లకు చదువూ అబ్బుతుంది" అంటూ సీతాపతి మాట ఆపడంతో అతగాడి వుద్దేశం కొంత అర్థమయింది. మరి కొంత కాలేదు. "అసలు ఆ కులం గానిది వుంటే వుండనీ! మన దేం పోయె? కులమింటిది భార్యగా వుంటే, మగాడికి దోషం లేదు.... పోతుంది." క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు సీతాపతి.

"ఇవన్నీ బాగానే వున్నాయ్! మురళి ఇంట్లో రుక్మిణిని వుంచుకోవటానికి రాధ ఒప్పుకుంటుందా? ఒప్పుకున్నా మనకు ఒరిగే దేమిటి?" విచిత్రంగా అడిగాడు గోపాలకృష్ణయ్య.

"అదే నీ అమాయకత్వం. అసలు రాధ ఎవతె ఒప్పుకోటానికీ, ఒప్పుకోకపోవటానికీనూ? పైగా మన సంబంధాలూ, మన బంధుత్వాలూ, వదులుకోవాలా ఏమిటి? ఇక మన కేం ఒరుగుతుందో నెల తిరిగేసరికి నీకే అర్థమౌతుంది!"

సీతాపతి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు.

"అసలీ రోజులే చిత్రమైన వోయ్ బావా! రైళ్ళలో ప్రేమ! సినిమాల్లో ప్రేమ! షికార్లలో ప్రేమ! పుస్తకాల్లో ప్రేమ! ఇంట్లో ప్రేమ! బయట ప్రేమ! కూర్చుంటే ప్రేమ! నిల్చుంటే ప్రేమ! ఇలా ప్రేమ వాహిని ప్రపంచమంతా సుడులు తిరుగుతోంది! అలాటిది మురళి దగ్గర రుక్మిణిని పాఠాలు చెప్పించుకోవటానికి పెడితే వాళ్ళిద్దరిమధ్యా వారం రోజుల్లో ప్రేమ మొలకెత్తకపోతే,

నా చెవి తెగ్గోసుకుంటాను: తీరా అది మొలకెత్తిందో, మరు నిము షంలో మానై కూర్చుంటుంది! అంతే! నీ మురళే ఇక రుక్మిణిని పెళ్ళాడనిది బ్రతకలేనంటాడు!''

గోపాలకృష్ణయ్య ఆలోచనలో పడ్డాడు. సీతాపతి చెప్పే దాంట్లో అబద్ధమూ, అతిశయమూ కన్పించటం లేదు! ఒకే కాలేజిలో చదువుకుంటున్న ఇద్దరు యువతీ యువకుల మధ్య ప్రేమ మొదలైనప్పుడు, ఇక-కొత్త చదువున్న ఏ యువతీ యువకుల మధ్య అయినా ప్రేమ రగుల్కొన గలదు

కాబట్టి ఈ కొత్త ప్రేమ, తమ పాతకాలపు ప్రేమలా కాకుండా, నాగరికమైన మార్పు చెందినదై వుండాలి! అంతే యీనాటి ఈ ప్రేమ ఓ గ్లాసులోని పంచదార పాకం లేక ద్రాక్షరసం లాటిది.

ఆ గ్లాసులోంచి దానిని మరో గాజు గ్లాసులోకి వంపవచ్చు. లేదా స్టీలు గ్లాసులోకి పొయ్యవచ్చు. అంటే పాత్రల మార్పేగాని, పదార్థం మార్పు వుండదు. అంచేత ఎన్ని పాత్రలనైనా మార్చ వచ్చు!

ఇలా ఆలోచిస్తుంటే ఆయన గారికి తన ప్రేమ వాహిని గుర్తుకు వస్తోంది: తను చిన్నతనంనుంచీ ప్రేమిస్తూనే వున్నాడు! మంగలివాళ్ళ వెంకటసుబ్బి మొదలుకొని, మస్తాన్ పెళ్ళాం బేగం వరకూ తన ప్రేమ రకరకాలుగా జొన్నచేలలో, జనపచేలలో, వాముల దొడ్లలో, రకరకాల గుడిసెల్లో, మంచెలమాటునా వీర విహారం చేసింది!

ఈనాటి నాగరిక యువకుల ప్రేమ బహుశా కొత్త నాగరీకం అయ్యుండవచ్చు. అంచేత వాళ్ళు అలా ఎక్కడపడితే అక్కడ ప్రేమను బహిరంగపరచుకోకుండా, అందమైన పార్కుల్లో, ఏపుగా పెరిగిన పూలమొక్కల మాటునా, రద్దీగా వుండే సినిమా హాళ్ళల్లో, ఘోష పెడుతుండే సముద్రపుఒడ్డునా, ఇలా నాగరికమైన ప్రదే

కాలలో, నాగరికమైన మాటలలో—నాగరికమైన చేష్టలతో, నాగరికంగా ప్రేమించుకుంటారు! రిజిష్టరు పెళ్ళి చేసుకుంటారు! కోపం వస్తే విడాకులు పుచ్చుకుంటారు! మళ్ళీ ప్రేమ మొదలెడుతారు. లేకుంటే ఆవిడదారి ఆవిడదీ, ఇతని ప్రేమదారి ఇతనిది! అలా సాగుతుంటూంది కాబోలీ ప్రేమాయణం!

అంచేత సీతాపతి ఊహ ప్రకారం రుక్మిణిని మురళి దగ్గర చదువు మిషతో వదిలితే మురళి ప్రేమ రుక్మిణిమీదకు తిరగొచ్చు!

"ఏమిటంత ఆలోచన? నే చెప్పేది సబబుగా లేదూ?" అంటున్నాడు సీతాపతి! అతగాడు ఇందాకట్నుంచీ ఆగకుండా వాగుతున్నా డన్నందుకు గుర్తుగా, అతగాడి ముఖంలో అలసట స్పష్టంగా కనిపిస్తోంది!

"ఏం చెబుతున్నావు?"

"సరిపోయింది! మళ్ళీ మొదటికొచ్చావా? సరే విను! కేవలం రుక్మిణి నొక్కర్తెనూ. తీసుకు మనం బయల్దేరి వెడితే, మురళి ఏమైనా అనుకోవచ్చు! అందుకని, కమలని గూడా తీసుకు వెళ్దాం! మురళి, కమల కక్కూడా చదువు చెప్పిస్తా నంటున్నాడుగా! రుక్మిణీ, కమల తోడుతోడుగా వుంటారు...."

'ఊఁ....'

బాగా ప్రొద్దు వాటారింది, ఇద్దరూ ఇంటికి చేరుకున్నారు.... "ఎల్లుండి కమలను తీసుకువెళ్ళి, మురళి దగ్గర విడిచిపెట్టి వస్తానే?" అన్నాడు జగదాంబతో గోపాలకృష్ణయ్య.

జగదాంబ క్షణకాలం వెర్రిగా చూచింది భర్తవేపు!

మురళి వుత్తరం వ్రాశాడనీ, కమలను తన దగ్గరకు పంపితే, చదువు చెప్పిస్తానని వ్రాశాడని భర్త చెప్పిన మాట నిజమే అయినా, ఇక దానిని గురించి ఏలాటి వ్యాఖ్యానం చెయ్యని మనిషి, హఠాత్తుగా ఈ నిర్ణయానికి రావడం_ ఆశ్చర్యాన్నీ, ఆందోళననూ కలిగించింది.

కానీ "అదేమని?" అడిగే ధైర్యమూ, అవకాశమూ, భర్త ఏనాడూ భార్యగా తన కివ్వలేదు ఈనాడూ అంతే! అయితే, అస్తమానూ శూన్యంలోకి చూస్తూ కుంగిపోయి కూర్చునివుండే కమలను చూస్తుంటే, తన కడుపు తరుక్కుపోతోంది! కమలను ఏదో ఓ వ్యాపకంలో పడెయ్యటమే మంచిదిగా తోస్తోంది! అందుకే ఎలాటి అడ్డుకి చెప్ప దల్చుకోలేదు.

"అలాగే!" అందామె!

ఎలాటి ప్రతిఘటనా లేకుండా జగదాంబ సరేననడంతో, గోపాలకృష్ణయ్య మరింకేమీ మాట్లాడలేదు!

ట్రెయిన్‌లో కూర్చున్న కమల, రుక్మిణి చెరోవేపు కిటికీ లోంచి బయటికి చూస్తున్నారు! గోపాలకృష్ణయ్య, సీతాపతి మరో వేపు లోకాభిరామాయణంలో పడ్డారు!

కమల వూహలు ఓ విధంగా వుంటే, రుక్మిణి ఆలోచనలు మరో దారిలో పరుగెత్తుతున్నాయి!

తను బాహ్యప్రపంచంలో పడబోతోంది! చదువూ, స్నేహితులూ, అందరిలానే ఆనందమూ తన జీవితంలోకి రాబోతున్నాయి. ఇందుకు కృషిచేసిన మురళి అన్నయ్యకు మనసా నమస్కరిస్తోంది కమల!

రుక్మిణి మాత్రం తీవ్రంగా ఆలోచిస్తోంది! తను వెళ్ళటం మురళి బావగారింటికి! తన తండ్రి సీతాపతి, తన పెదనాన్న లక్ష్మీపతి—ఇద్దరూ స్వరూపస్వభావాలలో ఒకరి నొకరు వ్యతిరేకం! అన్ని విషయాలలో ఏలాటి కుట్రలూ, కుయుక్తులూ తెలియని లక్ష్మీపతి- లలిత పదేళ్ళ పిల్లగా వున్నప్పుడు చనిపోయాడు. తనూ, లలితా కొద్ది నెలల తేడా వయసులో వుండే పిల్లలు! మీనాక్షమ్మ ఎంతగానో ప్రయత్నించింది మురళికి లలితను ఇచ్చి పెళ్ళిచేయాలని!

కానీ మురళి అంగీకరించలేదు! అదంతా జరిగిపోయింది! కానీ మీనాక్షమ్మ కోపం చల్లారలేదు, తన తండ్రీ, ఆమెకు మరదీ ఐన సీతాపతితో మంతనాలు చేసింది! తన తండ్రి గోపాలకృష్ణయ్యతో గుసగుసలు ఆడాడు! ఫలితం తన చదువు కొనసాగే సాకుతో, మురళి బావ ఇంట్లో తనను వుంచాలన్న నిర్ణయం!

నిన్న రాత్రి అమ్మా, నాన్న మాట్లాడుకుంటుంటే తను విన్నది!

"ఉష్! గొడవ చెయ్యక! ఈ రోజుల్లో అంతకంటె గొప్ప అల్లుణ్ణి, పైసా ఖర్చుకాకుండా నువ్వు సంపాదించ గలవా?"—అది తండ్రి గొంతు!

అమ్మకు పీకల వరకూ కోపం వచ్చిందల్లే వుంది! "హూ! పైసా ఖర్చులేదని - ఓసారి పెళ్ళాడి, లక్షణంగా కాపురం చేసుకుంటున్నవాడి కిద్దామా బిడ్డను? పైగా అతడి కాపురంలో నిప్పులు చల్లి, ఆ భార్యను ఉసురుపెట్టి మనమేం బావుకుంటాం? ఆమె ఉసురు తగిలి మన బిడ్డ సుఖపడ్తుందా? మీ కిదేం దుర్బుద్ధి?" అంటోంది!

నాన్న తక్కువ తిన్నాడా? "వెర్రిపీనుగా! మనమేం నిప్పులు చల్లుతున్నాం కొత్తగా? ఆ రాధకు సంతానం కలగలే దింతవరకూ! ఆపరేషన్ చేయించినా ఫలితం శూన్యమయింది. దాంతో గోపాలకృష్ణయ్యే ఏలాగో ఓలా కొడుక్కు ఆ సాకుతో మరో పెండ్లి చెయ్యాలని పొంచివున్నాడు! దాన్ని ఆసరాగా చేసుకుని మనం రంగంలోకి దిగాం అంతే! నీ కెందుకు నువ్వు నోరు మూసుకో! జరిగేది చూస్తూ వూరుకో!"

అమ్మ మండి పడిం దొక్కసారిగా...."ఎలా చూస్తూ వూరుకోను? రేపు మన పిల్లకు కడుపో, కాలో వస్తే, ఏడవ్వాల్సిందెవరు?" అంది రోషంగా!

నాన్న విరగబడి నవ్వారు క్షణకాలం! అమ్మ మాటల్లో ఆయన గారికంత ఆనందం కలగటానికి కారణ మేమిటో బోధపడలేదు తనకు.

"నవ్వండి. నవ్వండి. రేపు నలుగురూ మనల్ని చూచి నవ్వుతూంటే చెరో మూలా దాక్కొని ఏడుద్దాం!" అమ్మ మరింత కోపంగా అరిచింది!

"అందుకేనే సుబ్బా! నిన్ను వెర్రిపీనుగా అంటా! ఆ కడుపో, కాలో వస్తే మరీ హాయి!" అన్నాడాయన!

వింటున్న తన శరీరం క్షణకాలం జలదరించింది! ఏ తండ్రి అయినా తన కన్న కూతుర్ని గురించి ఇంత సిగ్గుమాలిన మాట అనగలడా అనిపించింది కూడా!

"హవ్వ!" అమ్మ నోరు నొక్కుకుంది.

"అప్పుడు మన చేతుల్లో వాడి జుట్టు చిక్కడుతుంది! అంతే! 'నీ ఇంట్లో చదువుకోసం వదిలితే— మా అమ్మాయిని అన్యాయం చేశావు...... కాబట్టి నువ్వే పెళ్ళాడి తీరాలి. లేకుంటే కేసు పెడతా' ననేస్తాం మనం! అంతే! కిక్కురు మనకుండా తాళిగట్టి ఏలుకుంటాడు! ఏమంటావ్!"

"తాళి గట్టకుంటే?" ఓ పిచంగా ఏడుస్తూ అమ్మ అడిగింది.

"ఎక్కడికి పోతాడు? మురళి సంగతి నీకు తెలీదు : పరువు ప్రతిష్టలు గల యువకుడు! వాటి కోసం పడిచచ్చే సరుకు... ఎలా తప్పించుకు పోతాడు? మనం గోలచేస్తామని భయంతో వచ్చినట్లు ఒప్పుకుంటాడు."

అమ్మ ఏదో అరవబోయింది.

"ఇక నోరు మూసుకో! ఏదో అదకుంకవు! చెప్పకుండా పిల్లనక్కడ వదలిపెట్టొస్తే అఘోరిస్తుంటావని చెప్పాను గానీ, నీ

సలహా నా కవసరంలేదు. మా మీనాక్షమ్మ వదిన్ని కూడా అడిగాను. నా ఊహ భేషుగ్గా వుందం దావిడ.... నీతో ఏమిటి? వెర్రిపీనుగవు....!"

నాన్న విసురుగా వెళ్ళిపోవటం తనకు తెలుసు! అమ్మ పొగిలి పొగిలి ఏడుస్తుంటే. తన కడుపులో దేవినట్లయింది! నిజమే కన్నతల్లి తన బిడ్డ మూలంగా తనకూ తన కుటుంబానికీ అప్రతిష్ఠ వస్తుందేమో నన్నభయం ఓవేపు, తన బిడ్డ బ్రతుకు ఏమౌతుందో నన్నభయం మరోవేపు ఆమెను వేధించటంలో ఆశ్చర్యం లేదు!

మెల్లిగా అమ్మ దగ్గరకు వెళ్ళింది తను! కొంగు పరుచుకు నేలమీద పడుకుని మౌనంగా దుఃఖిస్తోందామె.

"అమ్మా! ఏమిటి?" అంది తను మెల్లిగా!

అంతే! అమ్మ తనను చుట్టుకుని బావురు మంది. తనకూ ఆ దుఃఖంలోనే గుండె మండినట్లయ్యింది. ఈ పెద్దవాళ్ళు-యీ ముసలి పీనుగలకు తనో ఆటపావా? కట్నాల సమస్య పెరిగిపోయిన మాట వాస్తవమే అయినా, ఆ సమస్య పెద్దలలో ఇంత ప్రలోభాన్ని ప్రకో పింప జేస్తోందా?

మురళీ, రాధల అన్యోన్య జీవితంలోకి తను చదువు సాకుతో హాలాహలంలా ప్రవేశించాలా?

వయసులోని బలహీనతల్ని సాకుగాచేసుకుని, రెండు నిండు జీవితాలతో చెలగాట మాడమని, తనను ముందుకు తోస్తున్నారా? మీనాక్షమ్మ పెద్దమ్మ, నాన్న, గోపాలకృష్ణయ్య మామయ్య-వీళ్ళు పెద్దలా?

వీరి ఉద్దేశం ప్రకారం తను మురళి జీవితంలో ప్రవేశించి అతణ్ణి వలలో వేసుకుని అతడిజీవితం ధ్వంసం చేయాలి! ఓ విధంగా తను పచ్చిసానిలా మారాలి!

తను ఎక్కువ వయసుకలది కాక పోవచ్చుకానీ, ఆలోచనా రహితురాలు మాత్రం కాదు!

కట్నాల సమస్యను తప్పించుకోడానికి, ఈ నా డెందరోతల్లి దం డులిలాటి డొంక తిరుగుడు మార్గాన్ని అవలంబిస్తున్నారని తనకు తెలుసు. కానీ ఇంతటి నీచత్వాన్ని అమలు జరపటానికి తనది కఠినపాషాణ హృదయం కాదు!

తనలో ధృఢ నిశ్చయం ఏర్పడింది: వీళ్ళందరికీ తగిన పాఠం నేర్పాలి!

"అదేమిటే కళ్ళు అలా ఎర్రగా వున్నాయి" అంది అమ్మ తనకేసి పరీక్షగా చూస్తూ!

"ఊహూఁ! ఏం లేదమ్మా!" అంది తను.

"మీ నాన్నగారి మతం మీ నాన్నగారిదేగాని. చెబితే విని పించుకోరుగదా? ఎలా చదువుకుంటావో ఏమిటో!" అమ్మ సందేహం తనకు తెలుసు. అందుకే నిండుగా నవ్వేసింది." అమ్మా! నాగురించి నీకెలాటి భయమూ వద్దు ...ఆ మాత్రం నమ్మకం నీకు లేదా నామీద?" అంది తను.

అమ్మకు కొండంత బలం వచ్చింది. తన తల ఆప్యాయంగా నిమిరింది అందులోనే, ఆ స్పర్శలోనే, కోటి దీవెనలు కురిపించింది. తనకు ఈ రోజు తనువెళ్తోంది. ఈ ముసలి పీనుగల చేతిలో ఓ పావుగా వెడుతోంది అయితేనేం? వీళ్ళకో గుణపాఠం నేర్పాలి.

"ట్యుటోరియల్ కాలేజి లంటే ఎలావుంటాయి రుక్కూ?" కంగారుగా అడుగుతున్న కమల ప్రశ్నతో త్రుళ్ళిపడింది రుక్మిణి!

"ఎలా వర్ణించను? మామూలు స్కూళ్ళలానే వుంటాయి. మేష్టర్లు చదువు చెబుతారు." ఏదో సమాధానం చెప్పి వూరుకుంది!

ఆ కమ్మటిలోకాన్ని గురించిన కలలో తేలిపోవటం మొద లెట్టింది కమల!

# 12

"ఈ రోజు నా పుట్టిన రోజు పండుగ బావా!"

నవ్వుతూ లోపలికి వస్తున్న లలితను ఆహ్వానించారు మురళి, రాధ.

"ఇంకేం? నీవు మాకు తీపి ఏదో పెడ్తావన్నమాట.... అయినా నువ్వింకా పుట్టిన రోజు పండుగలు చేసుకోవటమేమిటి చిన్నపాపల్లే?" నవ్వుతూ అన్నాడు మురళి.

"ఏం? ఎందుకు చేసుకోగూడదూ? నేను మా అమ్మకింకా చిన్నపాపనే! మరో పదిసంవత్సరాలు పోయాక కూడా మరీ చిన్న పాపనే! నే పండగ చేసుకోవటమేమిటి, నువ్వు బాధపడట మేమిటి?" వెటకారంగా నవ్వింది లలిత.

"నాకేం బాధ? హాయిగా రోజుకో పండుగ చేసుకో. మమ్మల్ని భోజనానికీ, కాఫీకీ, ఫలహారానికీ ఇంకా వీలయితే పిక్చర్‌కూ పిలుస్తూవుండు! హాయిగా హాజరై వస్తాం! ఎంచక్కా వచ్చేజీతం బ్యాంకిలో పడేసేస్తాను! ఇంచక్కటి మరదలు రోజూ విందు భోజనం పెడతానంటే వద్దనే తెలివి తక్కువ బావ ఎవడుంటాడు?"

రాధ, లలిత విరగబడి నవ్వారు మురళి మాటలకు.

"అయితే సరే! నీమాటమీద నిలబడు. ఏ రోజు ఏ పండుగకి నేను పిల్చినా నువ్వు రావాలి. రాకుంటే లాక్కెడతాను సరా?" కళ్ళు తళుక్కున మెరిపించి మురళికేసి చూసింది లలిత!

ఆ చూపులోని ఏ ఇంద్రజాలమో క్షణకాలం మురళీ హృదయాన్ని గాలం వేసిలాగి వదలినట్లయింది!

"కాఫీ త్రాగి వెళ్దూగాని వుండు లలితా!" లలిత వద్దంటున్నా వినకుండా, స్నేహ పూర్వకంగా నవ్వుతూ వంటింట్లోకి వెళ్ళింది రాధ.

లలిత, మురళి మిగిలిపోయారు గదిలో.

"కృష్ణమోహన్ ఏంచేస్తున్నాడు?" హఠాత్తుగా తయారైన ఏకాంతంలో ఊపిరాడలేదు మురళికి క్షణకాలం.

"గోళ్ళు గిల్లుకుంటున్నారు!" చిలిపిగా నవ్వుతున్నలలిత చిన్నినోరు, తెల్లని పలువరుస, గులాబీ రేకులతో చుట్టిన మల్లెల మాలలావుంది. మురళి కూడా నవ్వాడు. "ఎంతసేపు గిల్లుకున్నా. ఉండేవి చేతిగోళ్ళు పదేగా! అవి అయిపోయాక?" అన్నాడు.

"నే వెళతాగా! అప్పుడు నా గోళ్ళు ..." ఏదో అనబోతున్న లలితను వారిస్తూ, చప్పున అనాలోచితంగా అన్నాడు మురళి- "ఊహూఁ! గోళ్ళుకాదు. బుగ్గలు గిల్లుతాడు. అవునా?"

"ఊహూఁ!" లలిత బుగ్గలలో గులాబి మొగ్గలు పూచాయి! క్షణకాలంలో తెప్పరిల్లిన మురళికి, తనన్న మాటల్లోని అర్థం బాగా అవగతమైంది! తనెలా అన్నాడా అని ఆశ్చర్యపోయాడు! లలితకేసి చూశాడు. లలిత కట్టుకున్న లేత నీలిరంగు టెర్లిన్ చీరలోంచి. ఆమె ధరించిన ఎర్రని షిఫాన్ జాకెట్టూ, స్పష్టంగా కన్పిస్తున్న బ్రాసరీ ...

అనరానిదేదో తనకు మతిపోగొట్టింది—లలిత అలంకరణా? లలిత లోని ఆకర్షణా? ఏమిటీ రోజిలా మాట్లాడుతున్నాడు? తనన్న మాటకు లలిత నాజూకుగా సిగ్గుపడటంతో ఆమె ముఖం మరింత ఎర్రగా, అందంగా మారిపోయింది!

"సర్లే. సాయంత్రం ఐదులోగా రాండి. రాత్రికి అక్కడే వుండొచ్చు...."

కాఫీ కప్పులు ట్రేలో పట్టుకవస్తున్న రాధను చూచి నవ్వుతూ అంది లలిత.

లలిత వెళ్ళిపోయాక కూడా చాలా సేపు ఆలోచనలో పడి పోయాడు మురళి. ఎంత నచ్చజెప్పుకున్నా, రాధ వంటఇంట్లో వున్న సమయంలో లలితతో తను జరిపిన సంభాషణను గురించి ఒక్క ముక్కగూడా చెప్పలేక పోయాడు మురళి.

సాయంత్రం ఐదు గంటలకు వెళ్ళటానికి ముస్తాబైనాడు మురళి. రాధ ఎందుకో ఇంకా తెమలలేదు.

"ఏం రాధా! ఇంకా నీ ముస్తాబు కాలేః" అన్నాడు మురళి, ఎంతకూ రాధ తన గదిలోంచి రాకపోవటం చూచి గదిలోకి వెళ్తూ.

"నే రాను....మీరు వెళ్ళి రాండి...." అంది రాధ మురళిని చూచి నవ్వుతూ!

"ఏం ఎందుకనిః"

విస్మయంగా అడుగుతున్న భర్తవేపు చూచి ఫక్కున నవ్వింది రాధ.

"అరె అలా నవ్వుతావు....ః" రాధ దగ్గరగా రాబోతున్న మురళిని వారించింది నవ్వుతూనే.

క్షణకాలం అలా రాధకేసి చూసి పెద్దగా నవ్వేశాడు మురళి, "ఐ సీః" అన్నాడు సాలోచనగాః

"మరి నే నొక్కణ్ణే వెళ్ళనాః" నిస్పృహగా అడిగాడు.

"తప్పకుండాః ఆవిడేమనుకుంటుంది మీరు వెళ్ళకుంటే? నే రాని కారణం చెబుతారుగాః"

"ఊః"

మురళివెళ్ళాడు. ఎవరెవరో లలిత స్నేహితురాళ్ళు కాబోలు వస్తున్నారు, వెళ్తున్నారుః లలితకేవో బహుమతులిచ్చి, లలిత ఇచ్చే

స్వీట్సు ప్యాకెట్లు తీసుకు వెడుతున్నారు. కృష్ణమోహన్ తన కిదేం పట్టనట్లు 'లాన్'లో వైర్ కుర్చీలో కూర్చుని వున్నాడు, ట్రాన్సిస్టరు రేడియో పాటలు వింటూ!

మురళిని చూడగానే సాదరంగా ఆహ్వానించాడు.

"అరె! చెల్లాయి రాధేదీ?" అన్నాడు ఆప్యాయంగా.

"కాజువల్ లీవ్!"

ఇద్దరూ పెద్దగా నవ్వుకున్నారు....

"మీ ఆవిడ పుట్టిన రోజు పండగేమిటి? మీ రిలా లాన్‌లో కూర్చుని వుండడ మేమిటి?" హాస్యంగా అడిగాడు మురళి.

"మరేం? గంతులెయ్యమన్నారా?" కృష్ణమోహన్ నవ్వాడు.

"ఊహూఁ! ఆ హడావుడిలో పాల్గొనటం లేదేమని అడుగుతున్నాను!" అన్నాడు మురళి.

"ఓహ్ అదా? అక్కడ మనం చేసే పనేముంది గనక? అసలిలాటి తంతులన్నీ కేవలం తోచీ తోచని వాళ్ళు ఏర్పాటు చేసుకునే ఆర్భాటాలే గాని మరేం వుంది? అయితే ఇందులో నాకొచ్చే లాభమూ, నష్టమూ కూడా ఏమీ లేవు. లలిత సరదా పడ్తోంది! తన సరదాలు తీర్చుకొనే స్వేచ్ఛ తన కెప్పుడూ వుంటుంది. ఆవిడ ఆనందాన్ని నే నెందుక్కాదనాలి? అవకాశం వుంది!ఆర్థికమైన బాధలు లేవు....ఇంకేం? లలిత స్వేచ్ఛగా, ఆనందించడం కంటె నాకింకేం కావాలి?" కృష్ణమోహన్ కళ్ళల్లో, లలిత పట్ల అనురాగం తొణికిసలాడ్తోంది! క్షణకాలం కృష్ణమోహన్ సంస్కారానికి మురళి హృదయం ఎంతగానో ఆనందించింది.

"భలే భలే! ఇద్దరి కిద్దరూ లాన్‌లో కబుర్లాడు కుంటున్నారా? ఇంకా రాలేదేమిటా అనుకుంటున్నాను నేను. రాధేది బావా," విసురుగా సుడిగాలిలా వచ్చింది లలిత. పరిశీలనగా లలిత వేష

చూశాడు మురళి! ఇంతలోనే డ్రెస్‌మార్చి వేసింది! ఎర్రని కంచి పట్టు చీరె కట్టుకుని, తెల్లని శాటిన్ జాకెట్టు వేసుకుని వుంది. ఒడుపాటి కురులను తమాషాగా మెలిదిప్పి చక్కని పిగగా అమర్చింది! చెవులకు తెల్లని రాళ్ళు పొదిగిన పెద్దపెద్ద రింగులు వేలాడుతున్నాయి. నుదుటిమీద పెద్ద బొట్టులోని తళుకులు తళతళ మెరుస్తున్నాయి. "నిన్నే నోయ్ బావా! రాధేదీ అంటున్నాను?" కృష్ణమోహన్ కుర్చీ వెనకాలకు వెళ్ళి అతగాడి భుజాలమీద చేతులు వేసి, మురళికేసి కళ్ళు చికిలించి నవ్వుతూ అడుగుతోంది లలిత.

తెప్పరిల్లాడు మురళి. "నువ్వు స్త్రీవి! ఇలాంటి ప్రత్యేక సందర్భంలో రాధ రాలేక పోయిందంటే, కారణం నువ్వూహించుకో!" లలిత కనురెప్పలు తమాషాగా ఆర్పింది! "ఓహో! దురదృష్టం!" అంది.

"ఎవరిది?"

"నాదే!"

ట్రేలో నౌకరు కుర్రాడు స్వీట్లు, కాఫీ సరంజామా పట్టుకు వచ్చాడు. టీపాయ్ మీద సర్దింది లలిత.

"మరి నే వెళ్ళిరానా?" లలిత చేతికి చీరె, జాకెట్టు వున్న ప్యాకెట్టు ఇచ్చి లేస్తూ అన్నాడు మురళి.

"భలే వాడివే! ఎక్కడికి?" ఓ విధమైన అధికారం నిండి వుంది లలిత గొంతులో!

"మా ఇంటికి!"

"మీ ఇల్లు ఎక్కడికీ పోదు. ఇల్లాలు ఏమీ కాదు. రాధకు స్వీట్స్ పంపి, నౌకరుచేత కబురు పంపాను, తమరు ఇక్కడే వుంటారని!"

"ఆఁ!" ఇబ్బందిగా చూశాడు మురళి.

"మరేం ఫర్వాలేదులే! ఈ ఒక్క పూటకూ కొంపలు మునిగిపోవు!" అంది లలిత.

కృష్ణమోహన్ నవ్వుతూ .. "లలిత చెప్పిందిగా!" అన్నాడు. మురళి పలకలేదు. ఎంచేతో ఇంటికి వెళ్ళాలని ఎక్కువ ఆసక్తిగా లేదు కూడాను.

భోజనాలయ్యాక, మేడమీద గదిలో, పక్క వేశాడు నౌకరు. ఆ గది ఎదురుగా వున్న మరో గదిలో లలిత కృష్ణమోహన్‌ల పడకలున్నాయి. కిటికీలోంచి వెన్నెల మీద పడ్తోంది! మురళి ఆలోచనలో పడ్డాడు. ఏమిటీ రోజు తనకేమయ్యింది? ఎంతసేపూ లలిత చుట్టూరానే ఆలోచనలు తీగెల్లా అల్లుకుంటున్నాయి ఎందుక? ఓ విధంగా ఆలోచిస్తే విపరీతమైన ద్వేషంలోనుంచే విపరీతమైన ప్రేమ కూడా పుట్టుకు వస్తుందేమో? లలితను తను చిన్నతనంనుంచీ ద్వేషిస్తూనే వున్నాడు. అందుకు ఏవేవో కారణాలు చెప్పాడు, మనసుకు నచ్చ జెప్పుకున్నాడు కూడా. అలాగే, లలిత వాళ్ళిక్కడికి వచ్చారనగానే, లలిత మీది తన ద్వేషం రెట్టింపయ్యింది. కానీ ఈ రోజు? లలితమీద వెనకటి అకారణద్వేషం తనకుకలగలేదు సరి గదా, ఎన్నడూ కలగని అకారణ అభిమానం అంకురిస్తోంది. కారణం ఆమె అలంకరణా? ఆమె అతిచనువా? ఏమో? ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు మురళికి. ఎర్రని పట్టుచీరె వస్తోంది. రావడ మేమిటి? తన మెడ చుట్టూరా చేతులువేసి, తనకు హత్తుకు పోతోంది. ఆ తీయని స్పర్శకు తను వుక్కిరిబిక్కిరై పోతు న్నాడు. ఊపిరి సలపటం లేదు....తన చేతులు కూడా లలితను చుట్టివేస్తున్నాయి. లలిత ఏదో చెప్పబోతోంది. కానీ తన పెదవు లామె నేమీ మాట్లాడనివ్వకుండా ఆమె లేత గులాబిరంగు పెదవుల్ని మూసివేస్తున్నాయి. ఇది కలా? నిజమా?

మురళి వులిక్కిపడి కళ్ళు తెరచి చూచాడు.... తలుపు దగ్గర నిల్చునివుంది లలిత!

తెలగా తెలవారటానికెంతో సేపు లేదు!

పక్కమీద నిటారుగా లేచి కూర్చున్నాడు. తను కలగన్నాడా? లేక నిజంగానే లలిత వచ్చి తనని? ఒక్కొక్కసారి మనసు పూర్తిగా నిద్రావస్థలోకి జారిపోదు. అలాంటప్పుడు జాగ్రత్ సుషుప్త్యావస్థల మధ్యనున్న శరీరమూ, మనసు, జాగ్రత్ ప్రపంచంలోని కొన్ని విషయాలనూ, నిద్రావస్థలోని మరికొన్ని కలలనూ, కలగా పులగంగా అనుభవిస్తుంది! ఏది నిజమో, ఏది కలో ఓ పట్టాన అర్థంగాదు కూడా!

"అదేమిటిలా చిత్తరువులా చూస్తూ కూర్చుండి పోయావ్? క్రిందిగదిలో మా శ్రీవారు నీకోసం కాచుకుని వున్నారు కాఫీ త్రాగకుండా!" లలిత నవ్వుతూ అంది. చెదిరిన ముంగురులతో, నలిగిన చీరె, జాకెట్టుతో, ఉషః కాంతిలో ఆకులమధ్య విచ్చుకుంటున్న ముద్ద మందారంలా వుంది! మురళి కాస్త తెప్పరిల్లాడు. అయినా సందేహం పీడిస్తోంది.

లలిత తనను లేపటానికి వచ్చిందేమో? తను నిజంగానే ఆమె చిట్టూరా చేతులు వేశాడేమో? కానీ అలా చేసివుంటే లలిత తనని గట్టిగా పిలచి వుండదా? మందలించదా? నిద్రమత్తు వదగొట్టదా?

"అరె! ఏమిటా వెర్రిచూపూ, కలలో మనిషికి మల్లే?" లలిత ఇంకా అలాగే నవ్వుతోంది. ఒక చెయ్యి గుమ్మం పొడవునా పైకి పెట్టి, మరో చెయ్యి విరిచి వెనక్కుపెట్టుకొని, అజంతా శిల్పాలలోని నాట్య సుందరిలా వున్నట్లుతోచింది మురళికి.

కాళ్ళమీది దుప్పటి తొలగించుకుంటూ నవ్వాడు మురళి. నిజంగానే కలొచ్చింది లలితా! భలే తమాషా అయిన కల? చెప్పనా? అన్నాడు హుషారుగా.

లలిత క్షణకాలం బెదిరినట్లు చూచింది. "బావా! ఈ రోజు నీకేమిటో అయ్యింది!..లేకుంటే ఏమిటీ ధోరణి?చప్పున తెమలవయ్యా బాబూ! అంటూంటే....!" కిలకిలనవ్వుతూ చరచర మెట్లుకేపి వెళ్ళిపోయింది.

నిటారుగా నిల్చుని, పక్కకేసి చూసి ఉలిక్కిపడ్డాడు! లలిత తలలోని మల్లెలు కొన్ని తన పక్కమీద పడివున్నాయి! అయితే? లలిత ఇందాక తన చేతుల్లోనే వుండికాబోలు! కావాలనే వచ్చిందా? లేక తన నిద్రలో అలా . ?

"అమ్మగారూ, అయ్యగారూ తమరికోసం చూస్తున్నారు."
నౌకరు కుర్రాడి గొంతువిని, టూత్‌పేస్టూ, బ్రష్షూ పట్టుకుని గబగబ కిందికి దిగి వచ్చాడు మురళి.

"రండి....మీ కోసమే చూస్తున్నాను!" అన్నాడు కృష్ణ మోహన్, మురళిని ఆహ్వానిస్తూ, స్నేహపూర్వకంగా నవ్వుతూ!

టీపాయ్ మీద కాఫీ సరంజామా పెట్టుకు కూర్చునివుంది లలిత!

"మీరు త్రాగేసెయ్యండి ...మా బావ పళ్లుతోముకుని వచ్చే సరికి, మీరు రెండు మార్లు మద్రాస్ వెళ్ళిరావచ్చు!" అంది నవ్వుతూ.

"లేవటం ఆలస్యమైంది" నొచ్చుకుంటూ బాత్‌రూంవేపు వెళ్ళాడు మురళి.

"ఇక నన్ను ఇంటికెళ్ళనీండి!" అన్నాడు మురళి కాఫీ టిఫిన్ ముగించిలేస్తూ; ఎక్కివస్తున్న ఎండతోబాటు, "రాధ పాపం ఎలావుందో! ఏంచేస్తుందో?" అనే ఆందోళనకూడా పుట్టుకువస్తోంది

"అలాగే....!" అంది లలిత.

"ఎలాగూ నేనా త్రోవంటే వెడుతున్నాను. కారులో మిమ్మల్ని మీ ఇంటిదగ్గర డ్రాప్‌చేసి వెళ్తాను!" అన్నాడు కృష్ణ మోహన్.

# 13

అప్పుడప్పుడూ మురళిని, ఆ రోజు తెల్లవారుఝామున తనకి కల్గిన అనుభూతి తాలూకు స్మృతి వెంటాడుతూనే వుంది. అయినా దాన్ని పక్కకునెట్టి మామూలుగా మసలుకుంటున్నాడు. ఒకటి రెండు సార్లు రాధ అడగనే అడిగింది 'ఏమిటలావున్నారు?' అంటూ. "ఎలావున్నాను?" చిలిపిగా నవ్వుతూ అమాయకత్వం నటిస్తూ తను తిరిగి అడిగాడు మురళి. "ఏదో పోగొట్టుకున్నట్లూ, మరేదో పొందినట్టూనూ!" అంది రాధ గడుసుగా!

గతుక్కుమని, కంగారు కప్పెట్టుకుంటూ, నవ్వాడు మురళి. అవును మరి! చీకూ చింతా పోగొట్టుకున్నాను....అనురాగం, ఆనందం పొందాను! అన్నాడు రాధను దగ్గరకు లాక్కుంటూ.

రాధలో తనని గురించి ఏదేనా అనుమానం దేమో నన్న సందేహం గుండె దడదడలాడిస్తోంది.... కానీ రాధ తత్వం అలాంటిది కాదు ఏ విషయాన్నీ తరచి తరచి అడగటమూ రెట్టించి చికాకులు కొని తెచ్చుకోవటమూ ఆమె కసలు ఇష్టమూ లేదు అలవాటూ లేదు.

"ఛీ....ఛీ .. తరచూ లలితను చూడటం, అనవసరంగా మాటలు పెంచుకోవటం, మానెయ్యాలి...." గట్టిగా మనసుతో ఒప్పందం కుదుర్చుకు, ఒట్టుపెట్టుకున్నాడు మురళి ఆరోజు రాత్రి.

ఉదయం తొమ్మిదిగంటల ప్రాంతంలో రాధతో సరదాగా కబుర్లు చెబుతూ, వంటఇంటి గడప దగ్గిర పీట వాల్చుకు కూర్చున్నాడు

మురళి. ఆదివారం రోజు అర్ధాంగితో కులాసాగా కాలం వెళ్ళ బుచ్చటంలో గల ఆనందాన్ని వివరించి చెబుతున్నాడు రాధకు.

''మీ కొక్క నమస్కారం పెడతాను, మీ లెక్చర్ ఆపండి కాస్సేపు; లేకుంటే, సాంబారులో పెట్టవలసిన పోపు కూరలో, కూరలో వెయ్యవలసిన దినుసులు అన్నంలో వేసేలా వున్నాను....'' అంది రాధ నవ్వుతూ ;

"ఆ పని మాత్రం చెయ్యకు.'' అంటూన్న మురళి వీధి గుమ్మంవేపు చూచి కెవ్వుమన్నాడు. కంగారుగా రాధ కూడా గుమ్మం లోకి వచ్చింది ;

రిక్షాలు దిగి బిలబిల లోపలికి వస్తున్న బంధుబృందంలో, మామగారినీ, కమలనూ మాత్రం గుర్తు పట్టగలిగింది రాధ ;

''జాబు వ్రాసుంటే నేను స్టేషన్‌కొచ్చే వాణ్ణిగా ?'' అన్నాడు మురళి అందర్నీ ఆహ్వానిస్తూ.

''ఆ ; ఎలాగూ వస్తున్నాంగా ? జాబులెందుకూ ;'' జవా బుగా అన్నాడు సీతాపతి.

రాధకేం చెయ్యాలో పాలుపోలేదు క్షణకాలం.

''రాధా ; మానాన్నా, సీతాపతి మామయ్యా, కమలా, రుక్మిణీ వాళ్ళొచ్చారు. వాళ్ళకు నీళ్ళు పట్రా !'' అన్నాడు మురళి, రాధ పరి స్థితి గమనించి.

"అలా ఆ అమ్మాయిని కంగారు పెట్టెయ్యకు మురళీ ; మనమేం పరాయి వాళ్ళమా ? లోపల కొస్తాంలే ;"

హఠాత్తుగా ఇలా అంతా ఊడిపడటంలో ఏదో ప్రత్యేకమైన కారణమే వుండి వుండాలనిపించింది మురళికి.

"అలా బెదురుతా వేమ్మా రుక్కూ ; మీ బావేగా ; అదో మీ అక్కయ్య రాధ.... మన ఇల్లే అనుకో ;'' సీతాపతి రుక్మిణిని చూస్తూ అన్నాడు.

"రుక్మిణీ ! అదేమిటలా ! సిగ్గుపడ్తున్నావ్ ? కమలా! రుక్మిణీ నువ్వూ లోపలి కెళ్ళండమ్మా !" అన్నాడు మురళి.

రాధ, రుక్మిణి, కమల ఐదునిమిషాలలో అలవాటు పడి పోయారు! అదే స్త్రీల విచిత్ర మనస్తత్వం! అపరిచితులైనా ఆత్మీయులుగా మారిపోతారు ఐదు నిమిషాలలో! ఆత్మీయులైనా ఆగర్భశత్రువులుగా మారిపోతుంటారు మరొక్కసారి!

ఈ ఇద్దరు ముసిలాళ్ళకూ భోజనం ఎలా తయారు చేయించాలో అర్థంగాలేదు మురళికి! ఇద్దరి కిద్దరూ, 'మడి, ఆచారం' అనే బురఖాలు తొడుక్కున్న కుళ్ళు పీనుగలే! రాధ చేతివంట తింటే, మరుక్షణం మైలపడి, నరకంలో పడ్తామన్న అపోహకంటే, ఇతరుల కలా అనిపించాలని నటించే త్రాష్టులు! భ్రష్టులు!

"రుక్మిణీ, కమలా ఇక్కడే వుంటారు. మేమిద్దరం లలిత ఇంటికి వెడతాం భోజనానికి!" అన్నాడు సీతాపతి, మురళి హృదయంలో జరుగుతున్న భావ సంఘర్షణను అర్థం చేసుకున్నవాడిలా!

"నెత్తిన పాలు పోశావు!" అనుకున్నాడు మురళి లోలోపల!

మర్నాడు మధ్యాహ్నం సీతాపతీ, గోపాలకృష్ణయ్య కుండ బ్రద్దలు కొట్టారు. "రుక్మిణి కయ్యే భోజనం ఖర్చులు నేనే భరించు కుంటాను మురళీ! ఇలా అంటున్నానని మరోలా అనుకోకు. కాలేజీ హాస్టళ్ళలో చేర్చడం నాకు సుతరామూ ఇష్టంలేదు! ఆడపిల్లల హాస్టళ్ళు యీ రోజుల్లో నానా రభసగా వుంటున్నాయని వింటున్నాం! అందుకని, తెలిసి తెలిసీ అలాటి చోట్ల అమ్మాయిని వుంచడం నా కిష్టం లేదు!"

మురళి లోలోపల మండి పడ్డాడు! "ఆడపిల్లల హాస్టళ్ళన్నీ రభసగా వున్నాయట! మునలిపీనుగ! ఏదో ఓసాకు చెప్పి నానెత్తిన తోద్దామని చూస్తున్నాడీ పిల్లను!" అనుకున్నాడు.

సీతాపతి మళ్ళీ అంకించు కున్నాడు. "పైగా అప్పుడప్పుడూ తెలీనిపాఠాలు నీ చేత చెప్పించుకుంటుంది. కమలా, రుక్మిణీ తోడుగా వుంటారు!"

"సీతాపతీ! ఏమిటయ్యా నీ సొద? నువ్వింతగా చెప్పాలా? వాడేం కాదంటున్నాడా?" అన్నాడు గోపాలకృష్ణయ్య మధ్యలో కలుగజేసుకొని. ముసలి నక్కలిద్దరూ కలసి తన నోరెలా మూసేస్తున్నారో గ్రహించు కున్నాడు మురళి. ఇంకేం పలకలేదు.

రుక్మిణి లోపల్నుంచి దూసుకువచ్చింది. "బావా! బావా! ఈ రోజు పిక్చర్‌కు వెడదాం!" అంది మురళి కుర్చీవెనకగా నిల్చుని, అతగాడి భుజాల మీద చేతులుంచుతూ!

ఉలిక్కి పడ్డాడు మురళి. 'అయ్య బాబోయ్! ఈ రాక్షసిపిల్ల. ఈ సిగ్గుమాలిన పిల్ల.... ఈ సీతాపతి కూతురు ... ఆ తండ్రికి తగ్గ కూతురే....' ఇలా ఎన్నెన్నో అనుకున్నాడు. కూతురు తీసుకుంటున్న చొరవకు సంతోషించాడు సీతాపతి!

"అలాగే!" అన్నాడు మురళి నవ్వటానికి ప్రయత్నిస్తూ. సాయంత్రం గోపాలకృష్ణయ్య, సీతాపతి వూరికెళ్ళారు.

# 14

"బావా! కాసేపు నే లోపలికి రావచ్చా?" గదిగుమ్మం దగ్గర నిల్చుని మర్యాదగా అడిగింది రుక్మిణి.

రాధ, కమల షాపింగ్‌కు వెళ్ళారు-కమలకు చీరెలు, జాకెట్టు బట్టలూ తీసుకురావటానికి. చదువుకోవాలనే నెపంతో ఇంటి దగ్గరే వుండిపోయింది రుక్మిణి.

"ఆ!" అన్నాడు మురళి. 'ఈ పిల్లకు తనతో ఏం మునిగి పోయే పనో?' అనుకున్నాడు లోలోపల.

రుక్మిణివచ్చి, మురళికి కాస్త దూరంలో మరో కుర్చీలో కూర్చుంది. అమాయకంగా, అందంగావుండే రుక్మిణిలో ముగ్ధత్వం కంటే—పెంకెతనం, చిలిపి తనమే ఎక్కువగా కన్పిస్తాయి.

"నేనుకొన్ని విషయాలు నీతో స్పష్టంగా మాట్లాడుదామనుకుని వచ్చాను. రాధ అక్కయ్య ముందు చెప్పటం నా కిష్టంలేదు. అంతా విన్నాక, రాధక్కయ్య కీ సంగతులన్నీ తెలియటం మంచిదేనని నీకు తోస్తే, నువ్వే ఆమెతో చెప్పుకో! నాకెలాటి అభ్యంతరమూలేదు!" క్షణకాలం ఆగింది రుక్మిణి.

విస్మయంగా వింటున్నాడు మురళి. తన తండ్రి ముందు, తన మీద చేతులు వేసిన ఆ రుక్మిణేనా ఈ అమ్మాయి? అనిపించిం దతగాడికి!

''ఇక్కడ నన్నుంచటంలో మానాన్న ఉద్దేశం, కేవలం చదువుకాదు....'' సందేహిస్తూ మురళివేపు చూచింది.

"చెప్పు రుక్మిణీ! ఏలాటి సందేహమూ పెట్టుకోవద్దు చెప్ప టానికి". అన్నాడు మురళి కుతూహలంతో రుక్మిణి వేపు చూస్తూ

''ఓ విధంగా మనిద్దర్నీ సన్నిహితం చెయ్యాలని....''

షాక్ తిన్నట్లు చూచాడు మురళి-''ఏమిటి నువ్వంటున్నది?'' అన్నాడెలాగో సంబాళించుకుంటూ.

"అంతకంటే వివరంగా చెప్పలేను. ఇందులో మానాన్నకు సపోర్టుగా గోపాలకృష్ణయ్య మామయ్యా, మీనాక్షమ్మ పెద్దమ్మ కూడా వున్నారు. కానీ నా వుద్దేశం మాత్రం ఇదికాదు!"

క్షణకాలం మురళికి మతిపోయినట్లయింది. రుక్మిణి చెబు తున్నదీ, తను వింటున్నదీ, భ్రమేనేమోనన్న అనుమానము కలిగింది.

"మీ వరండాలో వున్న గదిలో నేనూ, నా సామాన్లూ, పుస్తకాలూ వుంటాము. నావరకు నేను చదువుకోవటమూ, కారియర్ తెప్పించుకు భోజనమూ చేస్తాను. మీకెవ్వరికీ ఎలాటి కష్టమూ కలగనివ్వను, కానీ...."

"ఏమిటి రుక్మిణీ?" ఆప్యాయంగా అడిగాడు మురళి రుక్మిణిలో దాగివున్న సంస్కారం చూస్తూ ముగ్ధుడై పోయాడు.

"మా నాన్నగానీ, గోపాలకృష్ణయ్య మామగానీ, ఇక్కడకు వస్తే, ఆ రెండ్రోజులు మాత్రం నీతో అతి చనువుగా ప్రవర్తిస్తాను. అందుకు నువ్వు మరోలా అనుకోవద్దు."

మురళి మనస్ఫూర్తిగా నవ్వాడు. "రుక్మిణీ! నీలో ఇంత ఆలోచనాశక్తి వుందని నాకు తెలీలేదు. నానుంచి నీకెలాటి భయమూ లేదు.!" అన్నాడు ఆదరంగా చూస్తూ.

"బావా! నాకు అన్నయ్యలా వుండి నన్ను ఆదరిస్తావనే కొండంత ఆశతో నీతో అన్నీ చెప్పాను. మరి నీ ఇష్టం!" అంది రుక్మిణి లేస్తూ

"అలాగే రుక్కూ!" అన్నాడు మురళి సంతోషంగా.

# 15

రుక్మిణి ఎన్నిమాటలు చెప్పిందో, అక్షరాలా అన్నిమాటల ప్రకారం నడుచుకుంటోంది. వరండా గదిలో వుంటుందే గాని, అనవసరంగా ఏ విషయంలోనూ జోక్యం కలుగజేసుకోదు. కమల, రుక్మిణీ ఇద్దరూ కలిసికట్టుగా చదువుకుంటూ, ఆరూములోనే పడుకుంటారు రాత్రుళ్ళు. మురళిని కూడా అనవసరంగా 'అదిచెప్పు' 'ఇది చెప్పు' అంటూ అడగదు

అప్పుడప్పుడూ "అక్కయ్యా! ఏదేనా సాయం కావాలా! నీరసంగావున్నట్టున్నావ్? నేవంట చేస్తాలే! నువ్వు విశ్రాంతితీసుకో!" అంటూ రాధకు సాయం చేస్తుంది.

"రుక్మిణి ఎంత మంచి పిల్లో చూడు రాధా! ఇలాటి మంచి అమ్మాయికి సీతాపతిలాటి కుయుక్తిపరుడు తండ్రి అంటే ఎంతగానో జాలేస్తుంది నాకు," అన్నాడు మురళి రాధతో.

"అవును. అందుకే ఆ అమ్మాయి వివేకంతో, తన జీవితాన్ని పూలబాట చేసుకోగలదు!" అంది రాధ- తన దీవెననుకూడా జోడిస్తూ.

మురళిఇంటినిండా మనుషులుచేరటంతో లలితకు ఎక్కడలేని చిరాకుగా వుందీ మధ్య. ఎప్పుడు చూచినా కమల, రుక్మిణీ వుంటారు! ఇంతక్రితంలా మురళితో తరచూ ఏకాంతాన్ని కల్పించుకునే అవ కాశం ఏర్పడటంలే దామెకు! అంచేతే, తను నిర్ణయించుకున్న పథకం తలక్రిందులై, మురళి తన చేతుల్లోంచి జారి పోతాడేమోనన్న సందేహం పట్టుకు పీడిస్తోంది!

ఆ రోజు తెల్లవారుఝామున, తను కావాలనే మురళి గదిలోకి వెళ్ళింది నిద్రలేపే నెపంతో. వంగి అతగాడి మీద చేతులు వేసింది బుద్ధిపూర్వకంగానే! మురళి నిద్రలో వున్నవాడల్లా, ఊపిరి సలప కుండా, తనని చేతులతో చుట్టేశాడు! నౌకరుకుర్రాడు వస్తాడేమోనని తనే హడిలి పోయింది. ఎలాగో మురళి పట్టువిడిపించుకుని గుమ్మం దగ్గర నిల్చుంది. లలిత కిలా ఆలోచిస్తున్నకొద్దీ మరింత చికాకు ముంచుకు వస్తోంది.

"లలితా!" మృదు మధురంగా పిలిచాడు కృష్ణమోహన్. త్రుళ్ళిపడి తలతిప్పి చూచింది లలిత.

"అరె! అదేమిటి? నీ కళ్ళలా ఎర్రగా నిప్పుల్లా వున్నాయేం?" ఆదుర్దాగా భార్య దగ్గరగావస్తూ అడిగాడు కృష్ణమోహన్

"ఏమిటో కళ్ళు మంటలుగా వున్నాయి!" ముక్తసరిగా జవా బిచ్చింది లలిత. తనహృదయంలోని అగ్నిగోళాలకి మల్లే తనకళ్ళు కూడా మండుతున్నాయని ఆమెకు తెలుసు.

"అయితే పద ఐ స్పెషలిస్టు దగ్గరకు వెడదాం!" అన్నాడు కృష్ణమోహన్.

"మీకో నమస్కారం పెడతాను. ఐ స్పెషలిస్టూవద్దు. ఏ స్పెషలిస్టూవద్దు. నన్నిలా వదలండి!" అంది లలిత చిరాగ్గా. కృష్ణ మోహన్ క్షణకాలం లలితవేపు పరిశీలనగా చూశాడు లలితలో అతగాడి కీ మధ్య ఎదో తెలియని మార్పు స్పష్టంగా గోచరిస్తోంది. అయితే అది 'ఫలానా' అని అతగాడు తేల్చుకోలేకుండా వున్నాడు. ఎప్పుడు లలితను తను ప్రేమతో లాలించాలని చూచినా, ఆమె ఏదో చిరాకుగా వుంటుంది. అంతేకాదు ఈమధ్య తన వునికినే భరించ లేనట్లుగా అసహ్యించు కుంటోంది! తనేం చేశాడు?

ఏ క్షణంలో ఏ వస్తువుకోరినా ఆ వస్తువు తెప్పించుకోగల ఆర్థిక స్తోమతూ, అవకాశమూ లలితకు ఎప్పుడూ వున్నాయి తన వలన.

లలిత ఏ నిమిషంలో ఏ పండుగ, ఏ వేడుక, ఏ సరదా జరుపు కోవాలన్నా తను "ఊఁ" అనడమే కానీ, కలలోకూడా "ఊహూఁ" అనడు! ఎక్కడికి వెళ్ళాలన్నా, కావలసినంత స్వేచ్ఛవుంది లలితకు. అన్నిటికీ మించి, స్త్రీలు కోరే భర్తప్రేమ తను అన్ని విధాలా ఇవ్వటానికి అనుక్షణం కృషి చేస్తూనే వున్నాడు. ఓ విధంగాచెప్పా లంటే, లలితను తను హృదయాధి దేవతగా ఆరాధిస్తూ, పూలతో పూజిస్తున్నాడు—

కానీ, ఎందుకు ఇలా వుంటోంది? అదే అర్థంగాని చిక్కు సమస్యగా తయారయింది కృష్ణమోహన్‌కు. మద్రాస్‌లో వుండగా, ఎప్పుడో ఒకనాడు చిరాకుగా, ఉదాసీనంగా ఉండేది! కానీ ఇక్కడ అస్తమానూ ధుమధుమలాడుతోనే వుంటోంది!

# 16

నెల తిరక్కుండా సీతాపతి వచ్చాడు. ఆయన్ని వీధిలో చూచిన రుక్మిణి పరుగెత్తుకుంటూ ఇంట్లోకి వచ్చింది. కమల ట్యుటోరియల్ కాలేజికి వెళ్ళింది. రాధ వంటచేసుకుంటోంది రుక్మిణి మురళి గదిలోకి దూసుకు వచ్చి, మురళి కూర్చునివున్న కుర్చీ చెయ్యి మీదకూర్చుంది నవ్వుతూ.

"రుక్మిణీ ఏమిటిది? ఏ మయ్యింది?" కంగారుగా అడిగాడు మురళి, హఠాత్తుగా రుక్మిణి ప్రవర్తనలో మార్పుకు కారణం తెలియక తికమకపడ్తూ. "బావా! కాస్సేపీ క్రొత్తమ్యాగజైన్‌లోని కథ చదివ్వినిపించవూ?" గారాలు పోతూ అతగాడి భుజం మీద చెయ్యి వేసి అడిగింది రుక్మిణి.

మరింతగా విస్తుపోయిన మురళి అప్రయత్నంగా గుమ్మంకేసి చూశాడు. సీతాపతి చిరునవ్వుతో నిల్చునివున్నాడు. క్షణంలో రుక్మిణి ప్రవర్తనలోని వింతదనం బోధపడింది.

"అబ్బబ్బ! పెంకెపిల్లవు రుక్కూ! చదివ్వినిపిస్తాగా" అన్నాడు మురళి రాని చిరునవ్వును తెప్పించుకుని.

అంతలోనే-అప్పుడే సీతాపతిని చూచినట్లు "అరె! నాన్న!" అంది రుక్మిణి ఆశ్చర్యాన్ని అమోఘంగా నటించేస్తూ!

మురళి తడబడి పోయాడు! ఆ తడబాటులో, సీతాపతి ఇలాటి దృశ్యం చూచి ఏమనుకుంటాడో నన్న కంగారు తాలూకునటనే నిండి వుంది!

''రా! మామయ్యా! ఇప్పుడేనా రావటం?'' అన్నాడు మురళి. ''ఊఁ ఏమిటో రుక్మి ఐడుగుతోంది? మీకేం ఇబ్బందిగా లేదుకదా మా రుక్మిణిక్కడ వుండటంవల్ల?'' అన్నాడు సీతాపతి. లోలోపల 'రుక్మిణి అసాధ్యురాలు! అప్పుడే అతగాడి కుర్చీచేతిమీద కూర్చునే చనువు సంపాదించేసింది!' అనుకున్నాడు'. మురళి రుక్మిణి వేపు చూచి కొంటెగా నవ్వాడు.

''రుక్మిణి వల్ల మాకు ఇబ్బందా, భలే వాడివే! నిజానికి ఇంట్లో ఇంతక్రితం నేనూ రాధా వుండే వాళ్ళమే గానీ, ఏలాటి స్పందన.... పోనీ థ్రిల్ అంటాను. వుండేది కాదనుకో మామయ్యా! రుక్మిణి అడుగెట్టిందో లేదో, మా యిల్లు కలకలల్లాడి పోతోందంటే నమ్ము అస్తమానూ తను 'బావా బావా' అంటూ ఇల్లంతా తిరుగు తూంటే, నాకెంత ఆనందంగా వుందనుకున్నావ్! అదీగాక, ఇంత క్రితం, రాత్రిపూట అసలు తోచి చచ్చేదికాదు! కానీ యీ మధ్య రోజూ రుక్మిణికి తెలియని పాఠాలు చెబుతూంటే, రాత్రుళ్ళు అసలు కాలం ఎలా గడిచిపోతుందో గూడా తెలియటం లేదు!''

సీతాపతి హృదయం ఆనందంతో గంతులు వేస్తోందన్నందుకు గుర్తుగా, అతగాడి బుర్రమీసాలలో మొలకనవ్వు వెలసింది!

''పో బావా! నీ దంతా మరీ విడ్డూరం!'' సుతారంగా మురళి భుజంమీద ఒక్కదెబ్బవేసి, లోపలికి పరుగెత్తింది రుక్మిణి.

''అల్లరి పిల్ల!'' రుక్మిణి వెళ్ళిన వేపు నవ్వుతూ చూస్తూ, అన్నాడు మురళి. ఉన్నరెండురోజులూ సీతాపతికి ఆనందదాయక మైన దృశ్యాలే కంట బడ్డాయ్.

కమల, రాధ ఎవరో స్నేహితులింటికి వెళ్ళారు. మురళి, రుక్మిణి, సీతాపతి మిగిలిపోయారు ఇంట్లో.

''బావా! ఏం తోచడంలేదు నాకు,'' అంది రుక్మిణి.

"నాకూ్కడా-మరి ఛప్పున తయారు కా, పిక్చర్‌కు వెడదాం! మామయ్యా! నువ్వూ రాకూడదూ?" అన్నాడు మురళి."

"ఊఁ! నే నెందుకులే....? నాకేమిటో రావాలని లేదు," అనేశాడు సీతాపతి.

పది నిమిషాల్లో అప్సరసలా అలంకరించుకుని బయటికి వచ్చిన కూతుర్ని చూచి ఆశ్చర్యపోయాడు సీతాపతి.

చెట్టాపట్టా లేసుకుని, సరదాగా వెళ్తున్న మురళినీ, రుక్మిణినీ చూస్తూ సీతాపతి హాయిగా నిట్టూర్చాడు.

'నే చెప్పలే-ఎంతసేపు ఈ కాలంలో ప్రేమ మొదలవడం? ఒక్కనెల రోజుల్లోనే మురళి, రుక్మిణులమధ్య ప్రేమ పుట్టుకొచ్చింది. ఇంకెన్నాళ్ళు?మరో మూడు నెలలు తిరిగేసరికి, బహుశా వీళ్ళిద్దరూ భార్యాభర్తలై పోతారు!' అందాయన మనస్సు ఉత్సాహంగా.

మరునిమిషంలోనే మరో ఊహ కూడా కలిగింది. 'ఈ సమయంలోనే ఏకాంతం ఎక్కువగా కల్పించాలి. ఏదేనా మిషమీద రాధనూ, కమలనూ, కొద్దిరోజులు ఇక్కణ్ణుంచి పంపించి, మురళి రుక్మిణి మిగిలిపోయేలా చూడాలి' ఆ క్షణంలోనే ఆయన బుర్ర చాకులా పనిచెయ్యటం ప్రారంభించింది కూడాను.

కానైతే; వీధి మలుపు తిరగగానే మురళి, రుక్మిణుల మధ్య జరిగిన ఒప్పందం, సీతాపతి కలలో కూడా ఊహించనిది!

"బావా! ఇక నేను నా స్నేహితురాలు సరళ ఇంటికి వెడతాను. వీలైతే దాన్ని తీసుకుని సినిమాకు వెళ్ళొస్తాను. నీ ఇష్టమొచ్చిన పిక్చర్‌కు నువ్వెళ్ళు, మొత్తం మీద మళ్ళీ తొమ్మిదిన్నర, పదిగంటల మధ్య ఇక్కడే నా కోసం కాచుకునివుండు. ఇద్దరం కలిసి ఇంటికి వెడదాం!" అంది రుక్మిణి.

మురళి మనస్ఫూర్తిగా నవ్వాడు. "ఆల్‌రైట్! అలాగే కానీ!" అన్నాడు హుషారుగా.

రాత్రి తొమ్మిదిన్నర దాటాక, మురళి అదే వీధి మలుపులో రుక్మిణి కోసం ఎదురు చూస్తున్నాడు. అల్లంత దూరంలో, ఎవరో యువకుడు రుక్మిణి పక్కగా నడచివస్తూండటం స్పష్టంగా చూశాడు.

"రుక్మిణి స్నేహితురాలు 'సరళ' ఇతగాడా?" అనుకున్నాడు ఆశ్చర్యపోతూ. రుక్మిణిలాటి మంచి అమ్మాయి ఇలా పెడదారులు పడుతూందనుకోడానికి మనసు అంగీకరించటం లేదు.

"ఏం బావా! ఇక వెడదామా?" అంది రుక్మిణి దగ్గరగావస్తూ.

"ఊఁ, వెడదాం!"

'అతగా డెవరు?' అని అడగాలనుకుని కూడా అడగలేక పోయాడు మురళి. కిలకిల నవ్వుతూ వస్తున్న మురళినీ, రుక్మిణినీ చూచి, సంతృప్తిగా ఊపిరి విడిచాడు సీతాపతి,

అంతా తెలిపిన రాధ చిరునవ్వు నవ్వి వూరుకుంది. అంతు బట్టని కమల అయోమయంగా చూస్తూఉండి పోయింది.

# 17

బంగళా గేటు తోసుకువస్తున్న గోపాలకృష్ణయ్యను చూచి విస్తు పోయింది లలిత.

"రా! మామయ్యా!" అంది ఎలాగో తేరుకుని

"ఆ! అబ్బాయి వున్నాడా?" అన్నాడు గోపాలకృష్ణయ్య చేతిసంచి గోడవారగా పెడ్తూ.

"ఊఁ! కంపెనీ పనిమీద, ఎక్కడికో వెళ్ళారులే!"

మధ్యాహ్నం భోజనాలయ్యాక తాపీగా తను వచ్చిన అసలు విషయం చెప్పాడు గోపాలకృష్ణయ్య.

"రాధనూ, కమలనూ ఓ నెలరోజుల పాటు తీసికెళ్ళాలని వచ్చాను" అన్నా డాయన.

ఆశ్చర్యంగా చూచింది లలిత నమ్మనట్లు.

"ఎందూకూ?" అంది.

"ఎందుకేమిటి? మీ అత్తయ్య కోడలిచేత ఏదో ఫలదానం చేయిస్తుందట, బిడ్డలు కలుగుతారని దానినమ్మకం!"

మరింతగా ఆశ్చర్యపోయింది లలిత. అసలు రాధను తన గడప తొక్కనివ్వనన్న మామయ్యేనా ఇలా మాట్లాడుతూంట? అనుకుంది లోలోపల.

ఆమె మనసులోని ఊహ పసిగట్టాడల్లేవుంది, గోపాల కృష్ణయ్య ఫక ఫక నవ్వాడు-"ఏ వేళ కేది జరుగుతుందో?"

ఈ మిష్టరీ ఏమిటో బొత్తిగా భోధపడలేదు లలితకు.

"అసలు కథంతా త్వరలోనే తెలుసుకుంటావు లేవే పిల్లా!" లలిత ముక్కు పట్టి సుతారంగా లాగివదిలాడు గోపాలకృష్ణయ్య.

'ముసలిపీనుగ! వయసు వచ్చినా, వెలికివేషాలు తగ్గలేదు!' అనుకుంది లలిత. 'మొత్తం మీద ఎలాగో ఓలా రాధ, కమల వదిలి పోతున్నారు. ఓ నెల రోజుల్లో బావను తన కాలి గోటికి కట్టేసు కోవచ్చు.' అనుకుంది హాయిగా ఊపిరివిడుస్తూ.

## 18

నిజానికి గోపాలకృష్ణయ్యకి ఈ ఊహ అపళంగా పుట్టుకు రాలేదు. మురళీ, రుక్మిణుల అన్యోన్యత కళ్ళారా చూచిన సీతాపతి, ఉరుకులు పరుగులమీద వెళ్ళాడు గోపాలకృష్ణయ్య దగ్గరకు.

"మాంచి రసపట్టులో వుందోయ్ బావా!" అన్నాడు వస్తూనే సీతాపతి.

"ఏమిటి?'' అన్నాడు గోపాలకృష్ణయ్య.

"మీ మురళి, మా రుక్మిణి సాగిస్తున్న ప్రణయ ఘట్టం!"

"నీ మొహం!" అన్నాడు గోపాలకృష్ణయ్య, నమ్మలేనట్టు.

"అలాగే అనుకో, ఓమారెళ్ళి చూచి రారాదూ! నీకే తెలుస్తుంది! అన్నట్లు ఒక నెల రోజులు రాధనూ, కమలనూ అక్కణ్ణించి తప్పించటం ఎంతైనా అవసరం!''

"ఎలా?"

"నే చెబుతాగా!''

వడ్డిస్తున్న జగదాంబతో, మెల్లిగా సంభాషణ మొదలెట్టాడు సీతాపతి.

"చెల్లెమ్మా! ఈ చిత్రం విన్నావుటమ్మా?"

"ఏమిటి?'' నిర్లిప్తంగా అడిగింది జగదాంబ—సీతాపతి వాగే అనేకానేక జబద్ధాలలో, ప్రపంచంలో లేని చిత్రాలలో, ఇప్పు డత గాడు చెప్పబోయేది ఒకటి గాబోలు అనే నిర్లిప్త భావంతో.

"ఈ రోజుల్లో కూడా దేవుడున్నాడమ్మోయ్! నోములూ, వ్రతాలూ ఫ్యాషన్ కాదనుకున్న ఈ రోజుల్లో, మొన్న మా వూళ్ళో ఓ గొడ్రాలికి బిడ్డ పుట్టాడు!''

జగదాంబ చిత్రంగా చూచింది.

"అవునమ్మా చెల్లెమ్మా! మంచి గుమ్మడి పండ్లు ముత్తైదువలకు దానమిప్పిస్తే, గుమ్మడిపండ్లంటి బిడ్డలు పుడతారని మనం పురాణాల్లో చదివాం. మొన్నను మా వూళ్ళో వొకావిడ అలా దానమిచ్చిందిట. ఏడాది తిరిగే సరికి పండంటి పిల్లాణ్ణి ఎత్తుకుంది!"

గోపాలకృష్ణయ్య ఏదో ఆలోచించినట్లు కాస్సేపు వూరుకొని, "అయితే మా కోడలు రాధ చేత చేయిద్దాం ఆ నోము,'' అన్నా

ఉరుము లేని ఈ పిడుగుకు ఆశ్చర్యపోయింది జగదాంబ తను ఎలా చెబుదామా అని సతమత మౌతున్న మాట కాస్తా భర్త అనే సరికి కొండెక్కినంత సంబర పడింది.

మర్నాడే బయల్దేరాడు గోపాలకృష్ణయ్య. అదీ జరిగి

# 19

లలితతో మాట్లాడి మురళి ఇంటికి వచ్చాడు గోపాలకృష్ణయ్య. మధ్యాహ్నమే తను వచ్చిన విషయం చెప్పాడు.

తన గడప తొక్కనివ్వనన్న కోడలిని తనంత తానుగా పిల్చుకుపోతానని తండ్రి రావటం చూసి, క్షణకాలం నివ్వెర పోయాడు మురళి. అందులోనూ కమలను కూడా పిల్చుకెళ్తాననడం మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

"కమ లెందుకూ? చదువు పాడౌతుంది." అన్నాడు మురళి.

"ఆ! ఎంత? ఓ పది రోజుల్లో పంపెయ్యనూ?" అన్నాడు గోపాలకృష్ణయ్య. మరి మాట్లాడలేక పోయాడు మురళి.

"మా నాన్న సామాన్యుడు కాడు రాధా! ఆయన రాకలో ఏదో తెలియని రహస్యం వుంది," అన్నాడు మురళి.

"మీది మరీ అనుమానం! అత్తయ్య గారేదో నోము నోపిస్తారట నా చేత....!"

"సర్లే! ఓ నెలరోజు లక్కడుంటే నీకే తెలుస్తాయిలే అన్నీ!"

ఆ రోజు రాత్రి చల్లటి వెన్నెల్లో డాబా మీదా చాప పరచి, పుస్తకాలు పరుచు కూర్చుంది రుక్మిణి, మురళి కెదురుగా!

చదువు సాకుతో, పకపక నవ్వుకుంటున్న వా ళ్ళిద్దర్నీ చూచి, గోపాలకృష్ణయ్య మురిసి పోయాడు

"జాగ్రత్త రాధా!" ట్రెయిన్ కదలగానే తిరిగి వచ్చాడు మురళి. ఇంటికి రాగానే ఎదురుగా రూం తాళం వేస్తున్న రుక్మిణి కన్పించింది.

"ఎక్కడికి రుక్మిణీ?" అన్నాడు మురళి విస్మయంతో.

"మా స్నేహితురాలు సరళ ఇంట్లో వుంటాను ఈ నెల రోజులూ. అక్కయ్య, కమల రాగానే మళ్ళీ ఇక్కడికి వస్తాను బావా!" అంది రుక్మిణి. మురళి ఆశ్చర్యంతో చూచాడు రుక్మిణి వేపు—"ఏం నా మీద నమ్మకం లేదా రుక్కూ?" అప్యాయంగా అడిగాడు.

"లేకేం? కానీ ఒంటరిగా అస్తమానూ ఈ రూములో గడప లేను. పోనీ.... పగలంతా ఇక్కడే వుంటాను. రాత్రిళ్ళు మాత్రం నే వెళ్ళి సరళ ఇంట్లో పడుకుంటాను సరా?" అంది రుక్మిణి నవ్వుతూ!

"నీ యిష్టం!"

## 20

రుక్మిణి సరళ ఇంటికి వెళ్ళిపోయింది. ఏడు కావొస్తోంది గంట బొత్తుగా తోచక తికమక పడ్తున్నాడు మురళి. అలా కాస్సేపు తిరిగి వద్దామని బయల్దేరాడు.

వీధి మలుపు తిరిగి తన దగ్గరగా వచ్చి ఆగిన రిక్షావేపు కుతూహలంతో చూచాడు. భువన మోహనంగా అలంకరించుకుని, లలిత తనకేసే చూస్తోంది.

"ఆదేమిటి బావా! వీధిలో అలా నిలబడి పోయావ్? రాధ, కమల వూరికెళ్ళారటగా? రుక్మిణుందా ఇంట్లో?" అని అడిగింది రిక్షా లోంచి దిగుతూ.

"రుక్మిణి వాళ్ళ స్నేహితురాలింటికి వెళ్ళింది. నువ్వేక్కడి కిలా బయల్దేరావ్? మీ కారేమైంది?"

లలిత కిలకిల నవ్వింది. "కారులో శ్రీవారు హైద్రాబాదు వెళ్ళారు- బహుశా రేపు వస్తారేమో! నాకూ ఏం తోచలేదు. నిన్ను పరామర్శించి, కాసేపు రుక్మిణితో కబుర్లాడి వెళ్దామనుకున్నాను.... సరే....'నాజ్' థియేటర్‌లో కొత్త హిందీ పిక్చరొచ్చింది. వెడదామా?"

"ఇప్పుడా?"

"మరి తెల్లారాకా? రావోయ్ బావా! అతిగా బెట్టుచెయ్యక!" వీధిలో అటూ ఇటూ వెళ్తున్న జనం తమకేసి చూస్తున్నట్లు తోచింది మురళికి.

"రిక్షా ఎక్కు- బావా చప్పున. ఈసరికే పిక్చర్ మొదలెట్టుంటారు కూడా!"

ఏ అజ్ఞాత శక్తో మురళిని నెట్టింది....

రిక్షాలో ఎంత ఒదిగి కూర్చున్నా ఇద్దరు పెద్దవాళ్ళ శరీరాలు తగలకుండా వుండటం సాధ్యంకాదు. బిగుసుకు కూర్చున్న మురళిని చూచి నవ్వుతూ "ఆదేమిటి బావా! ఫ్రిజడేర్‌లో వేసినట్లు గడ్డకట్టుకు పోయావ్?" అంది లలిత, అతగాడి భుజంమీద తన అరచేత్తో మృదువుగా రాస్తూ.

"ఊఁహూఁ లేదే!" నవ్వాడు మురళి.

హాల్లో రష్ విపరీతంగా వుంది. పై వరుసలో మధ్యలో రెండే రెండే సీట్లు ఖాళీగా వున్నాయి.

"ఏం బావ మౌనముద్ర [illegible] ఏం?" అతగాడి చేతిమీద మెల్లిగా తడుతూ అడిగింది లలిత.

"నువ్వు చేసే పన్లేమిటో నీకే అర్థం గావాలి!" మురళి లలితకేసి చూస్తూ అన్నాడు.

లేత నీలిరంగు జపాన్ జార్జెట్ చీర, తెల్లని క్రేప్ స్లీవ్‌లెస్ బ్లౌజులో లలిత శరీరపు వొంపు సొంపులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. తనకేమిటో గిలిగింత లవుతూంది.

"ఏం చేశాను? తోచక బయల్దేరాను. బావ ఎదురయ్యాడు! పిక్చర్‌కు లాక్కొచ్చాను: ఇందులో అర్థంగాని పనేమిటో చెప్పు... మచ్చుకు ఒక్కటి?" లలిత కిలకిల నవ్వుతూ మురళి నడుంచుట్టూ చెయ్యివేసింది.

అందాకా ఎలాగో నిగ్రహించుకుంటున్న మురళి మనస్సు ఇక నిలువ లేదు. లలిత నడుం చుట్టూ చెయ్యివేస్తూ "ఊఁ! గడుసు పిల్లవు లలితా!" అని మాత్రం అనగలిగాడు.

పిక్చర్లో ఏ సీను జరుగుతోందో, ప్రేక్షకులు ఎందుకు నవ్వుతున్నారో కూడా అర్థం కాలేదు వాళ్ళిద్దరికీ!

ఇంట్రవల్‌లో తల తిప్పి వెనక్కు చూచిన రుక్మిణి క్షణ కాలం తన కళ్ళను తనే నమ్మలేక పోయింది. లలిత, మురళి ఇహలోకంలో లేకుండా, ఏదో లోకాల్లో తేలిపోతున్నట్లున్న చూపులతో నవ్వుకుంటున్నారు!

"ఏమిటి రుక్కూ? ఎవరేనా తెలిసిన వాళ్ళొచ్చారా?" అంటున్న సరళ మాటలకు, ఎలాగో తేరుకుని "ఊఁహూఁ!" అంటూ తల తిప్పేసుకుంది రుక్మిణి.

పిక్చర్ వదలగానే, తిరిగి రిక్షాలో ఎక్కారు లలిత, మురళి. "నన్ను మా రోడ్డు మలుపులో వదలి నువ్వెళ్ళూ.గానీ, నాకు భయం!'' అంది లలిత గోముగా.

''దివా కాక బుతా భీతా!'' నవ్వుతున్న మురళి పెదాల్ని సుతారంగా తన చేతి వ్రేళ్ళతో మూసివేస్తూ—''చాల్లే....మగాడివని పించుకున్నావ్!'' అంది లలిత కోపం అభినయిస్తూ....

''ఇంకా నయం....ఆడదాన్ననుకున్నావా ఏమిటి ఇన్నాళ్ళూ?'' లలితను చేతి వ్రేళ్ళను ముద్దెట్టుకొని అడిగాడు మురళి.

''ఊ! ఇందాక పిక్చర్‌కు వెళ్ళేటప్పుడు రిక్షాలో ఒదిగి కూర్చున్న నిన్ను చూస్తే మాత్రం నాకలాగే అనిపించింది సుమా!''

''పెంకిపిల్ల!'' లలిత భుజాల చుట్టూ చేతులువేసి గబుక్కున దగరకు లాక్కున్నాడు మురళి.

''బాబూ! ఇది రిక్షా! ఏమిటిది?'' కృత్రిమపు మందలింపు స్వరమేనని పసికట్టడానికి మురళి కెంతో సేపు పట్టలేదు.

''ఇక్కడ ఆపవోయ్ రిక్షా!''

రిక్షా ఆగింది "మరి నే వెళ్ళిరానా!'' అంది లలిత మురళి చెయ్యి నొక్కుతూ.

''నేనూ తోడు రానా?'' మురళి కొంటెగా అడిగాడు.

''వద్దులే! వీలైతే రేపలా పార్కుకు వెళదాం. వస్తావా?'' అంది లలిత. మత్తుగా చూస్తూ.

''ఊఁ!''

ఇంటికి వచ్చిన మురళికి ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. లలిత స్పర్శ, లలిత ప్రవర్తన తన మతి పోగొడుతున్నాయి. ఏమిటీ బలవత్తర ఆకర్షణ? ఏమిటో తనకూ అంతు పట్టడంలేదు.

''పాపం కాదూ?'' అంది మనస్సు.

''ఎవరికి?'' అనుకున్నాడు.

''నీకే!''

''నా కెందుకూ? ఆడదంత చనువుగా దగ్గరకు వస్తుంటే నేనేం ఋష్యశృంగుణ్ణా? అయినా నే నిప్పుడేమై పోయాననీ?''

ఆలోచిస్తూనే నిద్రపోయాడు మురళి

# 21

మురళి పార్కులో కూర్చుని లలిత కోసం ఎదురు చూస్తున్నాడు. ఎంతకూ లలిత రాలేదు. బహుశా కృష్ణమోహన్ వచ్చి ఉంటాడేమో? ఏమో? అయినా తనిలా మారిపోతున్నాడేమిటి? లలిత కోసం తను నిరీక్షించటమేమిటి?

చిరాకుగా పచారు చేస్తున్న మురళి, మొక్కల మాటునుంచి కిలకిలలు వినిపించి, ఆగిపోయాడు.

"రుక్మిణీ! ఏమిటోయ్ నీ వరస? మరి మీ నాన్నగారూ వాళ్ళకు చెప్పరాదూ?" అంటున్న దో మగకంఠం.

ఉలిక్కిపడ్డాడు మురళి. రుక్మిణి. ఎవరు? రుక్మిణి ప్రేమలో పడిందా? స్నేహితురాలింట్లో వుంటానని చెప్పి, స్నేహితునితో గడుపుతోందా? చెవులు రిక్కించుకుని వింటున్నాడు మురళి.

''అమ్మబాబోయ్! ఇప్పుడప్పుడే మానాన్నకు తెలిస్తే చదువూ, సంధ్యా మాన్పించి నన్ను లాక్కెళతారు!'' అంటోంది రుక్మిణి.

"మరెంత కాలం ఇలా?''ఆతగాడు గోముగా అడుగుతున్నాడు.
''సుదర్శన్! నీకెన్నిమార్లు చెప్పాను? ముందు నాభుజం మీద నీ చెయ్యి తీసెయ్! ఇలా నన్నుఏదో ఓసాకుతో స్పృశించాలని చూస్తే మాత్రం, నీ స్నేహానికో నమస్కారం పెడతాను!'' కటువుగా ధ్వనించింది రుక్మిణి కంఠస్వరం.

"అబ్బబ్బ! ఏం రూల్సురా బాబూ! ప్రేమించుకునే వాళ్ళంతా మడిగట్టుకుని కూర్చుంటున్నారా రుక్మిణీ?'' అంటున్నా డతగాడు.

''అవన్నీ నాకనవసరం. కానీ నా పద్ధతి మాత్రం ఇంతే!''
నిక్కచ్చిగా అంది రుక్మిణి.

"అంటే - నీకు ప్రేమలో విశ్వాసం లేదన్నమాట!''
నిష్ఠూరంగా అన్నాడు సుదర్శన్.

రుక్మిణి కిలకిల నవ్వింది. ''ప్రేమలో విశ్వాసం లేక పోవట మేం? బోలెడంత వుంది! కానీ వివాహమయ్యేంత వరకూ, ప్రేమికులు పరస్పరం కొంత ఎడంగా వుండడం మంచిదని నాభావం. ప్రేమనూ విశ్వసిస్తాను. ప్రేమకంటే ఎక్కువగా మన సంప్రదాయాలను గౌరవిస్తాను. పొద్దుపోతోంది. నే వెళ్ళిచదువుకోవాలి. మరో మూడు నెలలు గిర్రున తిరిగాయంటే చాలు, నా చదువూ, నీ నిరీక్షణా పూర్తవుతాయి! ఈ లోగా మా నాన్నకు తెలిపిందో, లాభం లేదు!''

రుక్మిణి లేచి నిల్చుంది.

''మరి నే వెళ్ళొస్తా!'' సుదర్శన్ నవ్వుతూ వెళ్ళిపోయాడు.

''రుక్మిణీ!" మెల్లిగా పిలిచాడు మురళీ—పార్కు గేటులో నిల్చుని. ''నువ్వా బావా! ఏం ఇక్కడున్నావ్?" ఏలాటి తడబాటూ లేకుండా అడిగింది రుక్మిణి.

''తోచకలే! అతగా డెవరు?''

"ఓహ్! అతడా? చూశావా? 'సుదర్శన్' అని ఒక లెక్చరర్!"

"ఎన్నాళ్ళయింది పరిచయమై? కేవలం శ్రేయోభిలాషియైన ఓ అన్నయ్య అడుగుతున్నా డనుకుని నిజం చెప్పు రుక్కూ!" మెల్లిగా అన్నాడు మురళి.

"ఓ! దాందేముంది? ఇంకొంచెం ముందుగా నన్ను పిలిచి వుంటే, అతగాణ్ణి నీకు పరిచయం చేసి వుండేదాన్నే. సరళ చిన్నాన్న కొడుకు బావ! ఈ మధ్యనే ఇక్కడ లెక్చరర్‌గా చేరాడు. సరళ ఇంట్లోనే మాకు పరిచయమైంది," అంది నిస్సంకోచంగా రుక్మిణి.

మురళి మౌనంగా నడక సాగించాడు.

"బావా!"

"ఏమిటి?"

"ఇప్పుడిప్పుడే ఎవ్వరికీ తెలియనివ్వకు. నా పరీక్షలు కానీ! రిజిష్టర్డు మ్యారేజ్‌తోబాటు అందరికీ అనౌన్స్ చేసేస్తాను!" అంది రుక్మిణి.

"అలాగే కానీ"

చెరో దారి పట్టారు. రుక్మిణిని గురించి తనకే మాత్రం భయమూ, సందేహమూ లేవు. ఆత్మ రక్షణ బాగా తెలిసిన ఆడపిల్ల రుక్మిణి! అవసరమైతే ఎంత సాహసమైనా చేయగల సబల రుక్మిణి!

# 22

ఉదయం లేచింది మొదలు క్రొత్త రకం జీవన విధానాన్ని కళ్ళారా చూస్తోంది రాధ. "అంబా" అంటూ అరిచే లేగ దూడలూ,

గేదెల పాలుతీసి చల్ల చిలికే గృహిణులు, బలిష్ఠమైన శరీరాలతో పొలం పనికి వెళ్ళే రైతులు, రాధకు ప్రతిదీ వింతగానే, తమాషాగానే కనిపిస్తూంది। వారం రోజులు సరదాగా గడచి పోయాయి. రాధచేత ముత్తైదువలకు గుమ్మడిపండ్లను దానమిప్పించింది జగదాంబ.

ఆ రోజు, సాయంత్రం. ఎవరో తెలిసినవాళ్ళు తనకు కబురు పెట్టగా వెళ్ళింది జగదాంబ. తన స్నేహితురాళ్ళను చూసొస్తానని చెప్పి వెళ్ళింది కమల. కోడలికి భాగవతం చదివి వినిపించటానికి ఉపక్రమించాడు గోపాలకృష్ణయ్య. శ్రీ కృష్ణలీలల ఘట్టం చదువుతూ అర్థం వివరిస్తున్నాడు.

రాధ వింటోందే గానీ, ఆలోచన ఇక్కడ లేదామెకు. మురళి దగ్గర్నుంచి ఉత్తరమే రాలేదు. కానీ రుక్మిణి మాత్రం "సాధ్యమైనంత త్వరగా రా. రాధక్కయ్యా! బావ, లలితక్కయ్యల వ్యవహారం నాకేమిటో భయంగా వుంది!" అంటూ వ్రాసింది.

రుక్మిణిని గురించి తనకెంతో సదభిప్రాయం ఏర్పడింది. అందులోనూ ఏ విషయాన్నీ కూలంకషంగా ఆలోచించనిదే రుక్మిణి ఎలాటి నిర్ణయాలూ చెయ్యదు. ఇతరులకు చెప్పదు. అలాటి రుక్మిణి. అలా వ్రాసిందంటే, ఏదో వుండి వుండాలి.

ఆలోచిస్తున్న రాధకేసి చూశాడు గోపాలకృష్ణయ్య. చెంపకు చేరెడు కళ్ళతో, కుందనపు బొమ్మలా వున్న రాధ—ఏదో ఆలో. చిస్తూ, స్వప్నావస్థలో వున్న దేవకన్యలా వుందనిపించిం దాయనకు:

"వింటున్నావా రాధా!" అన్నాడు గోపాలకృష్ణయ్య రాధకేసి చూస్తూ.

"ఊఁ!" తడబడి, తనను తను సంబాళించుకుంది రాధ. మళ్ళీ చదవడం మొదలెట్టాడాయన. మధ్య మధ్య భక్తి పారవశ్యంతో కళ్ళు మూసుకుంటుకున్నాడు.

వారం రోజులుగా చూస్తూ వుంది రాధ - మామగారు తెల్లవారుఝామున లేచి భగవద్ధ్యానం చెయ్యటం, ఆయనగారి జప తపాలూ, ఓ విధమైన పూజ్యభావం ఏర్పడిం దాయనమీద రాధకు. రోజూ నియమం ప్రకారం పూజలూ, స్తోత్రాలూ చేస్తూ, వేద పారాయణ చేసే ఈ ఉన్నతమానవుని తండ్రిగా పొందినందుకు గర్వించక, అస్తమానూ మురళి ఎందుకు ఈసడించుకుంటుంటాడో. ఎంత ఆలోచించినా, అంతు బట్టలే దామెకు.

సంధ్య చీకట్లు బాగా అలముకున్నాయ్.

"కమ లింకా రాలేః" బొంగురు పోయిన కంఠంతో హఠాత్తుగా అడిగాడు గోపాలకృష్ణయ్య.

"ఊఁహూఁః"

ఎందుకో గబగబ లేచి వెళ్ళి వాకిట్లో అటూ ఇటూ చూచి వచ్చాడు గోపాలకృష్ణయ్య.

"పెరటి తలుపు తీసి వున్నట్లుంది. కుక్కలేవేనా జొరబడ తాయేమోః లేచి వెళ్ళి గొళ్ళెం పెట్టిరా రాధాః" అన్నా డాయన.

రాధ లేచి వెళ్ళి గడియపెట్టి వచ్చి కూర్చుంది.

గోపాలకృష్ణయ్యలో ప్రవేశించిన దెయ్యం మెల్లిగా విజృంభించటం ప్రారంభించిందిః మొదటి సారిగా తను, కమలను తీసుకు వెళ్ళినపుడు, రాధను పరకాయించి చూశాడు — పెళ్ళిచేసుకు మురళి రాధను వెంటబెట్టుకు వచ్చినపుడు సరిగా చూళ్ళేదు. "అందమైన పిల్లేః" అందాయన మనస్సు ఆ రోజుః

ఈ రోజు, అనుకోకుండా లభ్యమయిన అవకాశాన్ని వదులుకో గూడదంటోం దాయన మనస్సుః

ఆయన్ని ఆవహించిన దెయ్యం ఒక్కుమ్మడిగా ఒళ్ళు విరుచుకుందిః గబుక్కున లేచి రాధ దగ్గరగా వచ్చాడు. ఆయన ప్రవర్తన

కర్థం తెలియని రాధ, తను వారికి అడ్డుగా కూర్చుని వుందేమోనన్న శంకతో, లేచి నిల్చుని కాస్త పక్కకు తప్పుకుంది.

చప్పున ఆమె చెయ్యి పట్టుకున్నాడు గోపాలకృష్ణయ్య.

ఊహించని ఈ పరిణామానికి నివ్వెర పోయింది రాధ! క్షణ కాలం తత్తరపాటుతో, భయంతో ఆపాదమస్తకం కంపించటం మొదలెట్టింది.

"అలా భయపడతా వెందుకూ? నేనేం పరాయి వాణ్ణా?" స్వరం తగ్గించి మరింత దగ్గరగా వస్తూ అన్నాడు గోపాలకృష్ణయ్య.

ఒక్కసారిగా చెయ్యి విదిలించి లాక్కుంది రాధ. 'ఛీ....' అని మాత్రం అనగల్గిం దామె.

"నే నొకటీ, మురళి ఒకటీనా?" అన్నాడు ఇకిలిస్తూ— వెగటుగా. రాధ బుసలు కొట్టింది. "పెద్దవారని గౌరవభావం ఏర్ప రచుకున్నాను. వావి వరుసలూ, నీతినియమాలూ కూడా విసర్జించిన మూర్ఖు లనుకోలేదు!" అంది ఆవేశంగా.

"ప్చ్! అనుభవానికి పెద్ద, చిన్న వయో భేదమేమిటి? ఆ శ్రీకృష్ణపరమాత్మకే లేవు నీతి నియమాలు. ఇక మానవమాత్రులం మనకేమిటి!" అంటూ గోపాలకృష్ణయ్య జాగ్రత్ సుషుప్త్యావస్థల్లోని మనిషిలా మత్తుగా మాట్లాడుతున్నాడు!

రాధ నివ్వెరపోయింది. ఈయనా తన మామగారు! మురళి తండ్రి ఇంతటి నీచ మనస్తత్వం గల పెద్ద మనిషా? కేవలం పరిసర వ్యక్తుల్ని వంచించటానికేనా ఇలా భగవద్ధ్యానం, స్తోత్ర పాఠాలు చేస్తున్నాడు?

"ఇక వావి వరసలంటావా? వివరంగా చెబుతా విను! అసలు మనలో వరసల కర్థమంటూ ఒకటి ఏడ్చిందేమో చూడు! ఒక ఆడపిల్లను మేనమామకుగానీ, మేనమామ కొడుకుకుగానీ ఇచ్చి

పెళ్ళి చెయ్యొచ్చు! అంటే, ఆ ఇద్దరకూ ఆమెకు భర్త కాగల అర్హతవుందన్న మాట! అలాటప్పుడు నీకు నేనైనా, మురళి అయినా...." దగ్గరగా వస్తున్న గోపాలకృష్ణయ్యను బలంగా ఒక్క తోపుతోసి, గుమ్మంకేసి పరుగెత్తింది రాధ అసహ్యంతో, కోపంతో, అవమానంతో ఆమె కళ్ళు జలపాతాలయ్యాయి.

గుమ్మంలో ఎదురుగా నిల్చుని వున్న జగదాంబనూ, కమలనూ చూచి, ఆమె దుఃఖం మరింతగా విజృంభించింది.

క్రిందపడి లేచి దులుపుకుంటూ తలెత్తి చూచిన గోపాల కృష్ణయ్య గది గుమ్మంలో భార్యనూ, కూతురుని చూచి బిక్కచచ్చి పోయాడు ఇద్దరి కళ్ళల్లోనూ అగ్నిశిఖలు ఎగసిపడుతున్నాయి!



"రాధా! ఇవి చేతులు కావనుకో! ఆయనగారి తరఫున నేను పాదాలు వేడుకుంటున్నాను తల్లీ! ఈ విషయాలేమీ మురళికి తెలియనివ్వకు. తెలిస్తే తండ్రిమీద అసహ్యంతో వాడిక నా కళ్ళకు కూడా కనిపించడు!"

ఒకవేపు భర్త చేసిన మూర్ఖపు పనికి అవమానమూ, మరోవేపు-కొడుకుకు తెలిస్తే ఇక శాశ్వతంగా అతడు తమకు దూరమైపోతాడేమోనన్న ఆవేదనా. పదిరోజులు దగ్గరుంచుకుందామని ముచ్చటపడి కోడలిని పిలిపించుకుని ఇలా సాగనంపవలసి వచ్చినందుకు బాధా సమ్మిళితమైన జగదాంబ కళ్ళల్లో కన్నీళ్ళు తళతళ మెరుస్తున్నాయి.

"వారికీ సంగతులేవీ తెలియనివ్వను. మీరు బాధ పడకండి! పదిరోజులయ్యాక కమలను తప్పకుండా పంపండి. చదువుకుని పరీక్షలు వ్రాస్తుంది. ఈలోగా ఏదైనా సంబంధం కుదిరితే, కమలకు స్థిరపరుస్తాము!" అంది రాధ బండెక్కుతూ.

"వదినా! నాన్న తరపున నేనూ క్షమాపణ వేడుకుంటున్నాను," అంది కమల వచ్చే కన్నీళ్ళాపుకుంటూ.

"పిచ్చిపిల్లా! మరేం ఫర్వాలేదులే! నే వెళ్ళొస్తా!" బండి కదిలింది. వెళ్తున్న బండిని చూస్తూ ఆలోచనలో పడింది కమల. తనలో తిరిగి జీవంపోశారు మురళి అన్నయ్య, రాధ వదిన, ట్యుటోరియల్ కాలేజిలో లెక్చరర్ ప్రసాద్....

సీతాకోకచిలకల్లాటి అందమైన భావాలేవో ఆమెను చుట్టుముటాయి. అతగాడు అస్తమానూ తనవేపే చూస్తుంటే, తనకేమిటో సిగ్గుగా వుండేది. ఓరోజు అతగాడే అడిగాడు.

"కమలా! నీలాటి సుకుమారికీ, అమాయకురాలికీ దేవుడు ఇలాటి అన్యాయం ఎందుకు చేశాడో అర్థంగావటంలేదు! నీ నుదుటి మీద వెలితిగా వున్నచోటు నేను భర్తీ చేస్తాను. నిన్ను పెళ్ళాడతాను.. "

తను హడిలిపోయింది! తనలోనూ ఊహలున్నాయి. కానీ అవి ఎలా వెల్లడించుకోగలదు? పైగా అన్నయ్య, వదిన, ఇందరు పెద్దలుండగా, తనేం సమాధానం చెప్పగలదు? కమల మనసులోని భావాలు పసిగట్టాడు ప్రసాద్.

"నీ మనస్సు నాకు తెలుసు కమలా! భయపడ్తున్నావు కదూ? నా స్నేహితుడే మీ అన్నయ్య మురళి. అతగాణ్ణే అడుగుతాను" అన్నాడు!

తన మీదనుంచి కొండంత బరువు దింపినట్లయింది. ఈ మారు వెళ్ళి పరీక్షలు వ్రాయగానే, ప్రసాద్ వచ్చి, మురళి అన్నయ్యను

అడుగుతాడు. మురళిఅన్నయ్య, రాధ వదిన సంతోషంగా అంగీక రిసారు.

తనూ అందరిలా మధురమైన జీవితాన్ని అనుభవించ బోతోంది. "ముంగిలా అలా కూర్చోకపోతే వెళ్ళి ఆ కొంగజపం, దొంగజపం ముగించరాదూ?" తల్లి, తండ్రిని చూపి, ఈసడించు కుంటూ అరుస్తున్న అరుపు విని ఊహాలోకంలోంచి వాస్తవ ప్రపం చంలోకి వచ్చింది కమల.

# 24

హుషారుగా కారు నడుపుకుంటూ వస్తున్నాడు కృష్ణమోహన్.

అతగాడి హృదయంలో తియ్యని భావాలెన్నో చెలరేగు తున్నాయి బొంబాయినుంచి తను లలితకోసం ఎన్నో రకాల బహు మానాలు పట్టుకు వస్తున్నాడు.

వెళ్ళేసరికి మేడమీదుంటుంది లలిత. బహుశా ఈరోజు తను రాడనీ, రేపు వస్తాడనీ నిస్పృహగా సోఫాలో వెనక్కువాలి అర మోడ్పుకన్నులతో, ఏదో ఆలోచించుకుంటూంటుంది! చప్పుడు చెయ్యకుండా వెళ్ళి ఆమె కళ్ళు ముయ్యాలి. ఉలిక్కిపడుతుంది. నవ్వుతూ ఆశ్చర్యంగా తన హృదయంమీద వాలిపోతుంది. "అరె! మీరీరోజే వచ్చారే! రేపుగానీ రారనుకుని ఎంతగ తోచక బాధ పడ్డున్నానో తెలుసా?" అంటుంది గోముగా! "ఇప్పట్లో ఇంక ప్రయాణాలేం లేవు లలితా!" అంటూ తను అనునయిస్తాడు.

తను తెచ్చిన బహూమతులూ-చీరెలూ, బ్లౌజ్‌పీసెస్. అన్నీ చూచి లలిత ఆనందంతో ఉక్కిరిబిక్కిరౌతుంది.

"ఎంచక్కా వున్నాయివన్నీ! నాకిష్టమైన రంగులు ఎంత బాగా సెలెక్టు చేసుకువచ్చారు?" అంటూ మురిసిపోతుంది. తను చేసిన పని, తెచ్చిన వస్తువులు భార్య మెచ్చుకోవటంకంటె భర్తకి కావలసిన బహూమతి ఏముంది? అతగాడు కోరేదీ. అంతకంటే అదృష్టం మరేముందీ?

కారు గేటు అవతలే ఆపి, మెల్లిగా బంగళాలోకి వచ్చాడు కృష్ణమోహన్. నౌకరు వరండాలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. యజమానిని చూచి గబుక్కున లేచి నిల్చుని, వినయంగా కారు దగ్గరకు పరుగెత్తాడు సామాన్లు తీసుకురావటానికి.

మెల్లిగా మేడమెట్లెక్కి వచ్చిన కృష్ణమోహన్ ఒక్కసారిగా నిర్విణ్ణుడైనాడు. సోఫాలో కూర్చుని మురళి వెనక్కు వాలి వున్నాడు. సోఫా చేతిమీద కూర్చొని లలిత కిలకిల నవ్వుతోంది. పారవశ్యంలో వున్న వాళ్ళిద్దరికీ కృష్ణమోహన్ రాక తెలియకపోవడంలో ఆశ్చర్యం లేదు!

"లలితా!" అని ఏదో చెప్పబోతూ తలెత్తి చూచిన మురళి గతుక్కుమన్నాడు. గుమ్మంలో కృష్ణమోహన్ నిల్చుని తమవేపే చూస్తున్నాడు. ఒక్కసారిగా మురళి గుండె ఝల్లుమంది. సరిగ్గా తనిక్కడికి వచ్చి పదిహేను నిమిషాలే అయింది!

లలిత కూడా వెనుదిరిగి చూచింది. క్షణంలో కంగారు లోలోపలే అణుచుకుంది. వెంటనే చిరునవ్వుతో "మీరా! ఎంతసేపైంది వచ్చి? అలా గుమ్మంలో నిల్చుండిపోయారేం? లోపలికి రాండి!" అంది అలాగే కూర్చుని.

ఎందుకో భగభగ మండుతున్నట్లుంది కృష్ణమోహన్ హృదయం. కానీ, లలిత ముఖంలో ఏ మాటి కంగారూ లేని చిరునవ్వు

చూచి, తను అనవసరంగా భయపడుతున్నాడేమో ననుకున్నాడు అంతలోనే.

చనువుగా కృష్ణమోహన్ దగ్గరకు వచ్చి ఆతగాడి కోటువిప్పి, స్టాండ్ మీద వేసింది. "చూశారా, బావ! అతగాడికి రెండు రోజులుగా జ్వరం. వచ్చి మంచినీళ్ళు ముట్టుకోలేదు. ఊళ్ళోనే మనం వున్నాం గదా! కబురేనా చేయలేదు! ఈ రోజు ఉదయం, తనే పథ్యం వండుకున్నాడట! ఈ సంగతి తెలిసే, సాయంత్రం వెళ్ళి, బలవంతంగా లాక్కు వచ్చా నిక్కడికి. ఇదేం పెంకె ఘటమండీ!"

మురళి నిర్ఘాంత పోయాడు లలిత వాగ్ధోరణికి.

కృష్ణమోహన్ మనస్సెందుకో తేలికైంది. "అదేమిటండీ! మురళీ! మేమేం పరాయివాళ్ళ మనుకున్నారా?" అన్నాడు వచ్చి మురళి పక్కన సోఫాలో వచ్చి కూర్చుంటూ!

"అ! ఫర్వా లేదు లెండి!" ఏదో అనాలి కాబట్టి అనేశాడు మురళి. మరో అర గంటలో లలిత పథ్యంగా తెప్పించి పెట్టిన ఆపిల్ ముక్కలు, బత్తాయి తొనలు తిని, పాలు త్రాగి తిన్నగా బయట పడ్డాడు మురళి,

# 25

బయట పడ్డాడే గానీ, ఏదో వూపిరి సలపనట్లు బాధ పడ్డాడు. ఏమిటో ఆందోళన తనలోంచి బయల్దేరింది. అది తనను నిలవ నివ్వటం లేదు. లలిత వేపు హృదయం పరుగులు తీస్తోంది! బహుశా 'బలవాన్ ఇంద్రియ గ్రామో....' అనే శ్లోకార్థంలోని నిజం ఇలాటిదే అయ్యుండవచ్చు! తనను నిగ్రహించుకోలేక పోతున్నాడు.

'లలితను చూడాలి. లలితతో మాట్లాడాలి. లలితను దగ్గరకు లాక్కోవాలి.' ఇవే ఆలోచనలు అస్తమానూ అతగాణ్ణి వేధిస్తున్నాయి. బహుశా రాధ దగ్గర లేకపోవటం కూడా తన మనస్సిలా మారటానికి కారణం అయ్యుండవచ్చు.

పిల్చినట్లు లలిత సాయంత్రం వచ్చింది. ఏ బలవత్తర శక్తి ప్రేరణతోనో, తను కూడా లలితతో బయల్దేరి వచ్చేశాడు! త్రోవలో ఎదురైన రుక్మిణి విడ్డూరంగా చూచింది తన ఇద్దరివేపూ. దోషిలా తల వంచుకున్నాడే గానీ, తిరిగి రాలేక పోయాడు.

మొన్ననోసారి రుక్మిణి రూంలో లలిత, రుక్మిణుల మధ్య జరిగిన సంభాషణ తను విన్నాడు.

"రుక్కూ, జాగ్రత్త! బావ అసలే అందగాడు అందునా ఒంటరిగా చిక్కాడు. మతి పోగొట్టుకోనేవ్!" అంది లలిత హాస్యంగా.

రుక్మిణి ఫెళ్ళున చెంప పగల గొట్టినట్లు సమాధానంచెప్పింది.

"నేనంత నిగ్రహం లేని దాన్ని, నీతి మాలిన దాన్నీ కాదు లలితక్కయ్యా! అదీ గాక ఒక వేళ నా మతి చెదిరినా, నేను కన్యను.... కానీ నువ్వు జాగ్రత్త! పెళ్ళయిన దానవు. అందునా కృష్ణమోహన్‌లాంటి మంచి బావకు భార్యవు. నీ మతి చెదిరిందో, నీకిక పుట్టగతుల్లేవు!"

లలిత నవ్వింది. కానీ ఆ నవ్వు నాగుబాము బుసలా విన్పించింది. "పర్వాలేదే! మాటలు మా బాగా నేర్చుకున్నావ్!" అంది చేసేది లేక.

"మాట్లాడటం, ఎదుటివారి మాటలకూ, చేష్టలకూ అర్థం ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నాను."

"సర్లే! నీతో కబుర్లు పెట్టుకు కూర్చుంటే, అవతల మీ బావగారు నా కోసం చూస్తుంటారో ఏమో!"

రుక్మిణి పకపక నవ్వింది. "అబ్బో! ఏం పతిభక్తి! బావ గారు ఊళ్ళో లేరు కాబట్టా అంతగా భయపడ్తున్నావ్?"

లలిత దెబ్బ తింది కాబోలు. "నీకెలా తెల్సూ?" అంది నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"ఎందుకు తెలీదూ? ఆయనగారు వూళ్ళో వుంటే, నువ్విలా రిక్షాలో వస్తావా? కారులో కాలు కిందపెట్టనిస్తాడా కృష్ణమోహన్ బావ నిన్ను?" అలా నిలవేసి అడుగుతున్న రుక్మిణికి మరి సమాధానం చెప్పలేక- "అబ్బబ్బ! ఏం అల్లరి పిల్లవే!" అంటూ బయటి కొచ్చేసింది లలిత.

ఆ సంభాషణతో ఒకటి మాత్రం తనకు స్పష్టంగా బోధ పడింది - రుక్మిణి తననూ, తన ఆలోచనల్నీ పసిగడ్తోంది అని.

"ఏం? తెలుసుకోనీ! ఏం చేస్తుందేవిఁటి? ఆవిడా ఓ ప్రియుణ్ణి ఎన్నుకుందిగా! అసలు రుక్మిణెవరు, తనని కంట్రోల్ చేయటానికి? రుక్మిణికి తనెందుకు భయపడాలి?" అనుకుంటూ నడిచాడు మురళి.

"మురళి బావా! పాపం! క్షణం తీరికలేదు, దమ్మిడీ ఆదాయంలేదు!" ఎదురుగా వస్తున్న రుక్మిణి మాటలకు త్రుళ్ళిపడ్డాడు మురళి.

"ఏమిటలా అంటున్నావ్?" అన్నాడు చిరాగ్గా.

"మరింకెలా అనను? నువ్వూ, లలితక్కయ్యా అలా వెళ్ళారో లేదో, ఇలా వచ్చేశాడు కృష్ణమోహన్ బావ!" అంది పకపక నవ్వుతూ.

"నీకెలా తెల్సు?"

"ఈదారంటేగా కారు వెళ్ళింది? సర్లే! నా టెక్స్టుబుక్ ఒకటి కావల్సి రూంకు వెడుతున్నాను. తీసుకు వెళ్ళిపోతాను."

"ఎక్కడికి? సుదర్శన్‌తో షికారుకా?" వెటకారంగా అన్నాడు మురళి, తనను రుక్మిణి గేలిచేసిందన్న అక్కసుకొద్దీ

"ఊఁహూఁ, చదువుకోవటానికి, ప్రతి ఆదివారం సాయంత్రం ఐదున్నరనుంచి ఆరున్నరవరకూ మాత్రమే సుదర్శన్‌కు నాతో మాట్లాడటానికి అవకాశం ఇస్తాను. అంతకుమించి, ఎప్పుడూ ఏలాటి చనువూ అతగాడికివ్వను. మాకు పెళ్ళయేవరకూ ఇదే షరతు, అది నీకూ తెలుసు!" అంది మురళివేపు సూటిగా చూస్తూ. మురళికి తెలుసు- రుక్మిణి ఎంత గడుసుపిల్లో, అంతకట్టుదిట్టమైన నిగ్రహమున్న అమ్మాయి!

మరేం మాట్లాడకుండా నడక సాగించాడు. రాత్రి పడుకున్నాడేగాని. నిద్రపట్టలేదు. లలిత చుట్టూరానే ఆలోచనలు పరుగెడుతున్నాయ్!

# 26

ముభావంగా పడుకుని వున్న కృష్ణమోహన్ వేపు కొంటెగా చూస్తూ అడిగింది లలిత. "అదేమిటి? పది లంకణాలు చేసినవారిలా- ఇంకా మాట్లాడితే ఋష్యశృంగునిలా, మౌనంగా పడుకున్నారు?" అంది.

కృష్ణమోహన్ రాని నవ్వునవ్వి వూరుకున్నాడు.

"ఈసారి నాకేం బహుమతులు తీసుకురాలే?" అంది భర్తను మంచి 'మూడ్'లోకి తేవాలనే వుద్దేశంతో.

"ఎందుకు తేలేదూ? ఆ సూట్‌కేసంతా నీ సామాన్లే."

లలిత గబగబ వెళ్లి సూట్‌కేస్ తెరిచింది, రంగురంగుల చీరెలు. జాకెట్లు, గాజుసామాన్లు. దంతపు బొమ్మలు ..."ఎంచక్కా వున్నాయ్

కానీ ఆ మెచ్చుకోలు ఏమిటో చప్పగా వున్నట్లు తోచింది కృష్ణమోహన్‌కు. అతగాడికి ఉపశాంతిగానీ, హాయిగానీ ఏమాత్రం కలగలేదు

లలిత తెలివితక్కువదేంగాదు భర్తలో ఈ మార్పుకు కారణం, సాయంత్రం బావతో తను అలా చనువుగా వున్నపుడు చూడడమే అన్న సంగతి ఆమెకు తెలుసు.

"ఇంతగా మీరు ఉడికిపోవటానికి కారణం నాకు తెలీదను కోకండి!" హఠాత్తుగా కోపంగా మారింది లలిత.

చిరాగ్గా చూశాడు కృష్ణమోహన్.

"సాయంత్రం మాబావ వచ్చాడనేగా? హూ! ఏం మగాళ్ళు! ఈర్ష్య, అసూయ, ద్వేషం, అనుమానం సమపాళ్ళలో రంగరించిన రక్తం ప్రవహిస్తూంటుంది కాబోలు మీ శరీరాల్లో. లేకుంటే, మా బావను చూడగానే అంతగా మారిపోవాలా? "ఏం? అందులో తప్పుపనేముందని మీరింతగా బాధపడు తున్నారు? ఒక్క తల్లి పిల్లల్లా మెలిగాం బావా, నేనూ. ఛీ! కాస్తంతయినా సంస్కారం, విశాల దృక్పథం వుంటేగా!" కోపంగా అవతలగదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకుంది లలిత.

మరో సమయంలో అయితే, బహుశా కృష్ణమోహన్ లలిత వెనకానే వెళ్ళి, ఆమెను బ్రతిమాలి, ప్రసన్నురాలిని చేసుకునేందుకు ప్రయత్నించే వాడేమో. కానీ ఈరోజు మాత్రం అతగాడిలో అంత సహనంలేదు.

లలిత చెబుతుంటే, ఎలాగో సహించి వినగలిగాడేగాని, ఆమె చెబుతున్న మాటలో వెనకటిలా విశ్వాసం వుంచలేకపోయాడు.

మురళికి రెండురోజులుగా జ్వరం తగుల్తోంది. ఈరోజు సాయంత్రం తను చూచిన సమయంలో, అతగాడిలో ఆ జ్వరం తాలూకు నీరసం అణుమాత్రమయినా గోచరించలేదు తనకు. లలిత, అతగాడూ ఒక తల్లిబిడ్డల్లా మెలిగివుంటే వుండవచ్చు. కానీ ఒక తల్లిపిల్లలయిన అన్నా చెల్లెళ్ళుకూడా, ఓ వయసు వచ్చాక, ఒకరి యందు మరొకరు అతి చనువు ప్రదర్శించుకోరు. ఓ పరిమితమైన చనువే వుంటుంది.

కానీ సాయంత్రం లలిత కూర్చున్న తీరు, అతగాడు నవ్వుతూ కళ్ళు చికిలించిన తీరూ చూస్తే ఇద్దరు ప్రేమికులు వేళాకోళాలాడుకుంటున్నట్లుందేగాని, పవిత్రభావం గల సోదరులు ప్రవర్తించినట్లుగా లేదు. తనను చూడగానే, "లలితా!" అంటూ కళ్ళు మెరుస్తుండగా ఏదో చెప్పబోయిన మురళి, షాక్ తిన్నట్లు ఆగిపోయాడు.

మురళి తప్పేముంది? స్త్రీ అతి చనువుగా ప్రవర్తిస్తే, అవకాశం అంది పుచ్చుకోని పురుషుడుంటాడా?

లలితకు తనేం తక్కువ చేస్తున్నాడు? కోరిన నగలు, కోరిన వస్తువులు, కోరిన సరదాలూ, కోరిన స్వాతంత్ర్యం- అన్నీ అరమర లేకుండా, ఆమెను హృదయాధిదేవతలా ఆరాధిస్తూ మరీ ఇస్తున్నాడు తను. కానీ లలిత మారిపోతోందా? పెడత్రోవ పడ్తోందా? లేక ఇది కేవలం తను అనవసరంగా కల్పించుకుంటున్న అనుమానపు తెరలా? ఏమో తలబ్రద్దలై పోతూంటే, స్లీపింగ్ టాబ్లెట్ ఒకటి వేసుకుని, తల చేతులతో అదిమిపట్టుకుని కళ్ళు మూసుకున్నాడు కృష్ణమోహన్.

# 27

"రా! పిన్నీ! నీ కోసమే ఎదురు చూస్తున్నా!" సీతమ్మకు ఎదురు వెళ్ళి సాదరంగా ఆహ్వానించింది లలిత.

"ఆ వస్తున్నానే అమ్మాయ్! పొద్దున్ననగా నువ్వు కబురు పెట్టావా? రావటానికి తీరికైతేగా!" లావుపాటి శరీరాన్ని సోఫాలో పడేసింది సీతమ్మ.

సీతమ్మను గురించి సంక్షిప్తంగా చెప్పాలంటే, సుమారో కావ్యమంత కథ అయినా చాలదు.

చిన్నతనంలోనే భర్త చనిపోయిన బాలవితంతువు సీతమ్మ. వీరేశలింగము పంతులుగారు స్త్రీ పునర్వివాహాన్ని ప్రవేశ పెట్టారని ఆమెకు తెలుసు. అయితే సమాజంలో తాను అతి పవిత్రురాలిననే పేరు పొందాలనే కీర్తి కండూతివల్ల నైతేనేమి, 'ఒక మగవెధవకు నే బానిసలా (భార్యలా) బ్రతకడ మేమిటి?' అనే అహంభావం వల్లనైతేనేమి, సీతమ్మ తన శరీరాన్నీ, శేష జీవితాన్నీ కేవలం పరోపకారానికే అంకితం చేసేసింది.

పచ్చగా సాగుతున్న కాపురాల్లో, ఇట్టే నిప్పులు చల్లటం సీతమ్మకు వెన్నతో పెట్టిన విద్య. కానైతే, బుగ్గి అయిన కాపురం లోని వా రెవరూ- తమ కాపురం అగ్గిపాలు కావటానికి సీతమ్మే కారకురాలని తెలుసుకోలేనంతటి చాతుర్యంతో కథ నడపగల సమర్థురాలు ఆవిడ! కాబట్టే, ఎన్ని కాపురాలు ధ్వంసం చేసినా, సీతమ్మ అందరికీ ఉపకారిగా, సలహాదారుగానే చలామణి అవుతోంది.

సీతమ్మకు పుట్టినింటి ఆస్తిగానీ, మెట్టినింటి ఆస్తిగానీ చిల్లి గవ్వ లేదు. అయినా కేవలం తన బుద్ధి బలంతో సంపాదించిన డబ్బుతో, పెద్ద డాబా ఇల్లు కట్టించి, బాడుగల కిచ్చి. ఆ బాడుగల డబ్బుతో, నిశ్చింతగా కాలం వెళ్ళ బుచ్చుతోంది.

సీతమ్మ పైకి కనిపించే స్వభావమూ, స్వరూపమూ అది. కానీ ఆవిడ లోపలున్న సీతమ్మది మరో స్వరూపమూ, స్వభావమూ. సాధారణంగా, బాగా పేరు ప్రతిష్ఠలు గల కుటుంబాలలోని గృహిణులు కొందరు తమ పరువు చెడకుండా, తమ పేరు బయటకు రాకుండా, తమ ప్రియుళ్ళను కలుసుకోవాలంటే సీతమ్మను ఆశ్ర

యిస్తారు. అంతే. అటువేపూ. ఇటువేపూ ఓ పాతికో, ఏభై రూపాయలో పుచ్చుకుని, సీతమ్మ మహా చాక చక్యంతో ఆ ఏర్పాట్లన్నీ చేస్తుంది. తన ఇంటి పక్కనున్న హోటల్ యజమానితో కాంట్రాక్టు కుదుర్చుకుంది. ఆ హోటల్ మేడ మీద పదో నెంబరు గది—కేవలం సీతమ్మగారి ఆధ్వర్యవంలో కలుసుకునే గౌరవనీయులైన ప్రేయసీ ప్రియులకు కేటాయించబడింది.

ఈ సంగతులన్నీ లలితకు తెలుసు. అందుకే లలిత, ఆపద్బాంధవిలాటి ఆవిడను పిలిచింది.

"ఇంతకూ ఏం పని మీద పిలిపించావో చెప్పావు కాదు.... మీవారు వూళ్ళో లేరన్లే వుంది?" అంది పరకాయించి చూస్తూ.

"ఊఁ! ఆయనగారు మద్రాస్ వెళ్ళారులే! బహుశా నాలుగైదు రోజులకు గానీ రారు....ఇదుగో పిన్నీ! ఈ రెండు వందలూ నీ దగ్గరుంచుకో...." లలిత రెండు వందల రూపాయల నోట్లు సీతమ్మ చేతిలో వుంచింది.

ఒక్కసారిగా సీతమ్మ కళ్ళు మిలమిల లాడాయి. ఇంత పెద్ద మొత్తం ఒక్క సారిగా ఎవరూ ఇవ్వలేదు తనకు.

"ఏమిటే అమ్మాయ్?" అంది ఆశ్చర్యమూ, వినయమూ జోడించి. "నే చెప్పే పని నువ్వు తప్ప మరొకళ్ళు చెయ్యలేరు పిన్నీ! సక్రమంగా చేస్తివో మరో రెండు నోట్లు కూడా నీవే" అత్యాశతో సీతమ్మ కళ్ళు మెరిసిపోయాయి.

"చెప్పు! నా దగ్గర దాపరిక మెందుకు? నీవు కోరే అబ్బాయి ఏ వీధిలో వున్నాడు? పేరేమిటి? ఎలా వుంటాడు?" అంది సీతమ్మ ఆత్రంగా.

లలిత పకపక నవ్వింది—"పిన్నీ! నాకోసం కాదు... మరొకళ్ళకోసం ఇది!" అంది నవ్వాపుకుంటూ.

"ఆఁ!"

"మీ వీధిలోనే లెక్చరర్ మురళి అని వున్నాడు నీకు తెల్సుగా?"

"సన్నగా: తెల్లగా, పొడుగ్గా వుంటాడు.... అతగాడేనా?"

"ఊఁ: అతగాడి భార్య రాధ తెలుసుగా?"

"ఊఁ."

"ఆవిడకు పిల్లలమీద వల్లమాలిన మమకారం. ఆ సాకుతో ఆవిడను పక్క మార్గానికి లాగాలి!" లలిత సూటిగా సీతమ్మ వేపు చూస్తూ అంది.

సీతమ్మ ఐదు నిమిషాలు ఆలోచించింది—"అంటే, నీ ఉద్దేశం ప్రకారం ఆవిడ ఇష్టాఇష్టాలతో పనిలేకుండా, ఏలాగో ఓలా బురదలోకి లాగా లంటావ్.... అవునా?"

"ఆ! సరిగ్గా అదే! నీకు తెలిసినవారిలో ఎవరినైనా వినియోగించుకో. మొత్తానికి ఓ సారి ఆవిడను నాశనం చేశావంటే చాలు.... అదయినా నేను తేదీ చెప్పి పంపిస్తాను. ఆ రోజు నేను, మురళి అక్కడికి వచ్చేసరికి రాధ మరొకరి చేతుల్లో వుండాలి.... సరా?"

సీతమ్మ గలగల నవ్వింది. దుర్గంధ భూయిష్ఠమైన మురుగు కాలవ వర్షాకాలంలో పొంగి ప్రవహిస్తుంటే వినిపించే చప్పుడులా వుందా నవ్వు.

"ఇంతగా చెప్పాలా, నీ కెందుకు? నే చేసి చూపిస్తాగా?" అంది నోట్లు రొండిలో దోపుకుంటూ లేచి.

"పిన్నీ! రెండో కంటి వాళ్ళకు తెలియ నివ్వకూడదు.... మిగతా రెండు వందలూ పని పూర్తి కాగానే ఇచ్చేస్తాను."

సీతమ్మ నవ్వింది. "ఏ సంగతి నాకు తెలీదూ? డబ్బు ఎక్కడికి పోతుంది? ముందు పని కానీ..." అనేసి వెళ్ళి పోయింది.

హాయిగా నిట్టూర్చింది లలిత. తను వేసుకున్న పథకమే సరిగ్గా జరిగితే- మురళి, రాధ విడిపోతారు. మురళి ఇప్పటికే తన ఆకర్షణకు లోనయ్యాడు. ఇక రాధ మీద ద్వేషం పుట్టగానే, మురళి తన చుట్టూరానే తిరుగుతాడు. అంతే, అలా అతగాణ్ణి తన చుట్టూరా పురుగులా తిప్పుకోవాలి. అతగాడు ఏడుస్తుంటే, తను మనసారా నవ్వాలి! తన ప్రేమ కోసం అతగాడు ప్రాకులాడుతుంటే, తను తిరస్కరించి ఆనందించాలి. అలా ఎంత సేపో ఆలోచిస్తూ వుండిపోయింది లలిత.

# 28

ఎదుటివారి చెంప మీద ఎంత బలంగా దెబ్బకొట్టదల్చుకుంటే, అంతగా తన చెయ్యి నొప్పెడుతుందనే సంగతి చాలా మందికి తెలియదు! సరిగ్గా అల్లాగే అయింది లలిత పరిస్థితి.

చాలా సేపు అలా ఆలోచిస్తూ కూర్చుని, కూర్చుని, హఠాత్తుగా ఏదో నిర్ణయించుకుని, గబగబ ముస్తాబై, నౌకరుతో "షాపింగ్‌కు వెడుతున్నా. ఇల్లు జాగ్రత్తగా చూస్తుండు" అని చెప్పి బయల్దేరింది.

పుస్తకాలు తీసుకుని సరళ ఇంటికి వెళ్తున్న రుక్మిణి దూరాన్నుంచే లలితను పోల్చుకుంది. అసహ్యంతో, కోపంతో ఆ అమ్మాయి హృదయం భగ్గుమంది. 'మురళి బావ ఎంతగా దిగజారిపోయాడు! రాధక్కయ్యకెంత ద్రోహం తల పెట్టాడు! ఈ లలిత, ఇదీ ఒక ఆడదేనా? కృష్ణమోహన్‌లాటి అందగాడూ, సంస్కారీ, ధనవంతుడూ అయిన ఉన్నత వ్యక్తి భరగా లభించి కూడా, మురళి

బావను తనంత తానుగా రెచ్చగొట్టోంది. మురళి, రాధక్కయ్యల జీవితంలో కంటకంలా ప్రవేశించింది. హా!! ఏమైనా గానీ, ఈ రోజు మురళిని, లలితను తను కావాలని డిస్టర్బ్ చేయాలి....' అనుకుని త్వరత్వరగా ఇంటికేసి నడిచింది రుక్మిణి.

రిక్షాలో వెళ్తున్న లలిత ఓ విధంగా గ్రుడ్డివానిలా అయి పోయింది. గబగబ రిక్షా దిగి ఇంట్లోకి వెళ్ళింది. మురళి నవ్వుతూ ఆహ్వానించాడు.

"మరీ నల్లపూసనై పోయావేం?" అంది నవ్వుతూ అత గాడికి దగ్గరగా ఓ కుర్చీ లాక్కుని కూర్చుంటూ.

"ఏం చెయ్యను? ఆ రోజు మీ శ్రీవారి చూపు ఎలా తగి లిందో తెలుసా? శక్తి వుంటే నన్ను భస్మం చేసే వాడేమో కృష్ణ మోహన్!" అన్నాడు నవ్వుతూ, లలిత భుజం చుట్టూ చేతులు వేస్తూ.

"ఓహ్! ఆయన గారేం అనుకోలేదులే!" అంది తేలిగ్గా.

"అమోఘంగా అబద్ధాలాడటం ఎక్కడ నేర్చుకున్నావు!"

"నీ దగ్గరే!"

ఇద్దరి చిలిపి నవ్వులూ రుక్మిణికి కర్ణకఠోరంగా విన్పించాయి.

అడుగు ముందుకు వేయబోయిన రుక్మిణి, ఆశ్చర్యంతో, ఆనందంతో వుక్కిరి బిక్కిరై పోయింది. రాధ రిక్షాలోంచి దిగు తోంది. గబగబ రిక్షా దగ్గరకు పరుగెత్తింది—"అక్కయ్యా, రాధక్కయ్యా! ఇంట్లో మురళి బావ, లలితక్కయ్యల నాటకం రస పట్టులో వుంది" అంది చెవిలో. క్షణకాలం రుక్మిణివేపు వాత్స ల్యంగా చూచి 'ఉష్! అరవకు!' అన్నట్లు సైగజేసి, వరండావేపు నడిచింది రాధ.

తలుపు తీసుకుని లోపలికి వచ్చిన రాధను చూచి దిగ్భ్రాంతి చెందాడు మురళి. పొదివి పట్టుకుని వున్న లలితను, గబుక్కున వదిలేశాడు.

'రాధా!' అన్నాడెలాగో.

'ఊఁ! నేనే "అంది రాధ చిరునవ్వుతో. 'గుర్తుపట్టే స్థితిలో వున్నారా? అనేభావం ద్యోతకమైంది ఆ జవాబులో.

లలిత చివుక్కున వెనుదిరిగి చూచింది ఆమె ముఖం వల్లగా మాడిపోయిం దొక్క సారిగా.

"రాధక్కయ్యా! రిక్షావాడు డబ్బులకోసం కనిపెట్టుకున్నాడు!" అంది రుక్మిణి, లోపలికి వస్తూ. పాలిపోయిన మురళి, లలితల ముఖాలు చూస్తూ 'మా బాగా రోగం కుదిరింది!' అనుకుని సంతోషించింది.

"ఇదిగో ఈ చిల్లర ఇయ్ రుక్కూ!" అందిరాధ.

"ఇదేమిటి రాధా! హఠాత్తుగా ఇలా వచ్చేశావు?" అన్నాడు మురళి ఎలాగో సంబాళించుకుంటూ.

'అక్కడ నాకేం తోచలేదు."

లలితకు ఏంచెయ్యాలో, ఏం చెప్పాలో పాలుపోలేదు. ఎలాగో నవ్వింది. చప్పున ముఖం ప్రసన్నంగా మార్చేసుకుంది.

"ఇదిగో నమ్మా నీభర్త- రాధా! నువ్వులేక పోవటంతో, పిచ్చిపట్టినట్లు, తిరుగుతున్నాడనుకో! తిన్నగా ఈ రోజు బలవంతంగా లాక్కు వచ్చాను ఇంటికి," అంది రాని నవ్వునవ్వుతూ.

"పిచ్చి నయం చేశావా అక్కయ్యా?" లలిత వేపు సూటిగా చూస్తూ నవ్వుతూ అడిగింది రుక్మిణి.

లలిత లోలోపల మండిపడింది. చేసేదిలేక, "బావ పిచ్చి కుదర్చటానికి రాధే రావాలని నాకు తెలుసు. రాధ వచ్చేసింది. మరి నే వెళ్ళొస్తా రాధా!" అంది వెళ్ళటానికి లేస్తూ.

"అదేం? ఈ రాత్రికి ఇక్కడే వుండు లలితా!" అంది రాధ.

"ఊఁహూఁ! పది పదిహేను రోజుల తర్వాత కల్సుకున్న దంపతులు మీరు. మాట్లాడుకోవల్సిన విషయాలూ, కాలక్షేపాలూ, ఎన్నోవుంటాయిగా మరి!"

దూసుకువెళ్ళిపోయింది లలిత.

"రాధక్కయ్యా! నే వెళ్ళి సరళ గారింట్లో పెట్టుకున్న నా పుస్తకాలు వగైరా తెచ్చుకుంటాను," అని వెళ్ళింది రుక్మిణి.

'రాధా!' మెల్లిగా పిలిచాడు మురళి.

'ఊఁ!'

"ఇంత హఠాత్తుగా."

"....ఎందుకొచ్చానంటారు, అవునా? నాయింటికి నేను ఏ క్షణంలో నయినా రావచ్చని నాకు తెలుసు!" రాధ ఎంత మెల్లిగా చెప్పినా, కటువుగానే ధ్వనించి నట్లయింది మురళికి

"అహఁ, ఆదికాదోయ్! జాబు వ్రాస్తే నే స్టేషన్‌కు వచ్చేవాణ్ణిగా అని. సర్లే ... నేనలా వెళ్ళి పదినిమిషాల్లో వచ్చేస్తాను...." జవాబు ఆశించకుండా బయటికి వెళ్ళాడు మురళి.

తన నుంచి తప్పించుకుని, తనను తాను సంబాళించుకోవటానికి అతగాడు అలా బయటికి వెళ్ళాడని గ్రహించిన్న రాధ మౌనంగా వూరుకుంది.

"రాధక్కయ్యా! దొంగలిద్దరూ చేతిలో చిక్కాక కూడా నువ్వలా వదిలేశావేమిటి?" కోపంగా అడిగింది రుక్మిణి.

"మరేం చెయ్యమన్నావు?" చిరునవ్వుతో అడిగింది రాధ.

"ఏం చెయ్యాలా? ఇద్దర్నీ 'ఈ వేష మేమి' టని దులపలేక పొయ్యావ్? పోనీ లైతే. మా లలితక్కయ్యవి రెండు తగిలించ లేక పొయ్యావ్? నేనే నీ స్థానంలో వుంటేనా?"

"ఏం చేసేదానివి?'' అలాగే నవ్వుతూ అడిగింది.

"నీలా చిరునవ్వు నవ్వుతూ వచ్చినా నిల్చోను, ఏమీ తెలి యని దానికి మల్లే. ఆ మూలనున్న బడితె పుచ్చుకుని, వచ్చీరాగానే యిద్దర్నీ దుమ్ము దులిపేసే దాన్ని!''

"భర్తను కూడానా?'' నవ్వుతూ అడిగింది రాధ.

"భర్త! ఏం అంత ఒళ్ళు తెలియలేదేం? అంత నిగ్రహం లేక పోవటమేం? ఒకవేళ లలితక్కయ్యకు ఇంగితజ్ఞానం లేదే అను కుందాం. బావ బుర్ర ఏమైంది? 'లలితా నీకిది తగదు!' అని చెప్పే పాటి నోరులేక పోయిందా? ఒకవేళ మురళి బావ లేని సమయంలో నువ్వే ఇలా ప్రవర్తిస్తే....''

చప్పున రుక్మిణి నోరు మూసింది రాధ.

'రుక్కూ! ఈ నిమిషంలో లలిత, మీ మురళి బావ మానసి కంగా ఎంత ఆందోళన చెందుతున్నారో నీకు తెలుసా, నేను వాళ్ళి ద్దర్నీ కొట్టలేదు. తిట్టలేదు నిజమే! కానీ ఇద్దరికీ తెలుసు. తమ రహస్యం నా ముందు బయట పడిందనీ, నీకు తెలుసనీనూ. తమను తాము సమ ర్థించుకోలేకా, నా వేపు సూటిగా చూళ్ళేకా ఎంత అవస్థపడి పోయారో చూచేవా? ఆ శిక్ష చాలు వాళ్ళిద్దరికీ. ముఖ్యంగా మీ బావకు."

"బావుంది వేదాంతం!'' రుక్మిణి విసుక్కుంది. అయినా నా కెందు కొచ్చిన గొడవ!'' అనేసింది మళ్ళీ.

రాధ ఫక్కున నవ్వింది, "నా బంగారు రుక్కూ! నీ ఋణం జన్మ జన్మలకూ తీర్చుకోలేనని నాకు తెలుసు!" అంది రాధ రుక్మిణిని హృదయానికి హత్తుకుంటూ.

# 29

"రేపు మంగళ వారం. మా వారు ఉదయాన్నే మద్రాస్ వెళ్ళారు, బహుశా రెండు మూడు రోజుల వరకూ రారు. రేపు సాయంత్రం

ఆరుగంటల ప్రాంతంలో, ఎలాగైనా రాధను నువ్వు మీ ఇంటికి పిల్చికెళ్ళి, లాడ్జిలో మరొకరి చేతుల్లో పడెయ్యాలి. సరిగా ఆరున్నరలోగానే, నేనూ, మురళిని వెంటబెట్టుకుని లాడ్జి కొస్తాను. సరా?" అంది లలిత సీతమ్మతో రహస్యంగా.

"నీ కెందుకు. చూస్తావుగా! అన్నట్లు. ఓ పది కిలోల బియ్యం తెప్పించి మా ఇంటికి పంపించమ్మాయ్ లలితా! బొత్తిగా దొరక్క చచ్చిపోతున్నాను," అంది.

"అలాగేలే పిన్నీ!" అంది లలిత.

# 30

"రా పిన్నీ! చాలా రోజులు తర్వాత కనిపించావ్"- సాదరంగా ఆహ్వానించింది రాధ. రాధకు సీతమ్మను గురించి తెలిసిందల్లా ఆమెను మించిన పరోపకారి మరొకరు లేరనే.

"అం! ఏమిటో ఒంటరి ముండను. ఆ ఇళ్ళ బాడుగలు వసూలు చేసుకోవటం, ఇంటి రిపేర్లూ— దీంతోనే సరిపోతోంది. ఓ అరక్షణం తీరితే, ఏ అమ్మో అప్పడాలో, వడియాలో పెట్టుకోవటానికి సాయం పిలుస్తుందా, వెళ్ళి సాయం చేస్తాను. వెధవ శరీరం, క్షణ భంగురం! ఉన్ననాలుగు రోజులూ పది మందికీ సాయంచేస్తే, అదే ముక్తిమార్గం. కర్మయోగంలో శ్రీకృష్ణపరమాత్మ ఏం చెప్పాడంటే .. "

గారు! ఓనిమిషం ఆగండి.... నేనలా క్లబ్బుకు వెడతాను, భగవద్గీతంతా మా రాధకు చెప్పేద్దురుగాని!" అన్నాడు మురళి నవ్వుతూ బయటికి వెళ్ళబోతూ.

"అయ్యో నా మతి మండిపోనూ—ఇంట్లో అబ్బాయి వున్నాడనేనా గమనించాను కాను!" ఎంతో సిగ్గుపడి, మరింతగా ముడుచుకుపోయి, ఓ ఐదు నిమిషాలు తన వాక్ప్రవాహాన్ని ఆపింది సీతమ్మ.

# 31

మురళి బయటికి వెళ్ళాక మళ్ళీ మొదలెట్టింది సీతమ్మ—"అన్నట్లు. మీ కమలేదీ?"

"ఆదివారం వస్తుంది. బహుశా మా మామగారో, సీతాపతి బాబాయిగారో, వెంట వచ్చి దిగబెట్టి వెళ్తారు. ఆ అమ్మాయికి చెడ్డ భయం, ఒంటరి ప్రయాణాలంటే." అంది రాధ.

"ఇంతకూ నీనుంచి మంచి కబురేదేనా...." అర్ధోక్తిలో ఆగింది సీతమ్మ. సీతమ్మ భావం రాధకు తెలిసింది.

"ఊహూఁ—లేదు పిన్నీ!" అంది బాధగా. తను తల్లి కాలేదన్న బెంగ, అవమానం రాధను కుంగదీశాయి.

"ఆపరేషన్ చేయించుకుని కూడా చాలా కాలం అయింది కదమ్మా!" అంది సీతమ్మ, రాధ బలహీనతని మరింతగా బయట పెడుతూ.

"ఊఁ!"

కాసేపు ఆలోచించి మెల్లిగా అంది సీతమ్మ— "పెద్దదాన్ని. ఇలా చెబుతున్నానని మరోలా అనుకోనంటే, ఓ విషయం చెబుతాను."

"చెప్పు పిన్నీ! పెద్ద దానివి- వయసులోనూ,అనుభవంలోనూ-కూడా!" అంది రాధ వినయంగా.

"ఒక్కోసారి దంపతు లిద్దరి శరీర తత్వం ఒకరి కొకరికి సరిపోదు. అలాంటప్పుడు ఎన్ని ఆపరేషనులు చేయించుకున్నా ఫలితం కనిపించదు...."

"అంటే?"

"స్త్రీ పురుషులలో....(దంపతులలో) ఏ ఒకరి రక్తం, మరొకరి శరీర తత్వంతో సరిపోకున్నా, ఆ లోపం ఎవరిదో స్పష్టం చేయలేం కానీ వారికి సంతాన ప్రాప్తి వుండదు. ఇలాటి దంపతులలోనే ఒక్కోసారి విపరీతమైన వ్యాధులు కూడా పుట్టుకు వస్తుంటాయి- శరీర తత్వాలు వికటించటంవల్ల!"

రాధకు కొంత అర్థమైంది, మరి కొంత అర్థం కాలేదు కానీ ఆ విషయమై ఇంకా చర్చించటానికి సిగ్గు వేసింది. తన కిక బిడ్డలు కలిగే ఆశలేదేమోనన్న నిస్పృహ కూడా ఆవరించింది.

రాధలోని ఈ బలహీనత సీతమ్మకు బాగా తెలుసు. సాధారణంగా ఎదుటి మనిషిలోని బలహీనతల్ని పసిగట్టగలిగి, ఆ బలహీనతల్ని ఆసరాగా చేసుకుని వారి జీవితాలతో చెలగాటాలాడటం, కొందరికి ఉగ్గుపాలతో వచ్చిన విద్య. సీతమ్మ కీ విద్య మరింత బాగా తెలుసు.

రాధలో బిడ్డలకోసం తీవ్రకాంక్ష వుందని ఆమెకు తెలుసు. "అలా నిరాశ పడకు రాధా! మీరు చదువుకున్నవాళ్ళు. మా మోటు పద్ధతులలో మీకు నమ్మకం వుంటుందో లేదోనని ఇన్నాళ్ళూ చెప్ప లేదు...." అంది సాలోచనగా.

"అదేమిటి పిన్నీ! చదువుకున్నవాళ్ళకు మాత్రం, సంప్రదాయాల మీదా, దైవం మీదా నమ్మకం వుండదా ఏమిటి?" అంది రాధ.

"ఎలా అన్నావు బావుంది. మా ఇంటి పక్కనే ఓ లాడ్జి వుంది. నీకు తెలీదులే. నువ్వా వీధికి ఎప్పుడొచ్చావు గనక? ఆ లాడ్జి మేనేజరు తమ్ముడొకడున్నాడు—చూట్టానికి ఫక్తు దొరల మల్లే వేషం వేస్తాడు. కానీ పూజా పునస్కారాలలో అఖండుడు. అన్నట్లు రేపు మంగళవారం కాదూ?"

"అవును," అంది రాధ ఉత్సాహంగా.

"ఆ, రేపే వస్తాడతగాడు. ప్రతి మంగళవారం వస్తాడులే అక్కడికి. అతగాడు ఓ అరగంటలో మంత్రించి విభూతి ఇస్తాడు. ఓ నెలరోజులు వరుసగా విభూతి పెట్టుకో. మరు నెలకు నీలో మార్పు, నాకో శుభవార్తా రాకుంటే అప్పు డడుగు!" అంది సీతమ్మ కథనం పూర్తిచేస్తూ.

రాధ ఆలోచనలో పడింది.

"సుమారుగా ఓ డజను మంది గొడ్రాళ్ళు గుమ్మడిపండ్లంటి బిడ్డల నెత్తుకున్నారు అతగాడి విభూతితో. నాకళ్ళతోనే చూశాను!"

రాధకు సంతాన కాంక్ష బలవత్తరంగానే వుంది. ఓ విధంగా ఆ కోరిక ఆమెలో బలంగా వ్రేళ్ళు నాటుకు పోయింది.

"అయితే పిన్నీ! ఆయనగారి పూజకు వస్తువు లేవేం కావాలో చెప్పు, తెప్పించేస్తాను వారితో చెప్పి." అంది ఉత్సాహంగా.

సీతమ్మ బుగ్గలు నొక్కుకుంది. "హవ్వ! ఇంకా నయం మీ వారితో చెప్పావు కావు!" అంది.

రాధ ఆశ్చర్యంగా చూచింది.

"అవునే అమ్మాయ్! ఆయనగారు పూజ చేసేటప్పుడు సంతానం కోరే స్త్రీ తప్ప, మరెవ్వరూ వుండకూడదు. ఆ విభూతి మీ వారు అసలు చూడకూడదు. ముట్టుకో కూడదు." అంది చిక్కచ్చిగా.

ఇదేం చిత్రం! ఇదెలా సాధ్యం? మురళికి తెలియకుండా తనీ పూజ ఎలా చేయించగలదు?

"నీ కెందు కింత ఆలోచన రాధా? నే నున్నానుగా. రేపు సాయంత్రం ఆరుగంటలకు నువ్వురిక్షాలో బయలు దేరిరా. అంతగా అయితే ఏ స్నేహితురాలింటికో వెళ్తున్నట్లు మీ ఆయనకు చెప్పు! మరేం ఫర్వాలేదు, ఆ కాస్త అబద్ధం ఆడితే. రేపు నీకు కొడుకు పుడితే, ఆ సంతోషం అతగాడిది మాత్రం కాదా ఏం? అప్పుడే చెబుదూ గానీ, ఈ పూజసంగతి. ఏం"

రాధ ఆలోచిస్తోంది ఆమె మనస్సు అంగీకరిస్తోంది

"వీధి మలుపులో నేను నిల్చుని వుంటాను. ఇద్దరం కలిసే వెడదాం! నేను నిన్ను ఆయనగారికి పరిచయం చేస్తాలే! నీకేం భయంలేదు .. అన్నట్లు పూజక్కావల్సిన సామాన్లుకాదూ అడిగావ్? ఏమీ అవసరం లేదు! చక్కగా తలంటు స్నానం చేసి, పట్టుచీరె, జాకెట్టూ వేసుకో. చాలు! ఆయన ప్రతి ఫలాపేక్షతో పూజచేసే వాడేం కాదు. మహానుభావుడు!" అంది సీతమ్మ.

ఒక్కోసారి మనిషిలోని బలహీనతలు, మనిషిలోని వివేచనా జ్ఞానాన్ని బొత్తుగా కప్పివేస్తాయి తల్లి కావాలన్న తీవ్రకాంక్షతో వున్న రాధకు, సీతమ్మ చెబుతున్న మాటలలో ఏలాటి కపటమూ గోచరింపలేదు సరికదా, పైపెచ్చు తనకోసం సీతమ్మ దేవదూతలా దిగివచ్చిం దనిపించిందా క్షణంలో.

"రేపు సాయంత్రం ఆరుగంటలకు.... మర్చిపోవుగదూ ?" లేస్తూ అంది సీతమ్మ.

"ఊఁ!"

వెళ్తున్న దల్లా వెనక్కు వచ్చి మళ్ళీ అంది సీతమ్మ—"మీ వారి కీ సంగతు లేవీ చెప్పవుగా? నా మీద వొట్టు!"

"అలాగే!" చేతిలో చెయ్యి వేసింది రాధ.

ఆ రాత్రంతా, తన ప్రక్కలో చక్కటి పిల్లాడు పడుకుని, బుల్లిబుల్లి చేతులతో, తనకు గిలిగింతలు పెడ్తున్నట్లు ఎన్నెన్నో కమ్మని కలలు గన్నది రాధ!

# 32

ఉదయం మద్రాస్ వెళ్తానంటూ బయల్దేరిన కృష్ణమోహన్, తన పార్ట్నర్ శ్రీనివాసరావును మద్రాస్ పంపాడు, తనకు బదులుగా.

ఓ లాడ్జిలో రూం తీసుకున్నాడు. అతగాడి హృదయంలో లలితను గురించిన అనుమానం అంత కంతకూ ఎక్కువైంది. మొన్నటో రోజు సీతమ్మతో లలిత ఏదో మంతనాలు చేస్తోంది. ఆ సంభాషణలో రెండు మూడు మార్లు 'మురళి' అన్నమాటలు తన చెవిని పడ్డాయి.

"ఏమి టావిడతో కబుర్లు?" అన్నాడు కృష్ణమోహన్ సీతమ్మ వెళ్ళాక లలితతో.

"ఏ ముంటాయి? అయినా ఏమిటి మీకీ ఆరా!" అంది చిరాకుగా, "మురళి పేరు విన్పిస్తే, మళ్ళీ అతగాడికే దేనా జబ్బు చేసిందేమో నని!" వ్యంగ్యంగా అన్నాడు కృష్ణమోహన్, లలిత ముఖంలో రంగులు పరిశీలిస్తూ.

"ఇది మరీ బావుంది! 'ముసురు పడ్తుందో ఏమో, కాస్త వడియాలు పెట్టివ్వండి పిన్నిగారు, ఎండలు పోయేలోగా!' అని నా పిణ్ణి బ్రతిమాలుకుంటుంటే - మీకు 'మురళి' అని విన్పించిందా? అనుమానంతోపాటు చెవుడుకూడా తయారయ్యేలా వుంది మీకు!" కొర కొర చూచి విసుగ్గా అవతలికి వెళ్ళిపోయింది లలిత

తనంత చాదస్తుడా? చెవిటివాడా? మిగతా సంభాషణ తను వినని మాట వాస్తవమే అయినా, 'మురళీ' అని విన్పించటం మాత్రం భ్రమకాదు. పైపెచ్చు వడియాలను గురించి అంత రహస్యంగా సంప్రతించుకోవాల్సిన అవసర మేమిటో బోధ పడ లేదు కృష్ణమోహన్‌కు.

అతగాడి హృదయం కోపంతో బుసలు కొడుతోంది. లలిత కీ మధ్య నిర్లక్ష్యం, నిర్లజ్జ, తనంటే తగని చిరాకు ఎక్కువై పోయాయి. కారణం ఆమెమీద తన కున్న వల్లమాలిన మమత!

ఆ బలహీనత ఆధారంగా చేసుకుని, లలిత పేట్రేగి పోతోంది. లలితను అదుపులో పెట్టాలి.

హోటల్ రూంలో పడుకున్న కృష్ణమోహన్ తలలో ఆలో చనలలా సుడులు తిరుగుతున్నాయి...

# 33

ఉదయం లేచింది మొదలూ రాధ చాలా హుషారుగా వుంది. సాయంత్రం ఐదు గంటలకే చక్కగా తలంటు పోసుకున్న కురులు పిన్నులతో చక్కని పిగగా అమర్చుకుంది. ముదర నీలం కంచి పట్టు చీరె, తెల్లని పట్టు జాకెట్టు, మెడలో తెల్లరాళ్ళ నెక్లెసుతో, అపర గృహలక్ష్మిలా వెలిగిపోతోంది.

"ఓహ్! ఏమిటీ అలంకరణ ఎంత బావుందని నీకు రాధా! పిక్చర్‌కేనా? ఊఁ! నేనూ రెడీ!" అన్నాడు మురళి కాలేజినుంచి వస్తూనే హుషారుగా.

గతుక్కుమంది రాధ మనస్సు.

"ఊఁహూఁ! నా స్నేహితురాలు సరోజ మీరలా కాలేజికి వెళ్ళగానే వచ్చి ఆహ్వానించి వెళ్ళింది. దాని బిడ్డకు పుట్టిన దినమట. తప్పక రమ్మంది" ఎన్నడూ భర్తతో ఇలా అబద్ధాలాడటం అలవాటు లేని రాధ, ఆ నాలుగు ముక్కలూ కల్పించి చెప్పేసరికి తడబడి పోయింది.

"అలాగే వెళ్ళిరా! అందుకంత కంగారు పడాలా రాధా? మరి బహుమతి ఏం పట్టుకెళ్తావ్?" అన్నాడు మురళి.

క్షణకాలం ఏం చెప్పాలో తోచలేదు రాధకు....

"ఎలాగూ మెయిన్ బజారులోంచేగా వెడ్తుంది రిక్షా—ఏ ఫ్యాన్సీషాపు దగ్గరో ఆపుకుని, ఏదేనా పట్టుకెడతాను."

"ఓ యస్! అయితే నాకు రాత్రి పది గంటలవరకూ భోజన ప్రాప్తి లేదనుకుంటాను!" అన్నాడు నవ్వుతూ.

"అబ్బే! ఎందుకూ? ఓ గంటలో వచ్చెయ్యనూ?" అంది రాధ

"మరైతే, నేను అలా క్లబ్బుకివెళ్ళి వస్తాను!" మురళి హుషారుగా బయటికి వెళ్ళిపోయాడు.

ఐదూ నలభై అయిదుకు రిక్షా కేకేసింది రాధ, ఇంటికి తాళం వేస్తూ. అప్పుడే వరండాలోకి వస్తూన్న రుక్మిణి, రాధకేసి పరకాయించి చూసింది.

"ఏం రాధక్కయ్యా! ఏదో విశేషమే వుందే! మురళి బావ వెంటరాకుండా నువ్వు ఒంటరిగా ఎక్కడికో బయల్దేరావంటే.... ఇదేదో ప్రళయానికి సూచనే!" అంది నవ్వుతూ.

"చాల్లే! పిచ్చి వేళాకోళాలూ నువ్వూనూ! సరోజ బిడ్డ పుట్టిన రోజు పండుగకు వెళ్తున్నా. మరో గంటలో వచ్చేస్తాగా!" అంది రాధ అలాగే తడబడుతూ.

"నేనూ రానా?"

రాధ నివ్వెరపోయింది మురళినైతే ఎలాగోలా తప్పించుకో గలిగింది కానీ, అవులిస్తే పేగులు లెక్కపెట్టే ఈ రుక్మిణి నెలా తప్పించుకోవటం?

రుక్మిణి కిలకిల నవ్వుతూ రాధ భుజం మీద చెయ్యి వేసింది.
"మై డియర్ రాధక్కా! పిలవని పేరంటానికి వెంట బడి నే వస్తాననుకున్నావా? ఊహూఁ! తమాషా కన్నాను. వెళ్ళిరా!"

"అల్లరిపిల్ల!" నిండుగా నవ్వి రుక్మిణిని వదలి, రిక్షాలో కూర్చుంది రాధ.

రిక్షా మలుపు తిరిగిందో లేదో. సీతమ్మ వచ్చి కలిసింది....

"రైట్! ఇలా వుండాలి ఇక నువ్వు తల్లివైనట్లే అనుకో!" అంది సీతమ్మ రాధను హుషారు చేస్తూ.

రాధ హృదయం ఆనందంతో గంతులు వేసింది.

# 34

క్లబ్బుకు వెడతానన్న మురళి పార్కులో కూర్చున్నాడు మధ్యాహ్నం అతగాడు కాలేజిలో పాఠం చెబుతూండగా, లలిత పంపిన నౌకరు కుర్రాడు. కవరోటి పట్టుకొచ్చి ఇచ్చాడు, ఇంగ్లీషులో లలిత వ్రాసిపంపిన చిన్న ఉత్తరం అది.

"బావా! సాయంత్రం సరిగ్గా ఆరు గంటలకు, మీ ఇంటి దగ్గరున్న పార్కులోకి రాగలవా? తప్పక వస్తావనే అనుకుంటు న్నాను. అవసరంగా నీతో ఓ సంగతి మాట్లాడాలి. ఓ అరగంట టైము చాలు. అట్టే విసిగించను!"

ఉత్తరం చదువుకుని జేబులో పెట్టుకున్నాడు మురళి. సాయంత్రం తమాషాకు రాధతో "సినిమాకా? ఓ! రెడీ!" అన్నాడే గానీ, నిజానికి సినిమాకు వెళ్ళాలని లేదు.

ఆ రోజు లలితనూ, తననూ అలా చూచి కూడా రాధ ఏం ప్రశ్నించలేదు సరి కదా, అలకతో బిగుసుకోలేదు కూడానూ. మామూలుగానే వుంది. అదే ఆశ్చర్యంగా వుంది మురళికి.

"నాకు తెలుసు—మా బావ చాలా మంచి వాడు! నా మాట మీద ఎంతో గౌరవం వుందనీ తెలుసు!" లలిత వస్తూనే మురళి ప్రక్కన కూర్చుంటూ అంది.

కానీ, మురళికంటే ముందుగా, నౌకరు దగ్గరి ఉత్తరం కృష్ణమోహన్ చదివాడని కానీ, నౌకరు నోరుఓ పది రూపాయలతో అతగాడు మూయించి వేశాడని గానీ, తమకంటె ముందు పార్కులో కృష్ణమోహన్ వచ్చి వున్నాడని గానీ-లలితకూ, మురళికీ తెలియదు.

"ఊఁ! ఇంతకూ ఆ దేవ రహస్య మేమిటోనని మహా తహ తహగా వుంది సుమా నాకు—"

"అంత తొందరెందుకూ? చెబుతాగా!" మురళి భుజం మీద సుతారంగా చేతి వ్రేళ్ళతో మీటుతూ అంది లలిత.

"అబ్బ! చెబుదూ చంపక—"

"ఓ చక్కటి దృశ్యం చూపిస్తాను. నా వెంట వస్తావా?"

"ఎక్కడికి?"

"నే తీసుకువెళ్ళే చోటికి!"

"మీ ఇంటికా?"

"ఊఁహూఁ! నీ కెందుకు—రమ్మన్నానా?"

మురళి కేం బోధ పడలేదు. "వెళ్దాం పద!" అన్నాడు.

మంత్ర ముగ్ధునిలా లలిత వెంట వెళ్ళి రిక్షా ఎక్కాడు మురళి.

చింత నిప్పుల్లాటి కళ్ళతో, మండుతున్న హృదయంతో వెంబడిస్తున్న కృష్ణమోహన్‌ను, ఇరువురూ గమనించే స్థితిలో లేరు.

"నీ మాటలూ చేష్టలూ, బొత్తుగా అర్థంకావటంలేదు లలితా!" అన్నాడు మురళి.

"సర్లే! అర్థమౌతాయిగా! ఆ రోజు రాధ నిన్నేం అనలేదూ? నన్ను తిట్ట లేదూ?" అంది ఉత్సాహంగా చూస్తూ లలిత.

"ఈ మాట అడగటానికేనా ఇంత దూరం లాక్కొచ్చావ్?" అన్నాడు మురళి చిరాగ్గా.

"ఊఁహూఁ! ముందు సమాధానం చెప్పు!"

"ఏమీ అనలేదు."

"అవును. ఏమంటుంది? ఎదేనా అంటే, తనకూ ముప్పు వస్తుందని ఆమెకు బాగా తెల్సు. మాంఛి తెలివి గలది రాధ!" తనలో తను గొణుక్కుంటున్నట్లు అంది లలిత.

కళ్ళు చికిలించి లలితవేపు చూశాడు మురళి. "అంటే?"

"చెప్పనా? చెబితే నువ్వు నమ్ముతావా?" తీవ్రంగా అతగాడి వేపు చూస్తూ అడిగింది లలిత.

"ఏమిటి, లలితా? నీ మాటలు నాకేం అర్థంకావటం లేదు!" విసుగ్గా అన్నాడు మురళి.

"వివరించడానికే పిల్చికెళ్తున్నాను. బిడ్డలులేని స్త్రీ హృదయంలో ఎంత ఆవేదన నిండి వుంటుందో, అంతటి తెగింపూ వుంటుంది!"

"కొత్త సిద్ధాంతం!" మురళి నవ్వాడు.

"కాబట్టే, ప్రయోగాన్ని కూడా కళ్ళారా చూద్దూగానీ.... అన్నట్లు రాధ ఈ రోజెక్కడికి వెళ్ళింది?" అంది మాట మారుస్తూ.

"వాళ్ళ స్నేహితురాలు సరోజ ఇంటికి—"

"నా బంగారు వెర్రి బావా! ఇందుకే నిన్ను అమాయకుడి వంటున్నాను. సరోజ ఇంటిక్కాదు రాధ వెళ్ళింది....ఓ లాడ్జింగ్‌కు!" అంది జ్యోతిష్కుని ముఖం పెట్టి.

ఎందుకు? అప్రయోగా ...

"నీ వల్ల కలగని సంతానాన్ని మరొకరి వల్ల పొందటానికి!"

"లలితా!" పెద్దగా అరిచాడు మురళి.

"ఉష్! అలా అరవకు.... రిక్షావాడే మనుకుంటాడు." అంది లలిత, నిర్లిప్తంగా వీధికేసి చూస్తూ.

"నీ కెలా తెల్సు? ఇది నిజమేనా?"

"అవును! అక్కడికే నిన్నిప్పుడు తీసుకు వెడతా, పిచ్చిబావా! మెరిసేదంతా బంగారమూ కాదూ. అదుగో హోటల్ వచ్చేసింది.... ఇక్కడేం గొడవ చెయ్యకు. అనవసరంగా అందరూ పోగయి, నానా అల్లరీ అవుతుంది."

లలిత దారి తీసింది. మతి పోయిన వాడిలా మురళి అనుసరించాడు.... కాస్సేపాగి కృష్ణమోహన్ వచ్చాడు లోపలికి.

# 35

సీతమ్మ, రాధ హోటల్‌లో అడుగుపెట్టగానే, మేనేజరు సవినయంగా ఎదురువచ్చాడు. పెద్ద హోటలేమీ కాదు, కానీ, పరిశుభ్రంగా మాత్రం వుంది. మేడమీద వరసగా గదులున్నాయి సర్వర్సు ఒకరిద్దరు మినహా, ఎక్కువ రద్దీ, అలజడీ లేదు.

"పదో నెంబరు గది ఖాళీగానే వుందిగా, నరహరిగారూ? ఆయనగారొచ్చారా? అమ్మాయి ఓ గంట వుండి వెళ్తుంది!" అంది సీతమ్మ కోడ్ భాషలో.

నరహరిగారి కీ భాష బాగా అర్థమౌతుంది. గౌరవ కుటుంబాలకు చెందిన స్త్రీ, పురుషులు బహుమర్యాదగా వస్తారు ఇక్కడికి సీతమ్మగారి సాయంతో.

"ఆ, ఖాళీగానే వుందండి! ఆయనిగారొచ్చి వెళ్ళిపోయింది. రాగానే పైకి పంపిస్తాను," అన్నాడు సవినయంగా, నరహరిగారు.

సీతమ్మా, రాధ మేడ మీదకు వెళ్ళారు. పదో నెంబరు గదిలోకి వచ్చారు.

"ఇక్కడే వుండు రాధా! ఆయనగారిని పిల్చుకువస్తాను. పూజవేళ నేను క్రిందనే వుంటాను. పూజ అయిపోగానే, నిన్ను పిల్చుకు వెళ్ళి దిగబెట్టి వస్తాను. సరా?"

రాధ గుండె వేగంగా కొట్టుకుంటోం దెందుకో. అయినా ఏలాగో తమాయించుకుంది, "పిన్నీ! నువ్వు గది బయటే వుండ రాదూ?" అంది అమాయకంగా.

"అయ్యో రాత! మళ్ళీ మొదటి కొచ్చావ్! ఆయనగారు దేవీ పూజ చేస్తారు.... ఆ చుట్టుప్రక్కల ఎవ్వరూ వుండకూడదు.... అందుకే పక్కరూముల్లో ఎవర్నీ వుంచలేదు నరహరిగారు. అయినా నీకేం భయమమ్మా! నేనీ మెట్ల కిందే వుంటానుగా!"

జవాబుకు ఎదురు చూడకుండా కిందికి దిగి వెళ్ళిపోయింది సీతమ్మ, రూం తలుపు దగ్గరగా లాగి.

రాధ గదంతా చిత్రంగా పరిశీలించింది. గోడలూ, పైకప్పు, చక్కటి అల్యూమినియం పూతతో తళతళ లాడుతున్నాయి. గది మధ్యలో పెద్ద పందిరి మంచమూ, శుభ్రమైన పరుపూ వున్నాయి. టేబుల్ మిర్రర్, ఓ ప్రక్కగా బాత్ రూం!

## 36

మెల్లిగా మెట్లెక్కుతున్న ఇంజనీర్, అప్పుడప్పుడే శరీరంలో ఉబుకుతున్న విషాను కాస్త సంబాళించుకుంటున్నాడు. అతగాడు

బాగా పరు మాసిన ఇంజనీరు. కాని పబ్లిక్‌గా వ్యభిచరించటం మంటే చచ్చేంత భయం! అందుకే అప్పుడప్పుడూ సీతమ్మ సాయంతో, ఇలా తనలానే 'ప్రతిష్ట' ముసుగువేసుకు వచ్చే గౌరవ స్త్రీలను ఈ హోటల్లో కలుసు కుంటూంటాడు

ఉదయం సీతమ్మ హెచ్చరించింది—"జాగ్రత్త! అవి డింత వరకూ ఇలాటి వ్యవహారాల్లో దిగిన మనిషి కాదు. బహుశా భయపడి అల్లరిచేస్తుందేమో.... జాగ్రత్త!"

ఇంజనీర్ నవ్వాడు- "ఎవర్ని ఎలా త్రోవకు తెచ్చుకోవాలో నాకు తెలుసు అక్కయ్యగారూ! ఇదిగో మీ ఖర్చుల కుంచండి." వంద రూపాయలనోటు ఆవిడ చేతిలో వుంచాడు. "ఓహ్. ఎలా గోలా అల్లరి పెట్టకుండా దారికి తెస్తాలే!" విలాసంగా నవ్వుకుంటూ పదోనెంబరు గది వేపు నడిచా డతగాడు.

"పది నిమిషాలు గడిచినా, ఏ అయిపూలేదు— బహుశా ఆయనగారీ రోజు రాలేదేమో?" అనుకుంది రాధ విసుగ్గా. ఓ వేపు మనస్సులో భయమూ వేస్తోంది. ఎన్నడూలేంది ఏమిటీ తెగింపు తనకు? పైగా మురళితో అబద్ధాలాడింది కూడా!

స్త్రీలోని సంతాన కాంక్ష ఇంత ప్రబలమైందా? తనలో ఇంత దాహం, తల్లి కావాలనే ఇంతటి పిపాస నిద్రాణమై వున్నాయా?

తలుపు త్రోసిన చప్పుడు కావటంలో త్రుళ్ళిపడి, తలెత్తి చూచింది రాధ. గుమ్మంలో నిల్చుని, మత్తుగా, ఎర్రవారిన కళ్ళతో, ఆత్రంగా చూస్తున్న ఆజానుబాహు విగ్రహాన్ని చూచి భయంతో గడ్డ కట్టుకు పోయింది.

"మీరేం భయపడనవసరం లేదు.... ఏ సమయంలోనూ.... మరెక్కడైనా, మీరు నాకు ఎదురైనా, మిమ్మల్ని తెలిసినట్లు, కనీసం చూచినట్లు కూడా ప్రవర్తించను. మీరేవిధంగానూ నావల్ల అల్లరి పడరని హామీ ఇస్తున్నాను!" ఓ విధంగా తడబడుతూ వస్తున్న మాటలతో మెల్లిగా అన్నా డతగాడు - తలుపు గడియ వేయబోతూ.

రాధ కేం అర్థంకాలేదు, అతగాడు చెప్పేదేమిటో. అలాగే గుడ్లప్పగించి చూస్తోంది. "వద్దు.... తలుపు గడియ పెట్టొద్దు, నాకు భయం!" అని మాత్రం అంది, బిత్తరపోయి చూస్తూ.

"అలా బెదిరి పోకండి. కాస్సేపు చనువుగా కబుర్లాడండి బెరుకు అదే తగ్గి పోతుంది...." రాధ వేపు అడుగులు వేస్తూ అన్నా డతగాడు, మత్తుగా.

అతగాడి కళ్ళు మరింత ఎర్రగా, దాహంతో నిండి వున్నాయి. రాధ హడిలి పోయింది.

"మీరు.... మీరు.... పూజ-విబూది" ఎలాగో అంది వణుకుతున్న పెదవుల్నీ, శరీరాన్నీ అదుపులో పెట్టుకోడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ.

"పూజ? విబూది? ఏమిటి" అతగాడు నవ్వుతూ అడిగాడు. అంతలోనే విరగబడినవ్వి "మీరు, కంగారుపడి - ఏదో మాట్లాడేస్తున్నారు. మరేం భయపడకండి. ముందే చెప్పానుగా నావల్ల మీరు ఎలాంటి అల్లరీ పడరనీ, మీగౌరవాని కేలాటి మచ్చా రాదనీనూ!" అన్నాడు.

రాధ తల గిర్రున తిరుగుతోంది. ఏమి టితగాడి ప్రలాపన? కొద్దిగా తాగి వున్నాడని తెలుస్తూనేవుంది. పైగా తనను మింగేలా చూస్తూ, మీది మీదికి వస్తున్నాడు.

"ఆగండి!" బాగా దగ్గరగా వచ్చి, తన వేపు చేతులు చాపుతున్న అతగాణ్ణి తప్పించుకుంటూ, గట్టిగా అరిచింది రాధ. త్రుళ్ళిపడి, అంతలోనే నవ్వేశాడతగాడు. "అనవసరంగా మీరే రభస చేసుకుంటున్నారు! ప్రక్కరూముల్లోకి ఇప్పుడిప్పుడే గౌరవ కుటుంబాలకు చెందిన ప్రేయసీ ప్రియులు వస్తున్నారు మనమూ అలాగే వచ్చాం. ఇందాకా వచ్చి మీరు, మరింత బెట్టుచేసి, అతి పాతివ్రత్యం ప్రదర్శించటం బాగులేదు! సీతమ్మగారికి డబ్బు కూడా ఇచ్చేశాను. నరహరిరావుకూ ఇచ్చేశాను. మరి మీ రనవసరంగా ఎందుకు గొడవ చేస్తున్నారో అర్థం కావటం లేదు!" అన్నాడు చిరాగ్గా.

రావుకు ఒక్క సారిగా చాలా అర్థమై పోయింది. గౌరవంగా వ్యభిచరించే పెద్ద మనుషుల హోటలా ఇది? ఇందులోకి తననెందుకు తెచ్చింది సీతమ్మ? పూజ విభూతి—ఇవన్నీ కేవలం తనకై వేసిన ఎరలా? తనేం ద్రోహం చేసిం దావిడకు?

రాధకు దుఃఖం, కోపము ఆగలేదు. "ఒక్క నిముషం ఆగండి.... నే చెప్పేది పూర్తిగా వినండి!" అంది, వస్తున్న దుఃఖాన్ని ఎలాగో అణచుకుంటూ.

మంచంమీద స్తిమితంగా కూర్చుని నవ్వా డతగాడు. చాలా మంది స్త్రీలు, ముందస్తుగా, తమకు కావలసిన వస్తువుల, డబ్బు జాబితా చెప్పేస్తారు. అలాగే రాధకూడా ఏదో కోరబోతోంది అనుకున్నాడు.

"నా కిదేమీ తెలియదు. తెలిస్తే నే నిక్కడికి వచ్చేదాన్ని కాను. కనీసం రావటానికి వచ్చినా అంగీకరించేదాన్ని గాదు. అన్నయ్యగారూ! సీతమ్మ నన్ను మోసం చేసింది. ఇక్కడేదో పూజ చేయిస్తానని నమ్మించి, నన్ను తెచ్చింది. అంతే! దయచేసి నాజీవితం నాశనం చెయ్యకండి" అంటూ గబగబ చెప్పి, కళ్ళు మూసి తెర చేంతలో, గడియ తీసుకుని బయటికి వచ్చేసింది రాధ. కన్నీళ్ళు పొర క్రమ్ముకోగా- ఎదురుగా నిల్చుని, నిప్పులు చెరిగే కళ్ళతో చూస్తున్న మురళిని గానీ, విలాసంగా నవ్వుతున్న లలితను గానీ పోల్చుకోలేక పోయింది. ఎగసి వస్తున్న వెక్కిళ్ళ నాపుకుంటూ, హోటల్ బయటకి పరుగెత్తి, కనిపించిన రిక్షాలో కూర్చొని "పోనీ!" అంది రాధ.

"ఏమిటీ తమాషా! ఛీ! ఛీ! అనవసరంగా డబ్బు పోయింది, ఎంగేజ్‌మెంటూ పాడయి పోయింది...." గొణుక్కుంటూ బయటికి వెళ్తున్న ఇంజనీరు వేపు చూచి అవమానంతో చచ్చి పోయాడు మురళి.

పిడికెళ్ళు బిగబట్టి వున్న అతగాడి చెయ్యి మెల్లిగా నొక్కుతూ, "బావా! ముందే చెప్పాను....ఇక్కడేం గొడవ చెయ్యక రా, వెళాం!" అంది లలిత.

త్రాగిన వాడిలా వస్తున్న మురళి వెంట ధీమాగా నడిచింది లలిత.

"లలితా, రా! కార్లో కూర్చో!" ఆ పిలుపు విని త్రుళ్ళి పడింది లలిత—ఎదురుగా కృష్ణమోహన్ నిల్చుని వున్నాడు

ఒక్కసారిగా గుండె ఝల్లు మంది లలితకు. ఏనాడూ ఎరగని భయం మొదటి సారిగా అనుభవంలోకి వచ్చింది.

"మిస్టర్ మురళీ! మీరు కూడా కారెక్కండి! మిమ్మల్ని ఇంటిదగ్గర వదిలి, మేం వెళ్తాం!" అన్నాడు గంభీరంగా.

మురళి ఏమీ మాట్లాడలేక పోయాడు.

కృష్ణమోహన్ రాధను చూస్తూనే గ్రహించ గలిగాడు. ఆమె ఇక్కడికి కేవలం మోసం మీదనే తీసుకు రాబడిందనే విషయాన్ని. పార్కులో లలిత సంభాషణ, సీతమ్మతో గుసగుసలూ ఒకటొకటే స్మృతిపథంలో మెదిలాయి.

"బ్రదర్ మురళీ! చూచేవన్నీ నిజాలూ కావు, చూడనివన్నీ అబద్ధాలూ కావు! ఇంత దూరం వచ్చాక, అరమర ఎందుకు? చెల్లాయి రాధ ఏదో విషవలయంలో చిక్కుకుంది, ఆవిడ భర్తగా మీరు వివేకంతో ప్రవర్తించండి అదే నేను మిమ్మల్ని కోరుతున్నాను. మేం నాలుగు రోజుల్లో వెళ్ళిపోబోతున్నాం!" అన్నాడు గంభీరంగా.

వెనుకసీట్లో కూర్చుని వున్న లలిత దాదాపు సగం చచ్చి వుంది. మురళి తల దిమ్ముగా, రాయిలా వుంది.

# 37

"రుక్కూ!" ఎదురు వచ్చిన రుక్మిణి చేతుల్లో వాలి, వెక్కి వెక్కి ఏడుస్తూ మంచం మీద పడిపోయింది రాధ.

"అక్కయ్యా! ఏమిటి? ఏమయ్యింది." ఆత్రంగా రుక్మిణి ఎంతగా అడిగినా సమాధానం చెప్పలేదు రాధ. అలా ఏడుస్తూనే వుంది.

"బావా! ఏమయ్యింది? అక్కయ్యేమిటిలా అయిపోయింది?" అప్పుడే లోపలికి వచ్చిన మురళివేపు చూస్తూ అడిగింది రుక్మిణి.

"నాకేం తెలియటం లేదు రుక్కూ! ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో, ఏం చేయాలో పాలు పోవటం లేదు." అన్నాడు మురళి కుర్చీలో కూర్చొని తల రెండు చేతులతో పట్టుకుని.

రాధ మెల్లిగా కళ్ళు తెరిచి చూచింది. మురళి అలాగే కుర్చీలో కూర్చుని వున్నాడు. తిన్నగా లేచి వెళ్ళి, మురళి పాదాల దగ్గర కూర్చుంది. రుక్మిణి లేచి బయటికి వెళ్ళబోయింది

"రుక్కూ! వద్దు. వెళ్ళొద్దు. నువ్వూ విను...." అంది రాధ. రుక్మిణి ఆశ్చర్యంగా అలాగే కూర్చుండి పోయింది.

సీతమ్మ వచ్చిన దగ్గర్నుంచి, హోటల్ బయటకి పరుగెత్తి తాను రిక్షాలో కూర్చునేంత వరకూ జరిగిన సంగతులన్నీ, ఏ ఒక్కటీ వదలకుండా చెప్పింది రాధ....

"నమ్మండి, మానండి.... ఇది నిజం! ఏ ఒక్కటీ దాచలేదు నేను. నేనా పాపపు మూటను సంతానంగా కలలో కూడా కోరలేదు. ఏదో విభూతి ఇస్తారని మాత్రం అనుకున్నాను. ఆ నమ్మకం తోనే మోసపోయాను. మొదటి సారిగా మీతో అబద్ధమాడాను." వెక్కిళ్ళతో ముఖం చేతుల్లో దాచుకుంది రాధ.

# 38

చల్లని వెన్నెల రాజ్యం చేస్తోంది ప్రపంచ మంతటా.

"చిన్నతనంలోనే విధవ రాత రాసివున్న నేను మళ్ళీ నుదుట కుంకుమ పెట్టుకుంటాననీ, భర్త ఒడిలో ఇంత ప్రశాంతంగా వాలి, జీవిత మాధుర్యాన్ని చవి చూస్తాననీ కలలో కూడా అనుకోలేదు.... మా మురళి అన్నయ్య, రాధ వదినల ప్రోత్సాహమే, నన్ను తిరిగీ మనిషిని చేసింది. నా మెడలో మంగళ సూత్రం కట్టి, నాకు మనుగడ ప్రసాదించారు మీరు. మీ కెలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో అర్థంగావటం లేదు'' అంటోంది కమల- ప్రసాద్ మెడ చుట్టూ చేతులువేసి, అతగాడి హృదయంలో తల దాచుకుని పరవశించిపోతూ.

''పిచ్చి కమలా! ఇందులో కృతజ్ఞతల ప్రసక్తేముంది? నువ్వు నాకు నచ్చావ్. నీలాటి ముగ్ధకు భగవంతుడు చేసిన అన్యాయం, సరిదిద్దా లనుకున్నాను. పెళ్ళాడాను. ఒకరు మరొకరి కోసం త్యాగంచేశామన్న భావనా, ఒకరికి మరొకరు ఆజన్మాంతం కృతజ్ఞతలు తెలుపుకోవాలన్న భావనా దంపతులలో వుంటే ఆ దాంపత్యంలో కేవలం త్యాగం తాలూకు అహం, కృతజ్ఞతల తాలూకు బరువే నిండి వుంటుంది కానీ, స్వచ్ఛమైన అనురాగాని కసలు చోటే వుండదు. కేవలం వడ్డీ వ్యాపారంలా సాగుతుం దా దాంపత్యం. కాబట్టి మై డియర్ కమలా! కృతజ్ఞతల ప్రసక్తి తేకు! అలా చూడు. అల్లరి జాబిల్లి ఎలా నవ్వుతున్నాడో!'' అన్నాడు ప్రసాద్ కమల చుట్టూ చేతులువేసి, ఆమెను తన హృదయానికి హత్తుకుంటూ.

# 39

''అమ్మాయ్ రుక్మిణీదేవీ! అదేం కుదరదు. ఇంకా తప్పించుకుంటానంటే, ఏం చేస్తానో తెలుసా? ఇలా అమాంతం చేతుల్లో ఎత్తుకు వెళ్ళి గదిలో వేస్తాను!'' పిట్టగోడ నానుకొని, వెన్నెలవేపు

చూస్తూ చిలిపిగా నవ్వుతున్న రుక్మిణి దగ్గరగా వస్తూ అన్నాడు సుదర్శన్, నవ్వుతూ.

"ఓ! అలాగే ఎత్తుకు వెళ్ళండి! ఆనాటి రుక్మిణీ దేవిని కూడ శ్రీ కృష్ణు డలాగే చేతుల్లో ఎత్తుకువెళ్ళి రథంలో కూర్చో బెట్టుకుని వెళ్ళాడట!" అంది రుక్మిణి గడుసుగా.

"పాపం! మీ నాన్న ఎంత ఆశాభంగం పొందాడో గానీ, నేను మాత్రం మంచి లాభం సంపాదించా!" నవ్వుతున్న సుదర్శన్‌ను రుక్మిణి తన ఎదలో దాచుకుంది.

## 40

"చల్లని వెన్నెల ఎంత ఆహ్లాదకరంగా వుందో చూడు లలితా!" లలిత వులక లేదు, పలక లేదు. కృష్ణమోహన్ కళ్ళు కోపంతో నిప్పులు చెరిగాయి.

"లలితా! నీ చిరాకులూ, పరాకులూ కట్టిపెట్టు! నీ మనస్తత్వాన్ని బాగా తెలుసుకున్నాను. విపరీతమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కొందరు స్త్రీలకి కేవలం అహంకారాన్ని, విచ్చలవిడితనాన్నీ మాత్రమే ప్రసాదిస్తాయని, నీ వల్ల రుజువైంది! కానీ అందరూ నీలాటి స్త్రీలే వుండరు. మురళితో నీ ప్రవర్తన తెలిసీ, తెలియనట్లు గంభీరంగా వున్న రాధలాంటి ఉత్తమ గృహిణులూ వున్నారు. నా హద్దులేని అనురాగం, నీలో నామీద చులకన భావాన్నే పెంచింది. అందుకే ఇక నిన్ను హద్దులలో పెడతాను! నేను ప్రక్కనలేకుండా, నువ్వు ఎక్కడికీ, చివరకు షాపింగ్‌కు కూడా, వెళ్ళటానికి వీల్లేదు. అర్థమయిందా?"

ఏదో చెప్పబోతున్న లలిత కేసి చూస్తూ సింహంలా గర్జిస్తూ

"నాలోని మంచి తనాన్ని రూపు మాపి, నాలో నియంతృ భావాలనే రెచ్చ గొట్టావ్! అనుభవించు!" అంటున్నాడు కృష్ణమోహన్.

పిల్లిలా తల వంచుకు వెళ్ళింది లలిత.

# 41

"ఓహ్! తానొకటి తలిస్తే దైవ మొకటి తలుస్తుందంటారు ఇదే కాబోలు సుబ్బూ!" అన్నాడు సీతాపతి వెన్నెలలోకి శూన్యంగా చూస్తూ.

"ఏమిటి?" నిర్లిప్తంగా అడిగింది సుబ్బమ్మ.

"ఆఁ! ఇప్పుడేం కొంపలు మునిగి పోలేదులే! మురళిని వళ్లో వేసుకుని పెళ్ళాడుతుం దనుకున్నాను మన రుక్మిణి! సుదర్శనాన్ని రిజిష్టరు పెళ్ళి చేసేసుకుంది. ఆఁ! ఎవడో ఒకడు! లక్షణంగా చదువుకున్నవాడూ, ఉద్యోగం చేసుకుంటున్నవాడూ, పైసా కట్నం లేకుండా తేరగా దొరికాడు. నా కంతే చాలు! పెద్దదాని బెడద వదిలి పోయింది. లేకుంటే. ఈరోజుల్లో ఆ మాత్రం అల్లుణ్ణి మనం సంపాదించాలంటే, ఎంత ఖర్చయ్యేదో తెలుసా?" అన్నాడు భార్యవేపు సాభిప్రాయంగా చూస్తూ.

"చాల్లెండి! చెప్పుకోవటానికి సిగ్గులేక పోతే సరి. తండ్రి నిర్వాకం, కూతురి ఘన కార్యం!" రుసరుస లాడింది సుబ్బమ్మ.

గాజు గ్లాసు బద్దలు చేసినట్లు, వెన్నెల విరిగి మీద పడేలా భొళ్ళు భొళ్ళున నవ్వాడు సీతాపతి హాయిగా.

# 42

కొళ్ళు పడిపోయి. మంచంలో పడివున్న గోపాలకృష్ణయ్య దగ్గరకు అన్నం కలుపుకు వచ్చింది జగదాంబ.

"పక్కింటి విశాలాక్షమ్మ చచ్చిపోయిందటే పాపం! తల గొరిగించి ముసుగు వేసినా, నే పెరట్లోకి వెళ్ళినపుడల్లా నా వేపు చూచి నవ్వేది పిచ్చి ముండ!" అన్నాడు కళ్ళు చికిలించి నవ్వుతూ.

అన్నం కలిపిన గిన్నె పక్కన పెట్టి, నుదుటి మీద చేత్తో కొట్టుకుంది జగదాంబ. "హయ్యో రాత! ఓ వేపు కాలం ముంచుకు వస్తుంటే, ఇంకా ఆ వెధవ ఆలోచనలేనా? రామనామం జపించండి. పుణ్యం వస్తుంది." అంది భర్త వేపు జాలిగా చూస్తూ.

గోపాలకృష్ణయ్య వక్రంగా నవ్వాడు- 'రా' అని పలికేటప్పుడు మనలోని పాపాలన్నీ తెరచిన మననోటి ద్వారా బయటికి వెళతాయి. అవి మళ్ళీ తిరిగి మనలో ప్రవేశించకుండా, "మ" అంటూ నోరు మూసుకుంటాము. ఇదీ 'రామ' శబ్దోచ్చారణలోని సూక్ష్మం. 'రామ' అంటే 'స్త్రీ' అనే అర్థం కూడా వుంది. 'రామా రామా' అంటే రామల (స్త్రీల) విషయంలో ఎలా ప్రవర్తించినా పాపాలేవీ నా కంటవు. కాబట్టి 'రామా', 'దగ్గరకురా' అని అర్థం వస్తుందట.... అవునా?" అన్నాడు అలాగే నవ్వుతూ.

రామనామంలోనుంచి భర్త బయటికి తీసిన కొత్త అర్థాన్నీ, ఆయనగారి మనస్సు పని చేస్తున్న పద్ధతినీ గ్రహించిన జగదాంబ మరో మారు నుదురు కొట్టుకుంది.

"వల్లకాడు పిలుస్తోంది. ఇంకా యీ వెధవ అర్థాలూ, పెడర్థాలే తోస్తున్నాయా మీకు? పోనీ "నారాయణ" అంటూ భగవద్ధ్యానం చేసుకోండి!" అంది.

అందే గాని ఆమె మనస్సులో మళ్ళీ 'నార' అంటే 'పీచు' అనీ, 'అణా' అంటే 'కాసు' అనీ-వెరసి 'పీచు పీచు ...కాసు కాసు!' అంటూ కథ మొదలెడ్తాడేమో భర్త అని భయం వేసింది.

కానీ ఆమె ఊహించింది తప్పయింది. గోపాలకృష్ణయ్య ఆ కథ చెప్పలేదు. కానీ మరో ఉప కథ ఆయన స్మృతిపథంలో మెదిలింది. అది ఆయన ప్రయత్నం లేకుండానే నోటినుంచి వెలువడింది.

"అప్పట్లో జగం - నిన్ను నేను పెళ్ళాడిన కొత్తల్లో, మా అమ్మకు పేకలు తెచ్చి పెడుతుండే గొల్లవాళ్ళ అమ్మాయి వుండేది గుర్తుందా నీకు? దాని పేరు నారాయణి. అప్పుడు వూరింతగా పెరగ లేదు లేవే! మే మిద్దరం, అంటే- నేనూ, నారాయణా జొన్నచేలల్లో, జనప చేలల్లో...."

జగదాంబ నిట్టూర్చింది. "మీ ఖర్మ! ఇక నేనేం చెయ్యను!" అంది లోపలికి వెళూ.

# 43

సురేష్‌కు పాలిస్తూ, అవ్యక్తానందంలో మునిగి, పరవశించి పోతోంది రాధ.

ఓరగా చూస్తూ నవ్వాడు మురళి. "నీ మీద అలా వెన్నెల ప్రసరిస్తుంటే, అస్తమానూ ఇలాగే పిల్చుండి చూద్దా మనిపిస్తోంది రాధా!" అన్నాడు.

సిగ్గుతో, పమిట మరింతగా కప్పుకుంది రాధ.

"ఆ రోజు.... ఆ భయంకరమైన రోజు- మీరు కాబట్టి సరి పోయింది, మరో భర్త అయితే, నే చెప్పింది నిజమేనని నమ్మేవారా!

నన్ను మళ్ళీ స్వీకరించే వారా? ఇంత మధురమైన జీవితం మళ్ళీ నాకు లభ్యమయ్యేదా?'' అంది, కృతజ్ఞత కళ్ళలో వెల్లివిరుస్తుండగా.

మురళి నవ్వాడు.

''పిచ్చి రాధా! ఇది కథ కాదు. సినిమా అంతకంటే కాదు చూచిన దానికి పూర్వాపరాలు తెలియకుండా, తెలుసుకోకుండా, ఇతరులు చెప్పిన మాటలకు రుజువు లేకుండా, మజ్నూలా జుట్టు పీక్కోవటానికి, ఇదేం సినిమాలో ఓ గంట సేపు నటించే దృశ్యమా? ఇది జీవితం, డియర్ రాధా! జీవితమోయ్! నువ్వలా ఆ గదిలో వున్నావని తెలిసి, నాతో అబద్ధ మాడావని తెలిసి చలించిపోయా ననుకో! కానీ నువ్వు బయటకు పరుగెత్తుకు వచ్చిన వాలకం చూచి అయోమయంలో పడిపోయాను. లలిత ప్రోత్సాహమూ, ప్రత్యేకంగా నన్నక్కడికి తీసుకురావటంలో గల ఆంతర్యమూ అనుమానాస్పదంగా మిగిలి పోయాయి. లలిత మనస్తత్వం నాకు తెలిసీ, చంచలమైన మనస్సుతో, ఓ విధమైన ఆకర్షణకు లోనయ్యాను. బహుశా, ఆ రోజు నువ్వు వూరినుంచి రాకుంటే, నేను నైతికంగా దిగజారి పోయుండే వాణ్ణేమో!

''కానీ నువ్వు నన్ను దెప్పలేదు. సాధించలేదు. ఏమీ జరగనట్టే ఆదరంగా వున్నావు! అలాటి నువ్వు, ప్రయత్న పూర్వకంగా, తప్పు చేశావంటే ఎలా నమ్మటం? కారులో కృష్ణమోహన్ మాటలు నా వెన్ను చరిచాయి. నిజంగా అతగాడు దేవుటిలాటి మనిషి! అలాటి వ్యక్తికి ద్రోహం తలపెట్టి, మన దాంపత్యాన్ని ముక్కలు చేయాలని చూచింది లలిత. కానీ, అన్ని విధాలా పరాజితురాలైంది. నువ్వు నాకూ, రుక్మిణికీ చెప్పినదాంట్లో ఏ ఒక్కటీ అబద్ధం కాదని నా మనస్సాక్షికి తెలుసు. అందుకు రుజువేమిటో నే చెప్పలేను కానీ, నువ్వు నాకు కలలో అయినా ద్రోహం చేస్తావంటే, నేను నమ్మలేను. అందుకే నిన్నూ, నీమాటలనూ నమ్మాను. ఒకటి మాత్రం నిజం రాధా! రుక్మిణిలాటి ఆడపిల్లలు అరుదుగా వుంటారు. గడుసుతనం,

ఆత్మరక్షణ, వివేకము, సమయస్ఫూర్తి సమపాళ్ళలో రంగరించి సృష్టికర్త సృష్టించిన బంగారు తల్లి రుక్కు! అందుకే మన జీవితాలలోనేకాక, తన జీవితంలోనూ వెన్నెలపూలు వెదజల్లుతుంది."

"అవును" అంది రాధ, సురేష్‌కు జాగ్రత్తగా దుప్పటి కప్పి దోమతెర సరిచేస్తూ.

"అరె! కబుర్లలో పడిపోయానేమిటి? బాబు నిద్రపోయాడుగా, మరి నన్నూ నిద్రపుచ్చవూ?"

చిలిపిగా అంటున్న మురళి వేపు స్మితనయనాలతో చూచింది రాధ.

లోకమంతటినీ తన అమృత కిరణాలతో అలరిస్తూ, ఎందరి చిత్ర విచిత్ర మనస్తత్వాలనో ఆకళింపు చేసుకునే జాబిల్లి చల్లగా నవ్వుతూ, మెల్లిగా మబ్బుల మాటుకు వెళ్ళాడు.

—o—

# 1

"ఈ రోజు ఆదివారం. ఎందు కలా పెరడంతా గోతులు

—

అత్తగారి మందలింపుతో, ఊర్మిళ చేతిలోని చిన్నపలుగు తక్కున జారి క్రింద పడింది.

"ఇక్కడ గులాబి అంటు నాటుదామని...." గొణిగింది ఊర్మిళ మెల్లిగా.

"ఆదివారమే ముహూర్తం కుదిరిందా గోతులు త్రవ్వటానికి? పైగా గులాబి అంటు ఇక్కడ నాటితే, ఆ మొక్క పెద్దదైతే, త్రోవే నడిచేటప్పుడు ముళ్ళు తగులుకోవూ? ఏపనికైనా ఆలోచ నుండాలి-అనుభవం ఉండాలి." మీనాక్షమ్మ గద్దింపుగా అంది

అత్తగారి వాగ్ధోరణికి ముఖం చిన్నబుచ్చుకుంది ఊర్మిళ.

"అదేమంటే ముఖం మాడుపూ, ఏడుపూ! అనుభవంగల దాన్ని, పెద్దదాన్ని ఏదో చెబుతాను మనస్సుండ బట్టలేక, ఆ పైన నీయిష్టం! అశుభంగా గోతులే తీస్తావో, మరేం చేస్తావో ..." విసవిస లోపలికి వెళ్ళిపోయిందామె, అంతటితో తన పాత్ర పూర్తయినట్లు!

ఊర్మిళ నిర్లిప్తంగా నవ్వుకుంది. ఇక తన యిష్టమేమిటి! తను చేసేదేమిటి?

మెల్లిగా ఇంట్లోకి నడిచింది. భర్త మాధవరావు గదిలో పడుకుని ఏదో ఇంగ్లీషు నవల చదువుకుంటున్నాడు. వరండాలో మామగారు సీతాపతిగారు. గుమస్తా రామారావుతో, వ్యవసాయానికీ, వ్యాపారానికీ సంబంధించిన లెక్కల వివరాలు చర్చిస్తూ, కాగితాలలో

రామారావ్! ఇలా వ్రాశావ్?'' అన్నారు సీతాపతి గారు.

రామారావు క్షణకాలం నీళ్ళు నమిలాడు,

"అది... అది.... అలా రాయమని చిన్నబాబుగారు మాధవరావు గారు చెప్పారండీ!" అన్నాడు మాటలు తడబడుతూ

సీతాపతిగారు పెద్దగా నవ్వారు. వ్యంగ్యంగా లోపలికి చూపులు సారించారు. తలుపు వారగా, అప్పుడే అటు వస్తున్న కోడలి పమిటకొంగు కనిపించి గొంతు సవరించుకున్నారు.

"అది! అలా చెప్పు! మావాడి నిర్వాక మన్నమాట! నాకు తెలుసు వా డిలాటి అవతవకలే చేస్తాడని! అందుకేగా వ్యాపారం, వ్యవహారం, వ్యవసాయం, ఒకటేమిటి_అన్నీ నేనే స్వయంగా చూచుకుంటూంటా! ఏం చేస్తాం, రామారావ్. ఒకొక్కళ్ళ తలరాత! కొడుకు చేతికంది వచ్చినా, వయసు మళ్ళినా, వార్ధక్యం పైబడినా ఈ ఇహబంధాలు వదలవు. వదలించుకోవాలని చూచినా వదలవు.''

ఇక తర్వాత ఊర్మిళ వినలేదు. గబగబ మేడమీదకు పరుగెత్తి, తమ పడక గదిలో, పందిరి మంచం మీద పడిపోయింది. ఇంకా మామగారి వ్యంగ్యపు విసుర్లూ, గుమస్తా రామారావు నిర్లక్ష్యపు నవ్వూ, ఇన్నీ వింటూ విననట్లుగానే, తనను కాదన్నట్లు, పుస్తక పఠనంలోనే నిమగ్నమై వున్న భర్త నిరభిమానమూ- ఆమె వెన్ను పొడుగునా, ఒకదానివెంట మరొకటిగా ప్రాకటం మొదలెట్టి, శరీరమంతా జలదరింపజేశాయి. అలా ఎంతసేపు పడుకుందో ఆమెకే తెలియలేదు. క్రిందినుంచి అత్తగారి కంఠస్వరం తార స్థాయిలో వినిపించటంతో ఉలిక్కిపడిలేచి కూర్చుందామె.

''ఊర్మిళా! ఊర్మిళాదేవీ!''

ఒక్క ఉదుటున క్రిందకు పరుగెత్తుకువచ్చింది ఊర్మిళ. అ నరికే హాలులో పనిమనిషి, వంటమనిషి, పాలేర్లూ సమావేశమై వున్నారు.

''ఏం లాభం? వేలకు వేల కట్నాలు దిమ్మరిస్తామన్న వాళ్ళందర్నీ కాదని, కానీ కట్నం లేకుండా ఈవిడను కోడలుగా

మేము చెయ్యాల్సి వస్తుం దనుకోలేదు. ఖర్మ! దేనికైనా పెట్టి పుట్టాలి,'' అంటూ లెక్చరిస్తోంది మీనాక్షమ్మ.

నిరసనగా తన వేపు చూస్తున్న అన్ని జతల కళ్ళను తప్పించుకుని, ''నిద్ర పట్టింది'' అంటూ క్షమాపణ చెప్పుకుంటున్నట్లుగా గొణుగుతూ. వంటింటి వేపు పరుగెత్తింది ఊర్మిళ. నిజానికక్కడ తనేంచెయ్యాలో బోధపడలే దామెకు. పాలకుండ మాత్రం ఓవేపుగా ఒరగబెట్టివుంది. చేమిరంటు వెయ్యాలేమో? మరోవేపుగా కత్తిపీటా, తరగాల్సిన వంకాయలు కాపిన్ని. మరో గిన్నెలో తరిగిన ముక్కలూ కనిపించాయి.

కాయలు తరుగుదామా అనుకుంటున్నంతలో- అత్తగారు. సభ చాలించి, వంటమనిషితో వంట ఇంట్లోకి వచ్చింది. ''కూర తరగనా? చేమిరంటు వెయ్యనా?'' అంది బెదురుతూ ఊర్మిళ.

''ఇంకానయం! చేమిరి వేశావు కాదు. చేమిరంటు ఎక్కువగా వేస్తావు నువ్వు. పుల్లగా తయారౌతుంది పెరుగు. మా మాధవుడికసలు పుల్లపెరుగు సయించదు. అది సరే. పాలకుండ కిందపెట్టె కుదురు చూశావా నువ్వు?'' అంది.

''ఆ! దోవలో పడేసి, తడిసి నానివుంటే, అలా ఎండలో వేశాను. తెస్తా నుండండి!'' పెరట్లోకి వెళ్ళి బాగా తడారి శుభ్రంగా వున్న గడ్డి చుట్టకుదురు తెచ్చియిచ్చింది ఊర్మిళ.

''అది కనిపించకనే ఇల్లంతా వెతికి వెతికి చచ్చాం- నేనూ మంగమ్మా!'' విసురుగా కుదురు లాక్కుని, పాలకుండ దానిమీద పెట్టి, చేమిరి వేసింది మీనాక్షమ్మ.

''ఇంకేదేనా పనిచూచుకో!'' అని కూడా అంది. వంటావిడ మంగమ్మ ముసిముసిగా నవ్వుకుంటూ, పొయ్యి దగ్గరకు వెళ్ళిపోయింది. ప్రతి చిన్న విషయానికి ఇంత రభస, పనివాళ్ళందరి ముందూ ఇలా చులకన చెయ్యటం ఎందుకో, ఏమలవాటో బోధ పడలేదు ఊర్మిళకు.

మాటైనా తనకు చాటుగా చెప్పవచ్చుగా? "పెద్దమ్మగారు పుణ్యాత్ము రాలు! ఎట్లయినా వారి ధర్మగుణం ఎవరి కొస్తుందీ?" అని పనివాళ్ళు తన ఎదురుగానే తనని చులకనగా మాట్లాడటం, ఊర్మిళకు సహించ రానిదిగా వుంది.

మరింత ఎక్కువగా పెట్టడం ప్రారంభించింది ఊర్మిళ.

"మాడమ్మా ఊర్మిళా! చిన్నదానివి నీకుతెలీదు, సంసారపు లోతు పాతులు! మరపటం సులభం, మాన్పటం కష్టం! ఈ రోజు వుంది కాదా అని చిత్తం వచ్చినట్లు పెట్టావంటే, రేపొద్దున ఓ ముద్ద తగ్గితే అల్లరిచేసి వదులుతారు అలగాజనం." అంది చాటుగా మరో రోజు.

ఊర్మిళ నిర్ఘాంతపోయింది. ఆమె ఈ వరసకి తట్టుకో లేక పోయింది. మొత్తం మీద తనకు కాలికీ, మెడకువేసి, అందరి ఎదుటా "అమ్మాయి కింకా అనుభవం రాలేదు. ఇంటిపెత్తనం ఇవ్వటం పొరబాటయింది." అని నిరూపించి మరీ పెత్తనం తిరిగీ పునరుద్ధరించుకుందావిడ.

అలాగే మామగారూను! "ఈ లెక్కలు ఇలా వ్రాయించా వేమిటి మాధవా? అలా వుండకూడదు. బొత్తిగా లౌక్యం తెలీదు నీకు." అంటూనే గుమాస్తాల ఎదురుగానే మాధవరావును మందలించటం సాగించారాయన. మాధవరావు ఉలకడు. పలకడు. అంతకు మించితే, 'మీరే చూచుకోండవన్నీ' అని ఏ గోడకో చెప్పినట్లు చెప్పి, బయటకు వెళ్ళిపోయేవాడు. ఓ సుప్రభాతాన మామగారు కూడా, తన కొడుకింకా ఇలాటి విషయాలలో పరిణతి చెందలేదని ప్రకటించి, తిరిగీ బాధ్యత భుజస్కంధాల మీద కెత్తుకున్నారు.

"ఇదేమిటి! నా విలువేమిటి? నా స్థానమేమిటి?" అని ప్రశ్నించింది ఉండబట్టలేక ఓ రోజు భర్తని ఊర్మిళ.

మాధవరావు సరదాగా నవ్వాడు. "ఏం? నీ విలువకూ, నీ స్థానానికీ ఏ మొచ్చిందిప్పుడు? నా భార్యవు, అర్ధాంగివి!"

"కాదు... కాదు....ఓ పనిమనిషికున్న విలువకూడా లేదు, ఓ పంజరంలోని చిలకకున్న స్వేచ్ఛకూడా లేదు నాకు!" ఆవేశంగా అంది తను.

"ఏమో! నువ్వు చిత్రంగా మాట్లాడుతావు. నాకు మాత్రం ఇలాగే హాయిగా వుంది. ఎలాగా, అమ్మా, నాన్నగార్ల తర్వాత ఈ బరువులూ, బాధ్యతలూ తప్పవు మనకు. ఈలోగా కులాసాగా, బాధ్యతారహితంగా జీవితం గడపడంలోనే నాకు ఆనందం వుంది. భోజనానికీ, జీవితావసరాలకూ వెదుక్కో నవసరంలేదు ఉద్యోగాల కోసం, ఇంటర్వ్యూలూ, రెకమండేషన్సూ అంటూ పరుగులు తీయాల్సిన పనిలేదు. ఇంతకంటే ఇంకేం కావాలి జీవితానికి?"

"అంతేనా, అంతేనా, మీకు సొంత ఆలోచనలూ, ఆశయాలూ, పద్ధతులూ, సరదాలూ అంటూ ఏవీలేవా? ఈ పంజరపు బ్రతుకే, ఓ విధమైన బానిస బ్రతుకే మీకు హాయిగా వుందా?" ఉద్రిక్తంగా అంది తను.

మరింత హాయిగా నవ్వాడు మాధవరావు- "నాకీ జీవితమే హాయిగా వుంది. ఏవేవో సెంటిమెంట్స్‌తో తల పగలకొట్టుకోవడం నా కిష్టమూ లేదు, నా తత్వమూ కాదు. అందుచేత నువ్వీ జీవితానికి ఏ పేరు పెట్టుకున్నా నాకభ్యంతరం లేదు."

భర్త తత్వం స్పష్టంగా తేలిపోయింది తనకు. పెద్దల చాటున, తనకేలాటి బాధ్యతా, బరువూ, ఆర్జన అవసరం లేకుండా బ్రతుకు గడిపి వేయాలన్న ధ్యేయం అతనిది. అందులో రోషపడవలసింది గానీ, అభిమాన పడవలసిందిగానీ, అవమాన పడవలసిందిగానీ ఏమీ లేదనే అతడి నిశ్చితాభిప్రాయం. అలాగే అతడి తల్లి దండ్రుల కూడా కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. ఉన్న ఒక్కగా నొక్క కొడుకును తమనుంచి దూరంగా వెళ్ళకుండా చూచుకుంటే, కోడలు మరెక్కడికీ వెళ్ళేమార్గం వుండదు. జీవితాంతం, కోడంత్రికం, పెద్దరికం చెలాయించ వచ్చు. పది మందిలోనూ "ఆహా! ఏంఅదృష్టం! పుణ్యదంపతులు! కొడుకు కోడళ్ళ సేవలతో, తమ మాట కద్దు

ఇంకేం పనిచెయ్యాలి? చేసేందు కేముంది? పాదులు చేస్తే - వారాలూ, వర్జ్యాలూ, పెరగబోయే చెట్లూ, గుచ్చుకోబోయే ముళ్ళూ, ముందుగానే అడ్డుగా నిలుస్తాయి. స్థిమితంగా ఏ పుస్తకమేనా చదువుకుందామంటే, ఇందాక జరిగినంత రభసా జరుగుతుంది. చివరకు పాలలో చేమిరంటు పెట్టడంలాటి పనులకు గూడా 'అనుభవం' కావాలి! స్వతంత్రించి తాను చెయ్యటం మాట అలా వుంచి, పనివాళ్ళకూ్కూడా చెప్పకూడదు ఏదేనాపని! అథవా చెప్పినా, వెంటనే అత్తగారు కల్పించుకుంటుంది. 'దాని మొహం! అసె ... చెప్పటం మీరు చెయ్యటం .. నిన్నగాక మొన్నవచ్చింది, దాని కే ం తెలుసు పనిలో సులువు బలువులు? వెళ్ళండి ! వెళ్ళండి! చేసినవరకూ చాలు, మీ పన్లు మీరు చూచుకోండి!" అనేస్తుంది పనివాళ్ళతో.

అలాటి సమయాలలో సున్నితమైన ఊర్మిళ మనస్సు గిలగిలలాడి పోతుంది. ఈయింట్లో తన స్థానమేమిటి? తన విలువ ఏమిటి? కట్నం తీసుకురాని ఈ కోడలు ఓ పిండిబొమ్మా? ఓ పెంపుడుజంతువా? పంజరంలోని ఓ చిలకా? ఏమిటి తన స్థానం?

అలాటప్పుడే ఇలా ఎందుకు జరిగిందన్న ఆలోచన కూడా వస్తుంది. తన తండ్రి తనకు కట్నం ఇవ్వలేని పరిస్థితుల్లో వున్నప్పుడు, తన అందం చూచి. కోరి వివాహానికి సమ్మతి తెలియజేశాడు(ట) మాధవరావు.

"కట్నంతో వచ్చే పిల్లలలో అహంకారం వుంటుంది. లేనివాళ్ళలో వినయం వుంటుంది. అందుకే మీ పిల్లకావాలి మాకు!" అని చెప్పారు మీనాక్షమ్మ, సీతాపతిగార్లు.

తండ్రి పొంగి పోయాడు. తల్లి ఆనందానికి అవధుల్లేవు. అందమూ, చదువూ, ఆస్తీ, వ్యాపారాలతోబాటు పాడిపంటలూ వున్న మాధవరావులాటి వ్యక్తికి భార్యగా కావటం తన అదృష్టంగానే భావించింది ఊర్మిళ.

పెళ్ళయిన కొత్తలో ఓరోజు పనివాళ్ళందరి ఎదుటా ఇంటి పెత్తనం తన కప్ప చెబుతున్నందుకు గుర్తుగా, ఆమె రొండిన

వున్న తాళాల గుత్తి తన చేతికిచ్చింది అత్తగారు. "ఊర్మిళా! కోడలివైనా, కూతురివైనా నువ్వే మాకు ఈ ఇంటినీ, పనివాళ్ళనూ, పాడి పంటల్నీ, పశువుల్నీ ఎలా చూచుకొంటావో ఇకమీద! నా కంటే ఎక్కువగా మంచిపేరుకూ, మన్ననకూ పాత్రురాలివి కావాలి సుమా!" అని చెప్పింది గంభీరంగా.

"ఈ బాధ్యత సక్రమంగా నిర్వర్తిస్తాను. మీ నమ్మకాన్ని నాశనంచెయ్యను!" అనుకుంది ఊర్మిళ మనస్సులో. తనకు పెద్దల అండకూడా వుందని మురిసి పోయింది ఊర్మిళ.

అలాగే, వ్యాపార సంబంధమైన కాగితాలు ఇచ్చి. "నీ యిష్టంరా బాబూ ఇక! రామారావుగారూ, అబ్బాయికి అన్ని బాధ్యతలూ అప్పగించేశానండీ. ఇక నేను, మా ఆవిడ భగవన్నామ సంకీర్తనం చేసుకుంటాం నిశ్చింతంగా" అని సీతాపతిగారు అంటూంటే, తొణుకూ బెణుకూలేకుండా కాగితాలు పుచ్చుకుని తన గదిలోకి వెళ్ళిన భర్తను చూస్తూ, 'ఇదేం మనిషి! ఈయనగారి ముఖంలో ఏ భావమూ కనిపించదేం?' అనుకుంది ఊర్మిళ ఆశ్చర్యంగా. ఆ మాటే అడిగింది మాధవరావును వీలు చూచుకుని.

"చూస్తూండు. ఇదంతా మరేమీకాదు-ఆ తరం వారి సహజ లక్షణాలతో మప్పుకు ఒకటి మాత్రమే! అంచేత నాకెలాటి భావాలూ కలగటం లేదు." అన్నాడు నిర్లిప్తంగా. ఆ మాటలకు అర్థం నెల తిరక్కుండానే బోధపడింది ఊర్మిళకు.

పనివాళ్ళ పెట్టుపోతలు మొదలు అతిథి మర్యాదవరకూ పేరు తనదీ, పెత్తనం అత్తగారిదీ. "చూడమ్మా ఊర్మిళా! పనివాళ్ళకి మరో ముద్ద ఎక్కువవెయ్యాలి! బొత్తిగా పట్నవాసాల్లోలా గిరిగీచి పెడితే బాగుండదు. పనివాళ్ళు కలకల్లాడుతున్నప్పుడే మన ఇల్లూ, సిరిసంపదలూ పాలపొంగులా పొంగేది," అంటూ అనవసరంగా కల్పించుకుని పనివాళ్ళ ఎదురుగానే తనని మందలిస్తుంది.

తనేం తక్కువగా పెట్టడంలేదు. ఆవిడ పెడుతున్నట్లే. ఇంకా మాటాడితే మరో ముద్ద ఎక్కువగానే పెడుతోంది. పోనీ ఆ

లేకుండా జరుపుకుంటున్నారు!'' అనిపించుకోవచ్చు. అననివాళ్ళచేత అదేపనిగా ఇంత తిండో, మరి కాసిన్ని గింజలో పెట్టయినా అని పించుకోవచ్చు.

ఇక పనివాళ్ళ తత్వం మరింత విచిత్రంగా వుంటోంది- "పెద్దమ్మగారూ, పెద్దయ్యగారూ- మా దొడ్డవారండీ! మీ చెయ్యినరం లేనిదండీ!'' అంటూ వుబ్బించి, తబ్బిబ్బుచేసి, ఓపినంతా గుంజు తుంటారు.

''చిన్నమ్మగోరూ, చిన్నయ్యగోరూ! గంగిగోవులండీ! పెద్దోళ్ళ అజమాయిషీకి తాము గా బట్టి తట్టుకుంటున్నారు.'' అంటూ చాటుగా, మాటుగా, ఏదో ఒక వంకని, గింజలో, డబ్బులో ఇమ్మని పీడిస్తారు.

మొత్తంమీద అందరి కందరూ అవకాశవాదులు. ఎవరి స్వార్థం వారిది. అందరూ కలసి తన చుట్టూరా అందమైన చక్రం బిగించి వేశారు. ఆ క్షణమే తెలిసింది తనకు- తనఆలోచనలూ, ఆశయాలూ కూడా పంజరంలోని పక్షుల్లా మారాయని.

''ఊర్మిళా! ఊర్మిళా! నాక్కాసిని మంచి నీళ్ళు ఇస్తావూ!'' మాధవరావు పిలవటంతో ఆలోచనా తరంగాల్లోంచి ఒడ్డుకు వచ్చింది ఊర్మిళ.

# 2

డియర్ ఊర్మిళా,

ఎలావున్నావు? సంసార సాగరంలో మునిగి తేలుతున్నావా? నీ యీ స్నేహితురాలు గుర్తుందా? ఒక్కసారి రావోయ్ ఇక్కడికి. నా ఈ ఇంద్రధనస్సులాటి జీవితాన్ని నీకు పరిచయం చెయ్యాలని వుంది.

అన్నట్లు, మనతోబాటు చదువుకున్న అన్నపూర్ణ యిక్కడే వుంది. బ్యాంకిలో ఉద్యోగం చేస్తోంది. ముగ్గురం కలిపి కొన్నాళ్ళు సరదాగా గడుపుదాం. తప్పక వస్తావు కదూ? ఈ కవరులోనే మీ శ్రీవారికి కూడా ఓ వుత్తరం_నా ఆహ్వానం, పంపుతున్నాను. తప్పక రావాలి సుమా!

ఒకనాటి రుక్మిణి-
ఈనాటి 'తార'

స్నేహితురాలి ఉత్తరం ఊర్మిళను ఆనందపు అవధులను దాటించింది. గతించిన మధురస్మృతులను గుర్తుకు తెచ్చింది.

తాను, ఇప్పుడు సినీతారగా మారి 'తార'గా పేరుమార్చు కున్న రుక్మిణి, అన్నపూర్ణ, ఒకేచోట చదువు కున్నారు. ముగ్గురి అంతస్తులూ, కుటుంబ పరిస్థితులూ, ఇంచుమించు ఒకటిగానే వుండేవి. మధ్యతరగతి కుటుంబాలూ, లెక్కకు మించిన సంతానాలలో తాము ముగ్గురూ ఒకళ్ళు కావటంతో, ముగ్గురి సమస్యలూ ఒక్కలానే వుండేవి. ఏక్షణంలో నయినా, తమ చదువులు ఆగిపోవచ్చు. ఏక్షణాన్నయినా ఏ రెండో పెళ్ళివాడికో, మూడోపెళ్ళివాడికో తమని ముడిపెట్టెయ్యవచ్చు. అలా దిన దిన గండంగా సాగుతున్న చదువు లతో స్కూల్ ఫైనల్ వరకూ నెట్టుకొచ్చారు. పరీక్షలు రాసిన తర్వాత, ప్యాసైన తర్వాత ఎవరి జీవితాలకూ ఓ దరీ తెన్నూ కనిపించలేదు. కారణం-పెద్దల కట్నా లిచ్చుకోలేని నిస్సహాయతా, పైకి చదివించ లేని ఆర్థిక సమస్యలూ! సంవత్సరంపాటు కుట్టుసెంటరుకు వెడుతూ కలుసుకునేవారు.

హఠాత్తుగా ఓ రోజు మాధవరావు వాళ్ళు పెళ్ళిచూపులకు రావటం, కట్నం వద్దనటం, వివాహం నిశ్చయం కావటం, క్షణాల మీద జరిగిపోయింది తన విషయంలో.

అన్నపూర్ణ విషయంలోనూ అంతే. సెకండరీగ్రేడ్ ట్రెయినింగ్ ప్యాసైన నారాయణరావు, కట్నం కోరకుండానే అన్నపూర్ణను వివాహం చేసుకున్నాడు. మద్రాసులో టీచరుగా వుంటూండేవాడు. అయితే అన్నపూర్ణ_మంచి పట్టుదలా, ఆత్మవిశ్వాసంగల మనిషి.

భర్తను బలవంతపెట్టి పై పరీక్షలకు కట్టించింది. తనూ చదివింది. ఎలాగై తేనేం, ఇద్దరూ గ్రాడ్యుయేట్లు అనిపించుకున్నారునాలుగేళ్ళలో. నారాయణరావు బి.ఇడి. టీచరుగా మారాడు. అన్నపూర్ణ టైప్ పరీక్షలు కూడా ప్యాసై బ్యాంకిలో ఉద్యోగం సంపాదించుకుంది. ఇద్దరు పిల్లలతో హాయిగా సంసారం సాగిస్తోంది అన్నపూర్ణ.

ఇక మిగిలి పోయిందల్లా రుక్మిణి. అనుకోకుండా తనకూ, అన్నపూర్ణకూ పెళ్ళిళ్ళయిపోవటమూ, అందునా కట్నం కోరని వరుళ్ళు రావటంతో, రుక్మిణి తల్లిదండ్రులు రుక్మిణిని అస్తమానం దెప్పేవారు.

"వాళ్ళిద్దరూ అదృష్టవంతురాళ్ళు. కాబట్టే, కట్టుకు పోయేంత ఆస్తి, అందం, చదువున్నవాడూ అయిన మాధవరావు ఊర్మిళను కోరి చేసుకున్నాడు. అన్నపూర్ణకూ ఏ కొరతాలేదు. నువ్వా వున్నావు. ఎందుకూ, మాపాలిట గుదిబండలా! అదేం ఖర్మో! చూడవచ్చిన వారల్లా మూడు వేలిస్తారా, నాలుగువేలిస్తారా అని నిలదీస్తున్నారు. దేనికైనా పెట్టి పుట్టొద్దూ!" అంటూండే వారు.

చదువులేక, ఇంట్లో కన్నవారే అలా ఈసడించుకుంటూంటే ఏ దిక్కూ తోచని రుక్మిణి కుమిలి కుమిలి ఏడ్చేది. ఆరునెలల్లో చిక్కి సగమైంది. మద్రాసులో వుంటున్న రుక్మిణి బాబాయి ఒకాయన ఏదో పని మీద వచ్చి- రుక్మిణినీ, రుక్మిణి పరిస్థితుల్నీ, ఆమె మానసిక బాధనూ గమనించి, కొన్నిరోజులు తనదగ్గర వుంచుకుంటానని ఆమె తల్లిదండ్రుల్ని ఒప్పించి, తనతో తీసుకు వెళ్ళాడు. ఆయన ఉద్దేశం, మద్రాసులో వున్న ఏ 'మాంటిస్సోరీ ట్రయినింగ్'లోనో చేర్పించా లని, డబ్బు సర్దుబాటు చూసుకుని ఆ ప్రయత్నం చెయ్యాలని నిర్ణ యించుకున్నాడు.

ఈ లోగా సిటీ చూపిస్తుండేవాడు రోజూ. అలాగే స్టూడియో లకూ తీసుకెళ్ళాడు. అంతవరకూ నివురు గప్పిన నిప్పులావున్న రుక్మిణి అదృష్టరేఖ అప్పుడు బయట పడింది. అనుకోకుండా ఓ సినీ నిర్మాత, దర్శకుడూ ఆమెను చూడటం, దిగులుతో చిక్కి సగమై వున్న రుక్మిణిలో—కొత్త అందాలూ, ఫోటో జెనిక్ ఫేస్ వాళ్ళను

రుక్మిణిని తమ పిక్చరులో బుక్ చేసుకున్నారు. ఇదంతా రుక్మిణి తలి దండ్రులకు తెలియదు. తెలిశాక మండి పడ్డారు. కానీ ఇక చేసేందు కేమీ మిగల్లేదు. ఆ సరికే రుక్మిణి 'తార' గా మారిపోయింది. అన్ని పేపర్లూ, సినిమా పత్రికలూ 'తార' గా పేరు మార్చుకున్న రుక్మిణి ఫోటోలూ, జీవిత చరిత్ర తాలూకు 'కొత్త కథలూ' ప్రచురించడం మొదలెట్టాయి.

మొదట రుక్మిణికి ఇష్టంలేదు. కాని డబ్బూ, కీర్తీ కలిసి కట్టుగా వస్తామంటే కాదని కాలదన్నుకుని, అస్తమానం పరిష్కారం లేని సమస్యల తోరణాల్లాటి బ్రతుకులోకి జారటం ఇష్టంలేక పోయింది.

సంవత్సరం తిరిగేసరికి రుక్మిణి పెద్ద 'తార' అయిపోయింది. ఆరేళ్ళు తిరిగే సరికి 'రుక్మిణి' అంటే ఎవరో తెలియలే దెవరికీ— ఆమె 'తార'గా మాత్రమే మిగిలిపోయింది

ఈ నాడు రుక్మిణి ఉత్తరం రాసింది.అప్పుడప్పుడూ వ్రాస్తూనే వుంటుంది. కానీ యీ నాటి ఈ వుత్తరంలోని ఆహ్వానం తను తిర స్కరించ కూడదు అనుకుంది ఊర్మిళ.

త నెలా వుం దిప్పుడు? అన్నపూర్ణలా ఉద్యోగంచేస్తూ, హాయిగా ఆర్థిక స్వాతంత్ర్యంతో, అన్నిరకాల స్వేచ్ఛలతో బ్రత కటం లేదు. రుక్మిణిలాటి వింతరంగుల జీవితమూ కాదు. ఎదుగూ బొదుగూ లేని గొర్రెతోక జీవితం! మార్పులూ, చేర్పులూ లేని మామూలు జీవితం! స్వేచ్ఛా, హాయీలేని ఖైదీలాటి జీవితం! అయితే ఇది ఖరీదైన బంగారు పంజరం!

మొన్న నొకరోజు తను దిగులుగా కూర్చునివుంటే, పని మనిషి కూతురు రాములు – తన వయసుదే, తనతో చనువుగా వుంటుందెప్పుడూ–అడిగింది "ఎందుకమ్మగారూ,దిగులుగావుండారు?" అంటూ."ఏం చెప్పను? నీలాటి హాయి నాకెలా వస్తుంది?"అంది తను. రాములు చిత్రంగా తనవేపు చూచింది. "నాలాటి హాయి! ఏటమ్మ గోరూ! చిత్రంగా మాట్లాడుతారు! ఏపూట కాపూట కూటికి వెతు

ఎవరికి, ధరమరాజులాటి చినబాబుగోరున్నారు. ఇంటినిండా నౌకర్లూ, చాకర్లూవున్నారు తిని. పారేసినంత సిరుంది....'' ''తలకు మించిన ఆలోచనలూ వున్నాయి ..'' నవ్వుతూ మాట పూర్తిచేసింది తను.

''సాల్లెండి .. ఓ బుల్లి బాబుగోరు పుట్టారంటే, ఈ ఆలోచన్లూ, గీలోచన్లూ అన్నీ ఎగిరిపోతాయి!'' కిలాకిలా నవ్వుతూ వెళ్ళిపోయింది రాములు.

అవును — వాళ్ళకెలా అర్థమౌతాయి తన ఆలోచనలు? కొన్నాళ్ళు ఎక్కడికేనా పారిపోవాలి. స్వేచ్ఛావాయువులు పీల్చుకోవాలి. ఎక్కడికి? ఎక్కడికి? అంటూ మనసు తహతహ లాడుతున్నంతలో ఈ ఉత్తరం వచ్చింది. తప్పక వెళ్ళాలి.

''ఏమిటి ఊర్మిళా! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?'' దగ్గరగా వచ్చిన మాధవరావు అడిగాడు. ఆలోచనలు ఎక్కడి వక్కడ ఎగిరి పోయాయి.

''రుక్మిణి ఉత్తరం రాసింది. మీకూ్కడా!'' కవరు అతగాడి చేతి కిచ్చింది.

''రుక్మిణి.... 'తార' కదూ!'' ఉత్తరం చదివాడు.

''అలాగా? వెళుదువుగానీ.... అమ్మనూ, నాన్నగారినీ అడుగు తాను. ఏమంటారో?'' సందేహిస్తూ వెళ్ళిపోయాడు.

క్షణకాలం వుండేలు దెబ్బతిన్న పక్షిలా గిలగిలలాడిం దామె హృదయం.

అంతకంటే, 'నాకిప్పుడు వీలుగాదు. మరోసారి చూద్దాం!' అని వుంటే తనెంతో సంతోషించేది. తమ యిద్దరికి మాత్రమే సంబంధించిన ప్రతి చిన్నవిషయం కూడా పెద్దవారితో సంప్రతించి, తుదినిర్ణయం వారికే వదిలి పెట్టాలన్న తత్వం, అది పెద్దలయెడలగల గౌరవాన్ని మాత్రమే సూచించదు. స్వయం నిర్ణయం చేయలేని, పిరికితనాన్ని కూడా సూచిస్తుందేమో!

వారం రోజులుగా ఊర్మిళ ప్రయాణం విషయమై తర్జన భర్జనలు సాగుతున్నాయి.

"రంగులు పులుముకుని, తైతక్కలాడే దాని దగ్గరకు, మన బోటి మర్యాదస్థులం వెళ్ళడమేమిటి? ఏదో స్నేహితురాలు కాబట్టి రమ్మని రాసింది. వీలుకాలేదని ఓముక్క రాసివేస్తే సరిపోలా?" అంది మీనాక్షమ్మ.

"బాగా డబ్బుంది కదూ! స్నేహితురాలంటే గౌరవమే కదూ?" అన్నారు సీతాపతిగారు, ఊర్మిళ వంక సాలోచనగా చూస్తూ 'శవ పంచాయితీ'లాటి తర్క, వితర్కాలు తల బ్రద్దలుకొడుతున్నాయి. దానికి తోడు రుక్మిణి నంత చులకనగా తూలనాడటమూ ఆమెకు పెద్దబాధగావుంది.

సినీతార అయినంత మాత్రాన,డబ్బు పుష్కలంగా వున్నంత మాత్రాన, ఆమె అపవిత్రురాలనీ, ఆమెకు మమతలూ, స్నేహాలూ వుండవనీ-కేవలం శరీరప్రదర్శన చేసే యంత్రమనీ ఎందుకు వీళ్ళు ఊహిస్తారో అర్థంగావటం లేదు.

మాధవరావు మెల్లిగా అన్నాడు-"ఊర్మిళంటే రుక్మిణికి చాలా యిష్టం. వెళ్తే, బహుశా చీరెలూ, నగలూ,చాలా, చాలా బహుమానాలు ఇవ్వొచ్చు." చివరిమాటలు ఓరగా తలిదండ్రులకేసి చూస్తూ అన్నాడు.

ఊర్మిళ తలమీద పిడుగు పడ్డట్లైంది. అంతేనా! స్నేహం విలువ అంతేనా?

ఒక వేళ ఈయనగా రూహిస్తున్నట్లు రుక్మిణి తనకు చీరెలూ, నగలూ, బహుమతులూ ఇవ్వకపోతే? ఆ ఆశతోనే, ఆ స్వార్థంతోనే తను వెళ్తుందా? ఇంతకు మించిన అసహ్యం, అవమానం మరొక టుందా? ఛీ! తనువెళ్ళదు....ఇంత స్వార్థం, ఇంత సంకుచితత్వం, వెంటవేసుకుని తను వెళ్ళలేదు....

ఒక్కసారిగా ముఖం వెలిగిపోయింది మీనాక్షమ్మకు కొడుకు మాటలతో— "అలా చెప్పావు కావేంరా మాధవా? డబ్బు బాగాగల మనిషి-బహుశా 'టెక్కు' వుంటుందేమోనని, భయపడ్డాను. అంతే

గానీ, అంతగా స్నేహంగల మనిషిని ఎలా పోగొట్టుకుంటాము? ఊర్మిళ తప్పక వెళ్ళాల్సిందే!"

"అవును. ఓ వస్తువు సంపాదించుకున్నా, పోగొట్టుకున్నా ఈ వయసులోనేకదా! అందులోనూ బాగా డబ్బుగల వారిని మంచిగా అట్టే పెట్టుకోవడం ఎందుకైనా మంచిది ముందు ముందు.'' అన్నారు సీతాపతిగారు.

"ఊహూ(, నేను వెళ్ళను!'' తిక్కగా అరుద్దామనుకుంది ఊర్మిళ. ఆమె ఆలోచనల్ని పసిగట్టిన మాధవరావు కళ్ళతోనే వారిస్తూ తలిదండ్రులకేసి చూస్తూ అన్నాడు— "అలాగే అమ్మా! రేపే వెళ్ళి దిగబెట్టి వస్తాను, ఊర్మిళను."

మీనాక్షమ్మ తేలుకుట్టినట్లు అరించింది అంతలోనే— "ఊహూ(! నువ్వెందుకురా అక్కడికి? ఓ తంతి ఇచ్చి, అమ్మాయిని రైలెక్కించి రా. ఎలాగైనా వయసువాడివి. ఆవిడేమో కాస్త రంగూ, హంగూ వున్న మనిషి...." వాక్యం పూర్తిచెయ్యకుండా లోపలికి వెళ్ళిపోయింది మీనాక్షమ్మ.

"అలాగే." అన్నాడు మాధవరావు బుద్ధిగా.

ఊర్మిళకు ఆ ఆహ్వానంలోని ఆనందమూ, వెళ్ళాలన్న ఉత్సాహమూ, చప్పగా చల్లారి పోయాయి. భర్తమీద మ్రింగలేని గరళం లాటి కోపం గొంతుకలో గురగుర లాడుతోంది. అత్తగారి సూచన లోని అంతరార్థం ఎంతో నీచంగా వుంది! తన ప్రాణస్నేహితురాలు ఒకవేళ సినీతార అయితే మాత్రం? ఆమెకు మానాభిమానాలు లేవా? స్నేహితురాలి భర్తను వలలో వేసుకుని, స్నేహానికే ద్రోహం చేసేంతటి నీచురాలా?

"అలాగే!'' అంటూ అంగీకరించిన ఈయనగారిలో, తన మీద తనకే విశ్వాసం లేదా? తనను తాను నైతికంగా రక్షించుకోలేని స్త్రీనీ, పురుషునీ ఇతరుల కట్టుదిట్టాలు ఎంతవరకూ కాపాడుతాయి?

"నీ బట్టలూ, అవీ సర్దుకున్నావా?'' అన్నాడు మాధవరావు ఊర్మిళతో ఆ రాత్రి.

''ముందీ మాట చెప్పండి'' -కోడెత్రాచులా బుసలు కొడుతున్న ఊర్మిళను చూస్తూ సరదాగా నవ్వాడు మాధవరావు.

"ఏదో మహాప్రళయమే రాబోతోందన్నమాట! అయితే నేనూ సిద్ధమయ్యాను. కానీ...."

"పరిహాసాలు కావు. నాకు నిజాలు కావాలి."

"అడగండే!"

''ఒకవేళ రుక్మిణి నాకు చీరెలూ, నగలూ ఏమీ యివ్వకపోతే! ఇచ్చినా నేను పుచ్చుకోనని తెలిస్తే మీరు నన్నుపంపరా?'' తీక్ష్ణంగా భర్తవైపు చూస్తూ అడిగింది ఊర్మిళ.

''నెంబర్ వన్-సమాధానం చెబుతాను విను. అలా చెబితే గానీ, మా అమ్మా నాన్నా నీ ప్రయాణానికి సుముఖంగా వుండరు. వాళ్ళను నొప్పించి, ఒప్పించటం నాకిష్టంలేదు. నీకు డబ్బిస్తాను. నీ కిష్టమైన వస్తువులు కొనుక్కో-నిరా! కానీ అవన్నీ రుక్మిణి నీకు బహుమతిగా ఇచ్చినవని మాత్రం వాళ్ళతో చెప్పు.''

ఉప్పెనలా ఎగసిన కోపం చప్పగా చల్లారి పోయింది ఊర్మిళకు. ''ఆ దొంక తిరుగు డెందుకూ?'' అంది నిస్పృహగా.

''ఎదుటి వారి బలహీనతల్ని తెలుసుకున్నప్పుడు వాటిని సరిదిద్దా లనుకోకుండా వాటి నలావుంచే మనపని మనం చేసుకుపోతే ఉభయుల గౌరవానికీ భంగంలేకుండా ఉంటుందని నాఉద్దేశం! ఊ(! కానీ, కంప్లెయిన్ట్ నంబర్ టూ ?''

''పోనీండి! మీరు నా వెంట రావటానికి, రుక్మిణి ఆతిథ్యం స్వీకరించటానికి భయపడ్డా రెందుకు? రుక్మిణంత నీచురాలనా మీ అభిప్రాయంకూడా? లేక మీమీద, మీమనస్సుమీద మీకంత నమ్మకం లేదా?''

"ఓ మైగాడ్! ఎంత చిన్న విషయాన్నైనా ఎంత తీవ్రంగా ఆలోచిస్తావ్ ఊర్మిళా!'' మాధవరావు పకపక నవ్వాడు. మరు క్షణం ఊర్మిళను హృదయానికి హత్తుకున్నాడు. ''నేనూ నీవెంట తోకలా వస్తే,ఇక ఆవిడకు- నీకూ, నాకూ మర్యాదలు చేయడంతోనే సరిపో తుంది. తోచకుండా కూర్చున్న నాకు ఎంగేజిమెంట్ కల్పించటం

చుట్టూరా! తన జీవితాన్ని గులాబీల పాన్పులా ఊహించుకునే వెర్రి ప్రజలున్నారు. తన చుట్టూరా! తనను ఛత్రాజుల్లా ఆకాశాని కెత్తే మనుషులూ వున్నారు! తనవి గురించి అభూత కల్పనలు ప్రచారం చేసే వారికీ తక్కువలేదు. తనకు వంగి వంగి సలాములు చేస్తూనే, వెనుదిరిగి నవ్వుకునేవారూ తనకు పరిచయస్థుల్లో చాలామందే వున్నారు. తన పాణి గ్రహణం కోసం పరితపించేవారూ వున్నారు.

తనకుతెలుసు-వాళ్ళలో ఏ ఒక్కరికీ తన పట్ల నిజమైన ప్రేమ లేదు. సానుభూతిలేదు. ఆత్మీయతలేదు. ఆదరణలేదు. గౌరవభావం లేదు. వారిలో ఎవరిమీదా తనకూ పై వేవీ లేవు!

వాళ్ళందరి మధ్యా తనున్నది-బోనులో పులిలా, పంజరంలో చిలకలా, పద్మవ్యూహంలో చిక్కున్నదానిలా!

అందరి కందరూ నవ్వుతూ, మాట్లాడుతారు. తన భజన చేస్తారు. అయితే తనకు తెలుసు-అవన్నీ పిచ్చి నవ్వులు, దొంగ నవ్వులు, వంకరనవ్వులు, విషపు నవ్వులు. తనకోసం మనస్ఫూర్తిగా సద్భావంతో విచ్చుకొనే పెదవులు తన కెక్కడా కనిపించటం లేదు.

తనకు తెలుసు. ఆ మాటల్లో వాడి ముళ్ళున్నాయి, వేడి నిప్పులున్నాయి. అంతకు మించి, తన హృదయాన్ని సేదతీర్చే అమృతపు జల్లులాటి పలుకులింకా వినిపించలేదు! తనకు తెలుసు- ఆ భజనలో నిజమైన పొగడ్తలేదు, సద్విమర్శ లేదు! తమ అవసరాల కోసం చేసే భజన అది తన డబ్బుకోసం, తన పలుకుబడికోసం, తన కొంగు తగిలినా చాలన్న తహతహతో చేసే భజన! అందులో నీతి లేదు; నిజాయితీలేదు; కనీసం మానవత్వమన్నాలేదు.

తనక్కావలిసిన ఏ ఒక్కటీ ఎక్కడా లేదు. ఈ రంగుల జీవితం, ఈ హంగుల జీవితం, అందమైన పంజరం-దీన్నుంచి కాస్సేపైనా బయటపడాలి. కాస్తయినా స్వేచ్ఛ దొరకాలి; నిజమైన ఆత్మీయత కనిపించాలి; నిశ్చలమైన మనశ్శాంతి కావాలి. ఎలా? ఎలా?

'అమ్మగారూ!' డ్రైవర్ కంఠస్వరం దగ్గరలో విని త్రుళ్ళి

"ఏమిటి?" అంది సరిగా కూర్చుంటూ.

'స్టేషన్‌కు వెళ్ళాలన్నారు రాత్రి? నేనొకణ్ణే కారు తీసుకు వెళ్ళాలా? తమరూ వస్తారా?" డ్రైవరు వినయంగా అడిగాడు.

మెరుపుకొట్టినట్లు లేచి నిల్చుంది తార.

"అరెరె, ఎంత మతిమరుపు వచ్చేసింది! వచ్చేస్తాను. ఎంతలే ఓ అరగంటలో తయారై వస్తాను. కారు రెడీగావుంచు. ట్రెయిన్ రావటానికింకా టైముందిలే! రాత్రి నీతో చెప్పానా? నేనే మర్చిపోయాను."

గాబరాగా డ్రెస్సింగ్ రూం వేపు పరుగెత్తింది తార. డ్రెస్ చేసుకుంటుంటే, ఎదురుగావున్న నిలువుటద్దంలో తన ప్రతిబింబం కనిపిస్తోంది. తన ప్రతిబింబం వేపు చూస్తూంటే మనసు ఆనందంతో పొంగి పొర్లింది.

'ఓ! ఎంత మతిమాలినదాన్ని! ఊర్మిళ ఈ రోజు వస్తోందే పిచ్చిమొద్దూ! హాయిగా మళ్ళీ చదువుకునే రోజుల కబుర్లూ, ప్రస్తుత జీవితాలకు సంబంధించిన కబుర్లూ, ఎన్నో ఎన్నో మాట్లాడుకోవచ్చు హాయిగా నవ్వుకోవచ్చు. నిజమైన ఆత్మీయతనూ, ఆనందాన్నీ అనుభవించవచ్చు! డబ్బుకూ, మోసాలకూ, వేషాలకూ, గ్లామర్‌కూ- ఈ పంజరపు కమ్మీలన్నిటికీ అతీతంగా ఎగరవచ్చు. అన్నట్లు నువ్వీ క్షణంనుంచీ 'తార'వు కాదు. రుక్మిణివి. మరచిపోకు. ఈగ తన పేరు మర్చిపోయినట్లు, ఇన్నాళ్ళూ నీ పేరూ, నీ నిజమైన రూపూ, మనస్సూ అన్నీ మరుపుకు వచ్చేశాయి! మళ్ళీ ఒక్కసారి వాస్తవంలో పడు....!'

డ్రస్ చేసుకుని బయటికి వచ్చిన యజమానురాలిని క్షణకాలం వింతగా చూశాడు డ్రైవర్. అతడు పనిలోకి వచ్చిన ఈ ఆరేళ్ళలోనూ, ఏనాడూ ఆవిడింత నిరాడంబరంగా అలంకరించుకోవటంగానీ, నిర్మలంగా నవ్వటం గానీ, ప్రశాంత వదనంతో ప్రత్యక్షం కావటంగానీ చూళ్ళేదు! ట్రెయిన్‌లో రాబోయే ఆవిడెవరో, ఏమిటో నన్న కుతూహలం కూడా అతడిలో క్షణకాలం కలగక పోలేదు.

"నేరుగా స్టేషన్‌కు పోనిమ్మంటారా?" కారు స్టార్టు చేస్తూ అడిగాడు మెల్లిగా.

క్షణకాలం ఏదో ఆలోచించి రుక్మిణి మెల్లిగా అంది. "ముందు స్ట్రిగా, మా స్నేహితురాలు అన్నపూర్ణ తెలుసుగా-నారాయణ రావుగా రిల్లు-అక్కడికి పోనీ. ఐదు నిమిషాలు ఆవిడతో మాట్లాడి. అక్కణ్ణించి సరాసరి వెళ్దాం స్టేషన్‌కు. టైం చాలా వుందిలే!''

వాకిట్లో కారు ఆగేవేళకు, అన్నపూర్ణ ఇల్లు యుద్ధరంగంలా వుంది. ఉన్న మూడుగదులూ, అప్పుడే ఇంట్లో ప్రవేశించిన వారి సామాను చిందర వందరగా పడివున్నట్లుగా, గందరగోళంగా వున్నాయి! పిల్లలిద్దరికీ బట్టలుతొడుగుతూ, హడావుడి పడిపోతోంది అన్నపూర్ణ. ఓ మూలగా టేబిల్ ముందు కూర్చుని నారాయణరావు టిఫిన్ తింటున్నాడు. విడిచిన బట్టలూ, పిల్లల పుస్తకాలూ, తను పట్టుకెళ్ళాల్సిన టిఫిన్ క్యారియరూ, భర్తకు ఫ్లాస్కూ, పిల్లలకు టిఫిన్ బాక్సులూ, అన్నీ మూల కొకటిగా వున్నాయి. కారులో నుంచి దిగి వస్తున్న రుక్మిణిని చూచి పిల్లాడి నిక్కరు బొత్తాములు పెడుతున్నదల్లా ఎదురొచ్చింది అన్నపూర్ణ.

"రావే రుక్మిణీ తారా! ఇలా చూడు మా ఇల్లు! సర్కస్‌లో రింగు మాస్టర్‌లావుంది నా పని. తెల్లారి లేచింది మొదలు పిల్లి మొగ్గలూ. సాయంత్రం కొంపజేరుకున్నది మొదలు కుప్పిగంతులూ. ఈ వెధవ లిద్దరినీ సముదాయించి స్కూళ్ళకు తోలుకెళ్ళేసరికి, సింహాలను బోనుల్లో వేసినంత పనౌతోంది! అలా చూడు! మహాను భావుడు! తన పనేమిటో, తనేమిటో తప్ప! అటు పుల్ల యిటు కదపరు! ఎంత త్వరగా వెళ్ళినా, ఎంత సిన్సియర్‌గా పనిచేసినా ఆఫీసులో చీవాట్లు మాత్రం తప్పటం లేదు. అసలు ఇంక్రిమెంట్లు ఇవ్వకున్నా, ఇవి మాత్రం రోజూ అధికాధికంగా ముట్టుతున్నాయి. ఏం బ్రతుకులో, ఏం ఉద్యోగాలో! ఉన్న వూపిరి పోతోంది! పిచ్చెక్కి పోతోంది. ఏరోజు కారోజు ఎక్కడకేనా పారిపోదామనిపిస్తోంది. ఏనాడో పారిపోతానేమో కూడాను," అంది ఆయాసపడుతూ.

రుక్మిణిని చూచి ముఖం విప్పారి, తింటున్న టిఫిన్ వదిలి వచ్చాడు నారాయణరావు. "తారగారా! రాండి, రాండి, ఇలా కూర్చోండి. అన్నపూర్ణా! వచ్చిన మనిషిని హడలగొట్టేస్తా వెందుకూ నీ వాగుడుతో?" అన్నాడు భార్యను మందలిస్తూ.

"మా రుక్మిణికి నా వాగుడీ రోజు కొత్తేం కాదు. అదీ, నేనూ క్లాస్‌మేట్స్‌మే! అన్నట్టివ్వాళ ఏమిటి విశేషం, తారాదేవిగారు మా ఇల్లు పావనం చేశారు?" చనువుగా భుజంమీద చెయ్యివేస్తూ అడిగింది అన్నపూర్ణ.

"ఇందాకట్నుంచీ ఆ సంగతి చెబుదామనే ప్రయత్నిస్తున్నాను. నువ్వు చెప్పనిస్తేనా? ఊర్మిళ వస్తోందీ రోజున. నిన్ననే టెలిగ్రాం ఇచ్చింది. స్టేషన్‌కు వెళ్తున్నా నేను. తమరుకూడా ఉద్యోగానికి పదిరోజులు సెలవుపెట్టి మా ఇంటికి రావాలి." అంది రుక్మిణి జబర్దస్తీగా అన్నపూర్ణ జబ్బమీదచరుస్తూ.

"భలేదానివే! నేనేం నీలా ప్రఖ్యాత సినిమా తార ననుకున్నావా? 'ఈరోజు నాకు ఒంట్లో బాగాలేదు. షూటింగ్ కాన్సిల్ చేసెయ్యండి' అని ఫోన్ చెయ్యగానే 'జీ హుజూర్!' అని అవతల వాళ్ళు ఒప్పుకోవటానికి! ఇది ఉద్యోగమోయ్ అమ్మడూ! అడిగినప్పుడల్లా సెలవలు మంజూరు చెయ్యటానికి వాళ్ళేం మన మేనత్త కొడుకులు కారు!" అంది నవ్వుతూ. "పైగా ఈ అల్లరి వెధవల్ని వేసుకుని నాకెక్కడికి రావటానికీ భయమే! మారాం మొదలెట్టి ప్రాణాలు తోడేస్తారు! నా పరువూ, నన్ను పిల్చిన వారి పరువూ తీసేస్తారు!"

"ఎన్నిసాకులైనా చెప్పు. ఊర్మిళ వెళ్ళేలోగా, నువ్వు వచ్చి మాయింటో వుండాలి. మన సుగ్రీవం సరదాగా గడపాలి." అంది నిక్కచ్చిగా రుక్మిణి.

నారాయణరావు కల్పించుకున్నాడు. "నే చూసుకుంటా లెండి తారగారూ? మీరంతగా చెప్పాలా? ఏలాగో ఓలా ఓరోజు సర్దుకుంటాం లెండి. అన్నపూర్ణను పంపిస్తాను" అన్నాడు. అతగాడి వేపొక

మారు సాలోచనగా చూసింది రుక్మిణి. ఆమె హృదయంలో ఎగసిన ఏదో వెగటుదనాన్ని, అక్కడే అణచి వేసింది.

''ఒక్కరోజే సుమా! నాకు సెలవుండదు'' అంది అన్నపూర్ణ.

"అలాగే! పొరబాటుగా మరునాడు నువ్వుంటానన్నా, నేనే మెడబట్టి గెంటేస్తాను. సరా?" నవ్వుతూ లేచింది రుక్మిణి.

''ముందుగా కబురంపి మరీరాలేదు. కాబట్టి, నీకు తాంబూలం కూడా రెడీగా లేదు. నీ ఖర్మ!" అంది సాగనంపుతూ అన్నపూర్ణ.

"ఏడ్చావులే! ఏం మాటలవి?'' నారాయణరావు కోపంగా అన్నాడు. తార కెక్కడ కోపం వస్తుందోనని అతగాడి భయం.

"దాని మాటలు నాకు మామూలే లెండి, నారాయణరావు గారూ! నే వెళ్ళొస్తా!''కార్లో కూర్చుంది రుక్మిణి.

''మేమూ పరుగెత్తాలిక!" చెయ్యివూపుతూ అంది అన్నపూర్ణ.

కారు కదిలి పోయింది.

''అయినా, అంత చనువుగా మాట్లాడతా వెందుకు, అన్నపూర్ణా, ఆవిడతో?'' అన్నాడు నారాయణరావు కోపంగా ఇంట్లోకి వస్తూ.

''స్నేహితురాలు అది. డబ్బు వచ్చాక కూడా స్నేహం చెడ లేదు. మరెందుకు లేని పోని హద్దులు పెట్టుకోవాలో అర్థంకాదు నాకు," అంది ముఖం చిట్లిస్తూ అన్నపూర్ణ.

"స్నేహితురాలైతే మాత్రం? ఆవిడ అంతస్తేమిటి? మన అంతస్తేమిటి? అంతటి పేరు ప్రఖ్యాతులు కలిగిన ఆవిడ నీ స్నేహితు రాలు కావడమే మన అదృష్టం. ఆ స్నేహాన్ని అపురూపంగా నిలుపు కోవాలి. ఇలా అతి చనువుగా మాట్లాడి మాట్లాడి ఏనాడో ఓ నాడు ఆవిడకు కోపం వచ్చేలా చేసుకుంటావేమోనని నాభయం!" అన్నాడు, ఆ క్షణ మేదో ఇప్పుడే వచ్చిపడ్డట్టు భయపడిపోతూ.

అన్నపూర్ణ గలగలనవ్వింది. "అంతగా తుమ్మితే వూడి పొయ్యే ముక్కు అదెంతకాలం వుంటుంది? ఏం ఆవిడకు కోపం వస్తే నే బ్రతకలేనా? నన్ను గానీ, నా పిల్లల్నిగానీ, పెట్టి పోషి

స్తోందా ఆవిడ? ప్రాణాపాయపరిస్థితుల్లోకూడా 'దేహి' అంటూ తనని యాచించనని ఆవిడకు తెలుసు! డబ్బుగల స్నేహితురాలన్నీ, పలుకుబడి కలిగిందనీ, ఆమెను నా స్వార్థానికి ఉపయోగించుకోననీ, ఆవిడకు బాగా తెలుసు! మామధ్య వున్నది కేవలం చిన్ననాటి చెలిమే తప్ప, ఈ నాటి కలిమీ, పరిస్థితులూ మాత్రం కావని మా యిద్దరికీ తెలుసు! మధ్యలో మీ భయం ఏమిటో బోధ పడదు నాకు!" అన్న పూర్ణ లోపలికి వెళ్ళిపోయింది ఇల్లు సర్దటానికి.

నారాయణరావుకు మాత్రం భార్య ధోరణి అవివేకంగా తోచింది. అతగాడు లౌక్యుడు. డబ్బుగల స్నేహితురాలి విలువ అన్న పూర్ణకు తెలియకపోవచ్చు. 'ఆత్మాభిమానం' అనే 'బోడి' సెంటి మెంట్ అడ్డుపడవచ్చు. కానీ అతగాడికి తెలుసు! డబ్బూ, పలుకు బడీ జంటకవుల్లాటివనీ, అవి రెండూ వున్నచోట ఏదీ అసాధ్యం కాదనీ.

అలాటి వ్యక్తి చేతిలో వుండికూడా లేనిపోని 'హద్దులు' పెట్టుకు కూర్చోవటం, లేదా తనంత తానుగా ఆ అవకాశాల్ని వినియో గించుకోక పోవడం, అన్నపూర్ణలాటి తెలివి తక్కువ వాళ్ళు మాత్రమే చేసే పననీ. దానికేదో "ఆత్మాభిమానం" అంటూ పెద్ద పేరు పెట్టుకోవడంకూడా వెర్రితనమనీ, అతగాడి ప్రగాఢ విశ్వాసం. 'తార' ల్లాటి వారిని తాంబూలంలో సున్నంలా వాడుకోవా లన్నది అతని ఉద్దేశం.

భర్త ఆలోచనల దారి అన్నపూర్ణకు తెలియదుకానీ, భర్తకు లేనిపోని భయా లెక్కువ అని మాత్రం నవ్వుకుంటుంటుంది లో లోపల ...

"మీ రింకా తయారవలేదూ? ఇంటికి తాళంవేసి మనం బస్ స్టాప్‌కు వెళ్ళాలి!" అంది అన్నపూర్ణ, బయటికి వచ్చి ఇంకా అత గాడలాగే నిల్చుని వుండటం చూచి.

"ఎందుకైనా మంచిది. ఓ రోజు సెలవు పెట్టు! ఆవిడంతగా చెప్పి వెళ్ళింది గదా?" అన్నాడు నారాయణరావు.

''అబ్బబ్బ! ఆ గొడవేదో నేను చూసుకుంటాలెండి. నాకెలా బావుంటుందని తోస్తే, అలా చేస్తాను. ముందు మీరు తయారవండి'' అనేసింది, పిల్లలిద్దరికీ పుస్తకాల 'బాక్స్' చేతికిస్తూ.

''ఒక్కరోజే సుమా! ఎక్కువ రోజులు బావుండదు!'' లోపలికి వెళుతూ గొణుక్కున్నా డతను.

''భగవంతుడా!'' విసుగ్గా నుదురు కొట్టుకొంది అన్నపూర్ణ.

# 4

ట్రెయిన్ ఆగగానే, ఆదుర్దాగా దిగిన ఊర్మిళకు ఎదురుగా వస్తున్న రుక్మిణి కనిపించింది.

స్నేహితురాళ్ళిద్దరూ ఒకరి నొకరు తన్మయత్వంతో చూసుకుంటూ నిల్చుండి పోయారు.

''నువ్వు... నిజంగా ఏమీ మారలేదా రుక్కూ?'' విభ్రాంతిగా చూస్తూ అంది ఊర్మిళ, రుక్మిణి భుజం మీద చెయ్యి వేస్తూ.

''మారకేం! చాలా మారాను. కాని నువ్వూ, అన్నపూర్ణా మాత్రం మీ వెనకటి రుక్మిణినే చూడాలి నాలో—తారను కాదు'' అంది నవ్వుతూ. అంతలోనే ఏదో గుర్తుకు వచ్చిన దానిలా, గాబరాగా-''పద. మనం త్వరగా వెళ్ళాలి. ఇప్పుడిప్పుడే నే నెవరినో గుర్తు పడుతున్నారు జనం. ఇం కాసేపుంటే, మనం ఇల్లు చేరుకోవటం కష్టమౌతుంది,'' అని తొందరపెట్టింది.

ఇద్దరూ గబగబ కారు దగ్గరికి వచ్చారు. డ్రైవరు ఊర్మిళ సూట్ కేస్ తెచ్చి డిక్కీలో పెట్టి, కారు స్టార్ట్ చెయ్యబోయాడు. చుట్టూరా మూగిన జనసమూహాన్ని చూచి ఆగి పోయాయి అతడి చేతులు

'తార... తార' అన్న కేకలతోబాటు కారులోకి వెళ్ళగు కాకుండా చుట్ట వేశారు యువకులూ, కొందరు పెద్దలూ.

గబగబ చేతికందిన ఆటోగ్రాఫ్ పుస్తకాలలో సంతకం చేసింది. సందు చూసుకుని కారు స్టార్ట్ చేశాడు డ్రైవర్.

బాధగా సీటుకి జారగిలబడింది రుక్మిణి మరి కాస్సేపుంటే తనకూ కారుకూగూడా క్షేమం కాదని ఆమెకు తెలుసు.

"ఎట్లా గుర్తు పట్టారో. కారు చుట్టు ముట్టేశారండీ!" అన్నాడు డ్రైవర్.

"ఖర్మ!" రుక్మిణి నిట్టూర్చింది.

ఊర్మిళ చిత్రంగా చూచింది రుక్మిణి వేపు

"అదేమిటలా అంటావ్? ఇంతమంది చేత అభిమానించబడటం నీకు గొప్పగా లేదూ? ఇంత అదృష్టం ఎందరి కుంటుంది?"

రుక్మిణి పేలవంగా నవ్వింది. "... వీళ్ళే కాదు. అప్పుడప్పుడూ చెప్పులూ, రాళ్ళూ కూడా అభిమానంతో పలకరిస్తాయి నన్ను! పరోక్షంగా విమర్శలూ, నిందలు కూడా అభిమానంతో సాగుతుంటాయి. నాకూ మొదట్లో ఈ అభిమానాలన్నీ చాలా గొప్పగా అనిపించేవి. కానీ రాను రాను, వాటి వెనుకవున్న 'వేలం వెర్రి' తత్వం అర్థమయింది! బిచికిపోతే అభిమానులు—అభిమానంతో చేసే పనులకు హడలెత్తిపోయాను! సన్మానాలకూ, సభలకూ వెళితే, కొందరు అభిమానులు, ఆ అభిమానులకంటె పెద్దలూ అభిమానంతో వేసే ఈలలూ, వెకిలివేషాలూ, వారి కన్నుగీట్లూ, మొరటుమాటలూ-చవిచూశాను. చివరకు నా చుట్టూ తిరుగుతూ, నా చేత డబ్బులు ఖర్చుపెట్టిస్తూ. తమ అవసరాలు తీర్చుకునేవారే! అభిమానంతో చేసే అబద్ధపు నిందాప్రచారాలతో, అలాటి అభిమానాలతో తలమునకలయ్యాను. షాపింగ్‌కు వెళ్ళాలన్నా, ఎలాటి అభిమానులను ఎదుర్కోవలసి వస్తుందోనని భయం. ఏ ఒక్క సరదా తీర్చుకోవాలన్నా భయమే! మరింతటి అదృష్టం ఎందరి కుంటుం దంటావ్?"

ఊర్మిళ మాట్లాడలేదు. రుక్మిణి ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న బాధ వెనుక ఆమె హృదయావేదన కొంత అర్థమౌతోంది.

కారు మెత్తగా వెడుతోంది.

గబుక్కున ఏదో గుర్తుకొచ్చిన దానిలా అంది రుక్మిణి— "బావుంది. నా ధోరణి, మొదలెట్టానేమిటి? ఇంతకూ మీ శ్రీవారు, అత్తగారు, మామగారు అంతా కులాసాయేనా?" అని అడిగింది ఆప్యాయంగా.

"ఆ!"

"మరి మీ శ్రీవారు రాలేదేం?" కుతూహలంగా అడిగింది రుక్మిణి.

"వారికేవో పనులున్నాయట" గొణిగింది ఊర్మిళ.

"థాంక్ గాడ్! ఆ మాత్రం ఆలోచనా, విశాలహృదయమూ వున్నవాడే మాధవరావు! తిరుగు చీటీలా వెంట వచ్చి, తిరుగు టపాలో తరలించుకుపోతాడేమో నిన్ను అనుకున్నాను!" అంది హాయిగా నవ్వుతూ.

మాధవరావు మాటలు గుర్తొచ్చాయి ఊర్మిళకు. హృదయం తేలికైంది.

"అన్నపూర్ణ బావుందా?"

"ఆహా! రోజుకో చుట్టు పెరుగుతోంది—దాని వంతు కూడా వాళ్ళాయన చిక్కిపోతున్నాడు!"

"నువ్వు మారలేదు రుక్కూ - మారవు కూడాను!" ఆప్యాయంగా స్నేహితురాల చెయ్యి నొక్కుతూ అంది ఊర్మిళ.

# 5

రుక్మిణి బంగళాలో ఊర్మిళకు సకల సదుపాయాలూ జరుగుతున్నాయి. 'యజమానురాలికి అత్యంతాప్తురాలు' అన్న భావం నౌకర్లలో కలగటంవల్ల, రుక్మిణి యింట్లో వున్నా లేకున్నా, ఊర్మిళకు సకల మర్యాదలూ సగౌరవంగా చేస్తున్నారు. సాధారణంగా

రుక్మిణి ఉదయం తొమ్మిది, పది గంటలకల్లా బయల్దేరి వెళుతుంది. ఇక తిరిగి రావటం రాత్రి పది గంటలు దాటాకే!

మొదటి రెండు రోజులూ ఊర్మిళకు దిక్కుతోచలేదు. అంతా కొత్త. చేసేందు కేమీ లేదు. రుక్మిణికి ప్రత్యేకం ఓ లైబ్రరీ గది వుంది. అందులో బీరువాలో చక్కగా సర్దివున్న మంచి పుస్తకాలు. అవెంతో నచ్చాయి ఊర్మిళకు.

''ఇవన్నీ నువ్వు చదివావా?'' అంది రుక్మిణితో ఆ బీరువా చూపినపుడు.

"చదవటం అలా వుంచు, పేర్లేమిటో కూడా సరిగా చూడ లేదు! నాకు తీరికా లేదు, ఓపికా లేదు.''

"మరి ఈ పుస్తకాలన్నీ....?'' ఆశ్చర్యంగా, సందేహంతో చూచింది ఊర్మిళ.

" 'షో'కు. ఫలానా 'తార'గారి పుస్తక విజ్ఞానం, పఠనాసక్తి అపారం, అమోఘం అని అనిపించుకోవటానికి కాస్త అక్షరజ్ఞానం వున్న ఫ్రెండ్స్ గానీ, అతిథులు గానీ వస్తే, చూపించటానికి.... "

అంత నిక్కచ్చిగా చెబుతున్న రుక్మిణిని చూచి క్షణకాలం ఆశ్చర్య పడింది ఊర్మిళ.

"పోన్లే! నువ్వేనా చదువుతావు ...'' అంది రుక్మిణి. నిజంగా ఆ పుస్తకాలే లేకుంటే, తనకు మతే పోయేదేమో.... మరో సరదా అయిన కాలక్షేపం రుక్మిణి పెంపుడు చిలకలు రెండు. అందమైన పంజరాల్లో వున్న ఆ రామచిలుకలు, ఎంతో ముద్దుగా వున్నాయి. నౌకర్లు అప్పుడప్పుడూ ఒక్క పండో, కాసిన్ని గింజలో, కాసిన్ని పాలూ, లేదా పరమాన్నం, పంజరంలోనే ఏర్పాటుగావున్న చిన్న చిన్న గిన్నెలలో అమరుస్తుంటారు. అవి తింటుంటాయి. అప్పు డప్పుడూ ఒక్కసారిగా ఆకుపచ్చని రెక్కలు విదిల్చి, ఎర్రని ముక్కుతో రెక్కల్లో పొడుచుకుంటాయి.

వాటి ప్రతి కదలికా ముచ్చటగానే వుంది ఊర్మిళకు. రెండు రోజు లలా దూరంనుంచే గమనించింది. మూడో రోజునుంచి "...

ఆహారం అందుకుని, స్వయంగా తనే పెట్టడం మొదలెట్టింది. మరో నాలుగు రోజులు గిర్రున తిరిగే సరికి, ఊర్మిళ కవి బాగా మచ్చికయి పోయి. పంజరంలోనుంచి బయటకు తీస్తే, మక్కువగా ఊర్మిళ భుజంమీదగానీ, చేతిమీదగానీ కూర్చుని, ముక్కులతో తమాషాగా పొడుకుతాయి! అదో తమాషా అనుభవం-అనుభూతి

చిలకలతో గడుపుతో, అలా గంటల తరబడి కూర్చుని రుక్మిణి అదృష్టాన్ని గురించి ఆలోచిస్తూనే వుంటోంది ఊర్మిళ.

ఆమె దర్శనం అయితే చాలు, జన్మ ధన్యమై పోతుం దన్నంత అభిమానం గల అభిమానులు; ఏ కోరికా, కొరత లేకుండ తీర్చుకోగల ఐశ్వర్యం; ఏ హద్దూ, అజ్ఞా, బీకూ, చింతాలేని హాయి గాలిపే జీవితం- లభ్యమయిన రుక్మిణి దెంత అదృష్టం! నిజంగ ఇంద్రధనస్సులాటి జీవితం రుక్మిణిది. పంచరంగుల చిలకలాటి అందమైన బ్రతు కామెది.

"ఏం ఊర్మిళా! నా మీద కోపమొస్తోంది కదూ! బోర్ కొట్టి స్తూన్నాను కదూ!" అంటూ ఆప్యాయంగా అడుగుతున్న రుక్మిణి ప్రశ్నతో, ఆలోచిస్తున్న ఊర్మిళ తల తిప్పి చూచింది. ముఖాన్న వున్న రంగైనా కడుక్కోకుండా, ఏకంగా యింటి కొచ్చి, సరాసరి తన దగ్గరకు వచ్చిన రుక్మిణి ముఖంలో అలసట ప్రస్ఫుటంగా కని పిస్తోంది.

"లేదు....లేదు....నీ చిలకలు నాకు మాంచి కాలక్షేపం!" అంది నవ్వుతూ.

"ఏం చెయ్యను చెప్పు? నామటుకూ త్వరగానే వద్దామను కుంటాను. ఏ క్రొత్త కంట్రాక్టో వస్తుంది. ఏ కొత్త డైరెక్టరో, ప్రొడ్యూసరో జలగలా పట్టుకుంటాడు. ఎందుకులే అవన్నీ? రేపు మాత్రం షూటింగ్‌కు రావటానికి వీలుకాదనీ, ఒంట్లో బాగా లేదని సాకు పెట్టి, కాల్ షీట్సు రద్దు చేసుకున్నాను. రేపు అన్నపూర్ణనూ దాని పిల్లల్ని గూడా ఇక్కడికే రమ్మన్నాను. దాని మొగుడో పినిక్! ప్రతిదీ అవునంటే, కాదనే తత్వం! ఒక్క రోజు ఇక్క

డుంచటానికి, తన పెళ్ళామేదో అపవిత్రమై పోతుం దన్నట్లు గిల గిల లాడతాడు! మళ్ళీ నెలాఖరు రోజులోగానీ, ఏదైనా ఇబ్బందులకు గానీ, నేరుగా వచ్చి నన్ను డబ్బు అప్పుగా అడిగి పట్టుకెళతాడు దాని పేరు చెప్పి! చిత్రంగా లేదూ? నేను అపవిత్రురాలిని! నా డబ్బు పరమ పవిత్రమైనది! రేపైనా ఎందుకు ఒప్పుకున్నా ననుకున్నావూ? దాని పిల్లాడి పుట్టిన దినమని తెలిసి, నేను పిల్లలకు బట్టలూ, బొమ్మలూ పట్టుకెళ్ళి ఇచ్చాను. అలాగే ఇప్పుడూ దానికీ, పిల్లలకూ దండిగా ముట్టచెబుతానని.... ఊర్చుతప్పినా తప్పినట్లేనని! ఛీ ...ఛీ.... పెద్దమనుషులూ.... చిన్న....చిన్న .. బుద్ధులూ!'' ఈసడింపుగా అని, సోఫాలో వెనక్కు వాలి కూర్చుంది రుక్మిణి.

ఊర్మిళ మాట్లాడలేదు.

చటుక్కున ఏదో గుర్తుకు వచ్చినట్లు, ఊర్మిళ భుజంమీద చెయ్యివేస్తూ అంది రుక్మిణి. "రేప్పొద్దున్న అన్నపూర్ణ ఎదుట, పొరబాటున కూడా, దాని మొగుడు డీలా డబ్బు పుచ్చుకుంటున్నాడని అనేవు సుమా- ఉరోసుకు చస్తుంది! దాని కెంత ఆత్మాభిమానమో నాకు తెలుసు. పోయిన సంవత్సరం దాని పెద్ద పిల్లాడికి చాలా జబ్బు చేసి, హాస్పిటల్లో వుంచాల్సి వచ్చింది. దాని ఆర్థిక స్థితిగతులు నాకు తెలుసు గాబట్టి. సంగతి తెలియగానే, పరుగెత్తుకువెళ్ళి, ఓ ఐదు వందలు ఇవ్వబోయాను. ససేమిరా తీసుకో ననడమే కాక, వాళ్ళాయన ముందే ఓ లెక్చరిచ్చింది.''

"ఏమని?" ఊర్మిళ కుతూహలంగా అడిగింది.

"స్నేహంగానే మిగిలిపోవాలంటే, డబ్బు సంబంధమైన లావా దేవీ లేవీ వుండకూడదట! తన రెక్కల కష్టంతో తాను సంపాదించుకుంటున్నప్పటి తృప్తి అలా ఎవరైనా ఉల్ఫాగా యిస్తే వుండదట! తన బిడ్డకు తాను వైద్యం చేయించుకోలేని నిస్సహాయ స్థితిలో తానున్నా ననుకోవటం, తనకే అవమానకరమట. ఇలా.... ఇలా ఎన్నో..ఇంకెన్నో..అదలా చెబుతున్నంతసేపూ, పాపం! వాళ్ళాయన మాత్రం పిచ్చిబట్టినట్లు వూగిపోయాడంటే నమ్ము!

మాయించాలని శత విధాలా ప్రయత్నించాడు. పాపం!'' రుక్మిణి విరగబడి నవ్వింది.

''ఎందుకూ?''

''ఎందుకేమిటి? నాకో్కపం వస్తుందేమోనని. వస్తే తనకు ఇక 'డబ్బు' అప్పనంగా వచ్చే మార్గం వుండదని! పాపం అన్నపూర్ణను చూస్తుంటే మాత్రం నాకు గర్వమూ, జాలీ కూడా కలుగుతూంటాయి. అంతటి ఆత్మాభిమానం గల అన్నపూర్ణకు, అంతటి నిరభిమానం గల భర్త! ఇంతకూ అన్నపూర్ణ కో రహస్యం తెలీదు.''

ఏమిటన్నట్లు చూచింది ఊర్మిళ.

''నారాయణరావు మర్నాడే వచ్చి, తన భార్య మాటలు లెక్కచేసుకోవద్దనీ, వెయ్యి క్షమాపణలు (ఆవిడ తరపున!) చెప్పి, పిల్లాడి మందులకూ, డాక్టర్ ఫీజుకూ, ఇతర ఖర్చులకూ, అవసరమంటూ, నాన్చి, ఐదు వందలూ పట్టుకెళ్ళాడు!''

ఊర్మిళ మాట్లాడలేదు. అన్నపూర్ణపట్ల గౌరవం అధికం కావటంతోబాటు, నారాయణరావు మీద ఓ విధమైన అసహ్యం పేరుకు పోవడం మొదలెట్టిం దామె హృదయంలో.

అలసివున్న రుక్మిణి ఇక తను పడుకుంటానని చెప్పి, వెళ్ళి పడుకుంది. ఊర్మిళ కూడా తన గదిలో పడుకుంది. కానీ నిద్ర పట్ట లేదు. రుక్మిణే కాదు, అన్నపూర్ణ గూడా అదృష్టవంతురాలే తన కంటే! హాయిగా ఉద్యోగం చేస్తోంది. వెంటా వెనకా హద్దులు పెట్టేవా ళ్ళెవరూ లేరు! స్వేచ్ఛగా ఖర్చు చేస్తుంది. తన సంసారం తన చేతుల మీదుగా నడుపుకుంటుంది. పదుగురిలో గౌరవం సంపాదించుకుంది.

మరి తనో? ఏదో ఈర్ష్యలాటి భావం, మెల్లిగా తలెత్తి, అది ఇంతై, అంతై, హృదయమంతా ఆక్రమించుకుని, ఉక్కిరిబిక్కిరి చేయసాగింది.

అవును ... తనకూ ఇలాటి స్వేచ్ఛా జీవితం కావాలి. తనూ ఓ బాధ్యతాయుతమైన స్త్రీగా మార్పు చెందాలి. ఎంతకీ ఒకరు చెప్పటం, తాను చెయ్యటం, అన్న ఆ బ్రతుకునుంచి బయట పడాలి.

అన్నపూర్ణ భర్త నిరభిమాని అంటుంది రుక్మిణి. కానీ తన భర్త? ఎదుగూ బొదుగూ లేని జీవితపు చట్రంలో తనని తాను బంధించుకుని, అదే ఆనందమని భావిస్తున్న అతగాడి మనస్తత్వాన్ని గురించి తనెలా చెప్పుకో గలదు?

ఆ ఆలోచనలతోనే తెల్లవారిపోయింది ఊర్మిళకు.

# 6

ఉదయాన్నే అన్నపూర్ణనూ, పిల్లలనీ తీసుకురావటానికి, కారు పంపింది రుక్మిణి.

"రాత్రికి తప్పక తిరిగి రా అన్నపూర్ణా! ఆవిడేదైనా ముద్దు ముచ్చటలు జరిపితే, మూర్ఖంగా కాదని, మనసు నొప్పించకు." అన్నాడు నారాయణరావు, అన్నపూర్ణని సాగనంపటానికి బయటకు వస్తూ.

"ప్లీజ్! మీరు పదే పదే ఏమీ చెప్పకండి. నా హద్దులేవో, అర్హతలేవో, నా స్నేహాలేవో, వాటి విలువలేవో, నాకు తెలుసు!" తీక్ష్ణంగా అంది అన్నపూర్ణ.

ఇంక ఆ సమయంలో మరీ రెట్టిస్తే, తిక్క రేగి, అసలు వెళ్ళనంటుదేమో అన్నపూర్ణ అని లోలోపలే విసుగుదలను అణుచుకున్నాడు నారాయణరావు. కారు అలా కదిలిందో లేదో ఇలా పరుగెత్తుకు వచ్చింది, కుమారి రాధ.

"అదేమిటండీ బావగారూ! మీరూ వెళ్ళలేక పోయారా? అంతటి సినీతార మీ స్నేహితురాలై వుండి, మీరిలాటి అవకాశాలను ఎందుకు వినియోగించుకోరో నా కర్థం గాదు!" అంది అందంగా లేని కళ్ళను, అందంగా తిప్పాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూ.

కొత్తగా ఆమె సంబోధనలో వచ్చిన మార్పునూ, చనువునూ, పసిగట్టిన నారాయణరావు గొప్పగా నవ్వాడు.

"ఆఫీడా? నాకు స్నేహితులారా? ! ఛి....ఛి... మా ఆపడ క్లాస్‌మేట్. అంతే! ఏదో ఆడవాళ్ళు.... ఏదో కాస్త సరదా లుంటాయి, అడ్డుచెప్పటం సంస్కారం అనిపించుకోదు కాబట్టి, అడ్డు చెప్పనంతే గాని, నేను వెళ్ళడమేమిటి? అసలు మనలాటి పరువైన వాళ్ళు వెళ్ళే ప్రదేశాలా అవి? అందుకే అన్నపూర్ణను గూడా రాత్రికే వచ్చెయ్యమన్నాను- ఆరు న్నూరైనా వచ్చేస్తుంది కూడాను!" అన్నాడు.

"నిజం చెప్పారు" అంది రాధ ఆరాధనగా అతగాడి వేపు చూస్తూ. "నేను ఆఫీసుకి వెళ్ళాలి—" అంటూ కదిలిపోయింది.

"నేనూ వెళ్ళాలి" అని నిట్టూర్చాడు నారాయణరావు.

# 7

రుక్మిణి స్పెషల్‌గా తయారు చేయించింది ఊర్మిళ కిష్టమైన వంటకాలూ, అన్నపూర్ణ కిష్టమైన పిండివంటలూ. పిల్లలకోసం ఓ గదిలో 'బొమ్మలకొలువు' లా రకరకాల బొమ్మలు రెడీగా వుంచింది. భోజనాల దగ్గర నానా హడావుడీ చేసింది.

"అన్నపూర్ణా! నీ కిష్టమని చేయించాను ఆవడలు. మరొకటి తిను. ఎలాగా లావెక్కుతానన్న భయంతో నీ యింట్లో నువ్వు తిండి మానేశావు" అంది నవ్వుతూ.

అన్నపూర్ణ రుక్మిణి చెవి మెలిపెట్టింది. "ఎలాగా అయ్యేలావు అవనే అయ్యాను. తిండి మానెయ్యడమేం ఖర్మ! హాయిగా తింటున్నాను. అదేమిటే ఊర్మిళా? మౌనానందస్వాముల వారిలా మాట్లాడవు?" అంది ఊర్మిళకేసి చూసి నవ్వుతూ.

రుక్మిణి నవ్వేంది— 'అదంతే! వచ్చిన నాటినుంచీ చూస్తున్నాను. నేను పిలుచేసుకు మాట్లాడాల్సిందే తప్ప, అది పెదవి విప్పదు. అన్నట్లు. చిలకల భాష మాత్రం తెలుసునల్లే వుంది!"

ముగ్గురూ సరదాగా భోజనాలు చేశారు. "ఇక మేడమీదకు వెళ్ళి కూర్చుందాం పదండి. ఒరే పిల్లలూ! ఈ బొమ్మలన్నీ మీకే. హాయిగా వాటితో ఆడుకోండి. కావలసినవన్నీ తీసుకోండి.'' అంది రుక్మిణి, బొమ్మల ఆటలనూ, పాటలనూ కుతూహలంగా పరీక్షిస్తున్న పిల్లలిద్దరివేపు చూస్తూ.

''అదే వద్దన్నాను! ఇలా మప్పి పెట్టావంటే, వాళ్ళిద్దరూ రేప్పొద్దున్నుంచీ, అంత ఖరీదైన బొమ్మలే కొనమని నా ప్రాణాలు తీస్తారు. అంతే కాదు. ఇతరుల సొమ్మంటే ఎగబడే స్వభావం వాళ్ళకు నేర్పినట్లవుతుంది కూడాను''. సీరియస్‌గా ముఖం పెట్టి అంది అన్నపూర్ణ.

రుక్మిణి అన్నపూర్ణ చెంపమీద ఒక్కటి వేసింది, చనువుగా — "ఎద్చావ్! నా యింటి కొచ్చేవరకే నీ యిష్టం. ఇక్కడంతా, నా యిష్టమే. పిల్లల విషయంలో కూడా నీ బోడి రూల్సు పెట్టావంటే. రెండు తగల నిస్తాను! తల తిక్క వేషాలు వేశావంటే జాగ్రత్త. పదపద. ఎన్నేళ్ళకో ఊర్మిళ కూడా కలిసింది మనతో. హాయిగా కబుర్లు చెప్పుకుందాం!''

ముగ్గురూ మేడమీద రుక్మిణి గదిలో కూర్చున్నారు. చిన్న నాటి కబుర్లూ సరదాలూ-ఎడతెగకుండా సంభాషణ దొర్లిపోతూంది. ప్రస్తుత జీవితాలకి వచ్చారు ముగ్గురూ, అన్నపూర్ణ. రుక్మిణి వంతుల వారీగా తమ దిన చర్యలనూ, వాటిలోని సాధక బాధకాలనూ వర్ణించి చెబుతున్నారు. ఊర్మిళ మౌనంగా వింటోంది. ఆమెకు వాళ్ళిద్దరి మాటలలో ఓ విధమైన ఉత్సాహం, ఓ విధమైన హాయి, ఓ విధమైన గర్వం, సంతృప్తి పొంగి పొర్లుతున్నట్లనిపించింది. వాళ్ళిద్దరి మధ్యా తాను చాలా చిన్నదానిలా, ఏమీ తెలియనిదానిలా, ఏ అనుభూతి చవిచూడని దానిలా; వాళ్ళు మాట్లాడే మాటలలో గానీ, వాళ్ళ గర్వం, తృప్తి, ఆనందాలలో ఏ ఒక్కదానిలోగాని పాలు పంచుకొనగల అర్హత లేని దానిలా, వెర్రిబాగుల దానిలా వున్నట్లూ, ఎన్నడూ ఎరగని నీరసమేదో తనని కుంగదీస్తున్నట్టు అనుకోసాగింది.

రుక్మిణి హఠాత్తుగా తన జబ్బ చరచటంతో, ఉలిక్కిపడింది ఊర్మిళ. అందాకా వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో, తను సరిగ్గా వినలేదని కూడా ఆ క్షణమే ఆమె కర్థమయింది.

"నిజం చెప్పవే ఊర్మిళా! అన్నపూర్ణ ఎంచక్కా ఉద్యోగం చేస్తోంది. గౌరవంగా బ్రతక గలుగుతోంది. మొగుడూ పిల్లలతో హాయిగా, స్థిరంగా జీవితం వెళ్ళబుచ్చుతోంది. నువ్వో అంతే. పాలకుండలాటి పాడిపంటల సంసారం. పసిరిక పాములాటి భర్త, అండదండలుగా అత్తమామలు, సంఘంలో గౌరవ స్థానం వుంది నీకు. మరి నాకో? ఇంత డబ్బు వుంది. ఓ స్తిమితం లేదు. స్థిరత్వం లేదు. పేక మేడలాటి యీ వైభవం ఏనాడైనా కూలిపోవచ్చు. నా డబ్బునూ, నా గ్లామర్‌నూ, నా పేరునూ చూచి గాక, నన్ను నన్నుగా ప్రేమించే ఆత్మీయు లెవరున్నారు నాకు? మిమ్మల్నిద్దర్నీ చూస్తుంటే. నాకు ఈర్ష్య కలుగుతోం దన్నాను. తప్పా?"

ఊర్మిళ సమాధానం చెప్పలేదు. క్షణకాలం ఆమె మనస్సు రుక్మిణి అన్న 'పాలకుండలాటి సంసారం... పసిరిక పామువంటి భర్త' అన్న మాటల చుట్టూ ప్రదక్షిణాలు చేసింది.

"నీకు తెలీదు రుక్కూ! నీకు తెలీదు.... నేను మీలా పైకి చెప్పలేను కూడా. పాలకుండలాటి నా జీవితం క్రింద నే నెంతగా నలిగిపోతున్నానో! పాలకుండ ఒరిగి పోకుండా, దాని క్రింద పెట్టే గడ్డితో చేసిన చుట్ట కుదురులా వుంది నా బ్రతుకు. కుండ తొణక కుండా వుండేందుకు మాత్రమే కుదురును వాడతారు. అంతకుమించి ప్రత్యేకమైన విలువలు గానీ, ఉపయోగం గానీ దానికి లేవు. ఇవ్వరు. సరిగా నా విలువా, ఉపయోగమూ కూడా అంతే నా సంసారంలో."

పైకి మాట్లాడడానికి గొంతుక పెగల్లేదు. లోలోపల వైభావాలే సుడులు తిరిగి మరింత అశాంతి రేకెత్తించాయి ఆ క్షణంలో.

అన్నపూర్ణ మనస్సులో ఏ ఆలోచనలు తిరుగుతున్నాయో, మిగతా ఇద్దరికీ తెలీలేదు కానీ, ఆమె మాత్రం వాతావరణాన్ని తేలికపరుస్తూ, గట్టిగా నవ్వేసింది.

‘‘విన్నావుటే ఊర్మిళా, దీని అఘాయిత్యం! ఈర్ష్య కలుగుతోందిట-వెధవ కల్లిబొల్లి కబుర్లూ ఇదీనూ! చాల్లేం డింక, క్రిందికి వెడదాం. నాలుగు గంటలు కావస్తోంది. కాఫీలైనా ఇప్పించ లేదు బడుద్దాయి!’’

ఎవరికి వారు తేలికైన మనస్సులతో, నవ్వులతో క్రిందికి దిగి వచ్చారు.

రాత్రి భోజనాలయ్యీ కాగానే, పిల్లలకు బూట్లు తొడిగింది అన్నపూర్ణ. ‘‘ఇక నే వెళ్ళాలి రుక్మిణీ’’ అంది.

“అదేం అంత తొందర? రేపొద్దున వెళ్ళరాదూ?’’ అంది రుక్మిణి.

“అవును అన్నపూర్ణా” అంది ఊర్మిళ.

‘‘ఊహూ! వీల్లేదే, వెళ్ళాలి” అంది. అన్నపూర్ణ పిల్లల బట్టలూ, అవీ జాగ్రత్తగా ప్లాస్టిక్ బుట్టతో సర్దుతూ.

‘‘పతిదేవుల ఆజ్ఞ యీ టైం వరకే కాబోలు!’’ అని రుక్మిణి నవ్వుతూ అన్నా ఆ మాటల్లో, నారాయణరావు - పట్ల ఆమె హృదయంలో దాగి వున్న ఏహ్యభావం, లీలా మాత్రంగా ప్రతిధ్వనించింది.

అన్నపూర్ణ ఛర్రుమంది. ‘‘ఆయన ఊసెత్తకు. కావలిస్తే పదిరోజులున్నా. ఆయన గారేం అనరు. కానీ నాకే యిష్టం లేదు. ఒకరిళ్ళలో పడివుండటం, ఒకరి సొమ్ము తేరగా తినటం, నా మనస్సుకు నచ్చదు!’’

క్షణకాలం, రుక్మిణితో బాటు, ఊర్మిళ కూడా నిర్ఘాంత పోయింది అన్నపూర్ణ విసిరిన విసురుకు రుక్మిణే ఆ అఘాతంనుంచి త్వరగా కోలుకుంది.

‘‘పోన్లే-ఇక నేనూ విన్నాట్టే పిలవను. నేనూ, నా సొమ్మూ, చాలా అపవిత్ర మైనవి!’’ ఎంత మృదువుగా అన్నా ఆ మాటల వెనుక దాగివున్న వాడికీ, వేడికీ చలించి పోయింది ఊర్మిళ.

అన్నపూర్ణ మెల్లిగా వచ్చి, రుక్మిణి భుజం మీద చెయ్యివేస్తూ అంది: ‘‘క్షమించు రుక్కూ! కోపంతో అన లేదు నేను. ఎంచేతో

ఓ బలహీనతుంది నాలో—ఏ చిన్నమాట ఆయన్నన్నా సహించ లేను. నా భర్తలోని లోపాలు నేను దిద్దుకోవటానికి ప్రయత్నించ గలను. కాని మరొకరు, ఎంత సన్నిహితులైనా గానీ-ఎత్తి చూపితే మాత్రం సహించలేను....''

క్షణకాలం ఊర్మిళకు మాధవరావు గుర్తుకొచ్చాడు మామ గారి వ్యాఖ్యలూ, గుమాస్తాల నవ్వులూ, వాటి వెనకాల స్థిరంగా వుండే అతడూ....

ఆ లోపాన్ని సహించక తప్పని పరిస్థితుల్లో వున్న తను.... అన్నపూర్ణలాటి ఆశయాలు తనకూ వున్నాయి. కానీ అవి ఆచర ణలో పెట్టగలిగిన అవకాశాలేవీ?

''రేపు ఆఫీసుకు సెలవులేదు కూడాను!'' ఖంగుమంది అన్నపూర్ణ గొంతు.

''అలా చెప్పరాదూ!'' నవ్వేస్తూ అంది రుక్మిణి. లోపలికి వెళ్ళి, అన్నపూర్ణకు రెండు మంచి చీరెలూ. రెండు జాకెట్లూ, పూలూ, పండ్లూ, పిల్లలిద్దరికీ రెండు ప్యాకెట్లు బొమ్మలూ, బట్టలూ తెచ్చి ఇచ్చింది.

''ఇలాటి పన్నీ చేస్తావనే, నీ ఇంటికి రావాలంటే భయం!'' అంది అన్నపూర్ణ, ఇంకేదేనా అంటే రుక్మిణి మనస్సు నొచ్చుకుం టుందేమోనని సందేహిస్తూ.

''చెప్పానుగా- ఇది నా ఇల్లు, నా ఇష్టం!'' అంది రుక్మిణి నవ్వి.

అన్నపూర్ణనూ, పిల్లలనూ కారులో పంపి లోపలికి వచ్చిన రుక్మిణి ముఖం కళా విహీనమై పోయిఉండటం గమనించింది

''చూశావా ఊర్మిళా, ఎంతమాటందో అన్నపూర్ణ! పెళ్ళీ, పెడాకులూ లేని దాన్ననీ, భర్తపట్ల గౌరవం ఎలాటిదో తెలియని దాన్ననీ అన్యాపదేశంగా చురకవేసింది. అవునా?'' అంది, సోఫాలో నిస్పృహగా కూలబడి.

"అబ్బెబ్బె! అదేంకాదు. అన్నపూర్ణ మనస్తత్వం మనకు తెలీదూ? అయిందానికీ, కానిదానికీ, పుట్టినే నాలిక పీక్కుంటుంది" అంది ఊర్మిళ, సర్దిచెబుతూ.

"ఉఁహూఁ! ఈరోజు పెద్ద దెబ్బేవేసింది నా హృదయం మీద," రుక్మిణి తల విదిల్చింది. "నాకూ ఆత్మ విమర్శ కలుగుతోంది కూడాను. మీలాటి కుటుంబ స్త్రీలలో నాకు స్థానం లేదు. మీలాటి వారి కెన్ని పెట్టుపోతలు జరిపినా, మిమ్మల్ని ఎంత గౌరవించినా, మీరంతా నన్ను 'రుచులు తెలిసిన కన్య!' అన్నట్లు చులకనగా చూస్తారు. ఇంకా కొందరైతే నా వేషాలు తమ కెక్కడ వంటబడ తాయోనని తప్పుకు తప్పుకు తిరుగుతారు. పైపైన పెదవులతో అభిమానాలు కురిపించటమేగానీ, అరమరలేని ఆత్మీయత వర్షించదు కదూ?"

ఊర్మిళకు క్షణకాలం ఏం మాట్లాడాలో తోచలేదు. రుక్మిణి బాధేమిటో తనకు తెలుసు. కాస్సేపాగి, మెల్లిగా అంది "పోనీ! ఇంత వరకూ ఎంతో కొంత డబ్బు సంపాదించావు, పేరు ప్రతిష్ఠ లార్జిం చావు. ఇక జీవితంలో స్థిరపడరాదూ?"

రుక్మిణి ఎటో చూస్తూ కూర్చుండి పోయింది. అవుననలేదు. కాదనలేదు. ఆమె మనసులోనూ ఏదోభావం కదలాడుతోంది. అస్పష్టంగా ఏవో కొన్ని ఆకృతులు దోబూచులాడుతున్నాయి.

"ఓ భర్త, ఓ బాధ్యత అంటూ ఏర్పడితే, నీకూ ఈ చికాకు లేవీ వుండవు. ఆదర్శప్రాయమైన గృహిణిగా, కావలిస్తే నటన ఓ ఉద్యోగంలా, వృత్తిలా కొనసాగించినా, ఎవరూ వేలెత్తి చూపేందుకు ఆస్కారం వుండదు. అవునా?" మృదువుగా చెప్పి, రుక్మిణి వేపు చూచింది ఊర్మిళ.

రుక్మిణి అలాగే ఆలోచిస్తోంది.

కాస్సేపాగి, ఆలోచనలనుంచి తేరుకుంటూ, నిట్టూర్చి మెల్లిగా అంది—"అవును ఊర్మిళా! అదే మంచిదని తోస్తోంది నాక్కూడా. ఈ విషయం బాగా ఆలోచిస్తాను, ఇంతవరకూ పట్టించుకోలేదు. కానీ

యిక ఆలోచించి, నిర్ణయించుకోవలసిన అవసరం వచ్చినట్లే వుంది. రేపు సుధాకర్‌తో కూడా చర్చిస్తాను.''

''సుధాకర్ ఎవరూ?'' కుతూహలంగా అడిగింది ఊర్మిళ.

"ఓహ్! నీ కతగాణ్ణి పరిచయం చెయ్యలేదు కదూ? నాకు బాగా సన్నిహితుడు. స్నేహితుడు. బాగా డబ్బున్నవాడు. ఓ పెద్ద ప్రైవేటు బ్యాంకుకు మేనేజరు అందగాడు. చాలా విషయాల్లో నా కతగాడు మంచి సలహాలిస్తాడు. రేపొస్తాడులే చూస్తావుగా?" ఆక్షణం లో రుక్మిణి కళ్ళల్లో కనిపించిన వెలుగురేఖల్లో ఏవో అర్థాలు స్ఫురించాయి ఊర్మిళకు.

"ఇంతకూ అతగాడికి పెళ్ళయిందా?" అంది సాలోచనగా స్నేహితురాలివంక చూస్తూ.

''ఓహ్! నీకు పొద్దున లేచింది మొదలు 'పెళ్ళి' 'పెళ్ళి' అన్న పలవరింతలానేవుంది...." చనువుగా కోప్పడింది రుక్మిణి. వెంటనే అంది మళ్ళీ- "పెళ్ళన్నది ఈ రోజుల్లో పెద్ద విలువైన విషయమేమీకాదు నా దృష్టిలో! సుధాకర్‌కూ అంతే ననుకుంటాను. అవటాని కతగాడికి పెళ్ళిఅయింది. కానీ అతగాడి భార్య పుట్టినింటే వుంటుంది. ఆవిడకూ బ్రతకటానికి కావలసినంత డబ్బూ. ఆస్తీ వుంది...."

ఆశ్చెపడ్డట్లు చూసింది ఊర్మిళ- "అదేమిటి ఆవిడ ఇతగాడి దగ్గర కెందుకు రాలేదు?"

రుక్మిణి నవ్వింది. "అలా గాభరాపడక. పల్లెటూళ్ళో వుండి వుండి నీ మెదడు ఎట్టే పెరిగే అవకాశం లేక పోయిందల్లేవుంది నాకు చూడగా. ఇవి ఇక్కడ అతి మామూలు విషయాలు- శ్వాస తీసుకున్నంత తేలిక విషయాలు! ఎవరైనా దంపతులు ఆత్మీయంగా వున్నారంటే, విడ్డూరంగా చూచేరోజులివి! ఆవిడ రాకపోవడానికి ఎన్నో కారణాలు.... ఇతగాడికి ఆవిడంటే మోజులేదట! ఆవిడకు ఇతగాడి 'వరసలు' నచ్చవట. ఎన్నో! ఇంకెన్నో! మొత్తం మీద ఇద్దరి కిద్దరూ స్వేచ్ఛాజీవులు. అవన్నీ ఎవరూ చర్చించరు. ఎవరి గొడవా, ఎవరిగోలా వాళ్ళవి. ఇక పడుకుందాం!" రుక్మిణి వెళ్ళిపోయింది తన గదిలోకి.

తనకు పరిచయంలేని ఆ సుధాకర్‌ను గురించిన రకరకాల ఆలోచనలు గజిబిజిగా క్రమ్ముకున్నాయి, ఊర్మిళ మన సంతా.

మరుక్షణంలో రుక్మిణిఅన్న చివరిమాటలు గుర్తొచ్చాయి. నిజమేనేమో! తను కూపస్థ మండూకంలా, ఆ పల్లెటూరిలో, అత్త మామల అజమాయిషీలో, పెంపుడు జంతువులా. బ్రతుకు గడిపేస్తున్నదవటం వల్లనేనేమో, తన కిలాటివి కొంత విడ్డూరంగానూ. అపరిచితాలుగానూ మిగిలి పోతున్నాయి. తను, రుక్మిణి అన్నపూర్ణ ఒకే చదువు చదివారు. ఒకే రకమైన వాతావరణంలో పెరిగారు.

కాని తరవాత రుక్మిణీ అన్నపూర్ణల జీవితాలకు తగినంత స్వేచ్ఛా వాతావరణం అమరటం వల్లా, వారికి ప్రపంచంతో ప్రత్యక్ష సంబంధం వుండటం వల్లా, వాళ్ళిద్దరూ తనకంటే బాగా (మానసికంగా) ఎత్తు పెరిగారు. లోకం పోకడ ఆకళింపు చేసుకున్నారు.

కానీ తనకా అవకాశం లేకపోయింది. దట్టమైన నీడలో నాటబడిన మొక్కలా, తన మెదడు ఇంటి వాతావరణాన్ని దాటి పైకి పెరగలేదు.

# 8

ఆలోచిస్తున్నది. 'మంగలి సుబ్బి లేచి పోయిందట!' అని తన అత్తగారితో ఎవరైనా చెబితే 'బొరా పిదప కాలం!' అంటుం దావిడ. ఔను. అలా లేచి పోవటం తప్పు!'' అని సమర్థించే స్థితికి దిగజారిపోయింది తన మనసు.

ఏ పరిస్థితుల్లో లేచిపోయింది? అందుకెవరెవరు బాధ్యులు? పల్లెటూళ్ళో పుట్టినంత మాత్రాన ఆ 'సుబ్బి'కు సొంత ఆలోచన ఉండకూడదా? సొంతనిర్ణయా ఉండకూడదా? వాళ్ళమ్మమ్మ మేనమామను పెళ్ళాడింది. వాళ్ళమ్మనూ మేనమామ కిచ్చే కట్టబెట్టారు, సుబ్బినూ మేనమామకే యిచ్చి చేస్తామన్నారు. అది ఎదురు తిరి

గింది. లేచిపోయింది, కాపు వీరన్నతో. తరతరాల జాతి బానిసత్వం లానే, తరతరాల మానసిక దాస్యం. జుగుప్సాకరమైనది కాదా?సుబ్బు చేసిన పని తప్పా? ఎలా తప్పు?

మూడు తరాలుగా ఒకే కుటుంబ సభ్యుల రక్తం అటూ ఇటూ కలిసిపోవటంతో, ఆ కుటుంబంలో పుట్టిన బిడ్డల్లో ఎందరు అవిటివాళ్ళు, ఎందరు మతి మాలిన వాళ్ళు వున్నారో ఎవరైనా గుర్తించారా? ఆ అవిటితనానికీ, ఆ మతిలేనితనానికీ, ఆ బలహీనపు శరీరాలకూ కారణం-వియ్యాలూ, గాలులు అనటం వింటూనే తనెందుకు ఆ అజ్ఞానాన్ని మౌనంగా సమర్థిస్తోంది? సహిస్తోంది!

ఇదొకరకమైన మానసిక దాస్యం - దౌర్బల్యం!

ఛీ .. ఛీ.... తను ఎదగాలి. తన సొంత ఆలోచనలు స్వేచ్ఛగా వెల్లడింప గలగాలి తన చుట్టూగావున్న ప్రపంచం ఎలా మార్పు చెందుతోందో, ఆ మార్పుల్లోని మంచి, చెడులేమిటో తను చర్చించుకో గలగాలి. అందుకు ఒకే ఒక మార్గముంది. తనిప్పుడున్న ఆ పంజరాన్ని భేదించాలి. దానినుంచి బయట పడాలి. ఉద్యోగం చెయ్యాలి. తనకూ ఓ ప్రత్యేక వ్యక్తిత్వం అంటూ ఏర్పరచుకోవాలి.

ఇందుకు కొంత ధైర్యమూ కావాలి! ఒక్కసారిగా తనలో వచ్చిన మార్పుకు మాధవరావు తన సమ్మతి తెలపక పోవచ్చు.... అత్తగారూ, మామగారూ- నేలమీద విరిగి విరుచుకు పడ్డట్లు నిశ్చేష్టులు కావచ్చు....తనకి శాపనార్థాలు పెట్టి, కొడుకును రెచ్చగొట్టి తన నిర్ణయాన్ని మళ్ళించాలని చూడవచ్చు. 'ఆయమ్మ కిక్కడేం తక్కువైందని ఉద్యోగానికెళ్ళింది? లంకంత ఇల్లూ, సిరీ సంపదా, పాడీపంటా ...' అంటూ పాడిందేపాటగా వూరంతా ముక్కుమీద వేలేసుకోవచ్చు. అవేవీ తన నిర్ణయాన్ని మార్చలేవు. తన స్వేచ్ఛను అరికట్టలేవు.

సింహాన్ని బోనులో బంధించవచ్చు. కానీ దాని సహజ దర్పాన్నీ, రాజసాన్నీ అణచ లేరెవరూ. చిలకను పంజరంలో బంధించ వచ్చు. కానీ, స్వేచ్ఛకోసమైనదాని ఆరాటాన్ని అణచలే

రెవరూ. తనూ అంతే! శారీరకంగా బంధించబడి వుంది. మానసికంగా తనూ ఏనాడో ఆ బంధాలను విడగొట్టుకుంది.

ఇహ ఇప్పుడు ఓ దృఢ నిర్ణయం చేసుకుంది. రుక్మిణికి మంచి పలుకుబడి వుంది. పలుకుబడి గలిగిన వ్యక్తుల పరిచయమూ వుంది. తనకు ఉద్యోగం ఇప్పించటం ఆమె కేమంత శ్రమ కాదు.

తాను శాశ్వతంగా మాధవరావుకూ, నిండుకుండవంటి దాంపత్య జీవితానికీ దూరం కావాలని కోరుకోవటంలేదు. కోరి అప మార్గాలు త్రొక్కుదామని ఆరాటపడటం లేదు. తన క్కావల్సింది స్వేచ్ఛ. స్వేచ్ఛ, స్వేచ్ఛ! తన భావాలు వెల్లడించుకొనే స్వేచ్ఛ!

తన కిష్టమైన పద్ధతులలో తన ఇంటినీ, జీవితాన్నీ దిదుకో గలిగిన స్వేచ్ఛ!

మూర్ఖంగా వెనుకటి తరాల అనవాయితీలతోనే, అడుగులు వేయటం కాకుండా, గతంలోనూ, వర్తమానంలోనూ, భవిష్యత్తు లోనూ 'మంచి' ని మాత్రమే ఏరుకుని, మూఢత్వాన్ని వదిలించుకుని ముందుకు నడచిపోగల స్వేచ్ఛ!

అందుకై తను విమర్శలు ఎదుర్కొనాల్సిందే! తాత్కాలికంగా మాధవరావుకూ తనకూ ఎడబాటు కలిగినా సరే!

"తమరు పెడతారా చిలకలకు పాలు, నన్ను పెట్టమన్నారా?" వినయంగా వచ్చి అడుగుతున్న నౌకరు మాటలతో ఆలోచనలనుంచి తేరుకుంది ఊర్మిళ.

"పద నేనే వస్తాను," అని మేడమీద తన గదిలోవున్న చిలకల పంజరాలకేసి నడిచింది.

ఇదో క్రొత్త వ్యాపకం. తనంత మక్కువ పడటం చూచిన రుక్మిణి మొన్నను అంది కూడా- "నీకా చిలకలు కావాలంటే తీసుకో ఊర్మిళా?" అని. "మరి నీకో?" అంది తను.

"నాకేమిటి? రేపే పాటికి వంద చిలకలు కొనక్కొ రమ్మం టాను! పంజరాల్లో పెట్టి అమ్ముతుంటారు. చూడటానికి సరదాగా వుంటుందని-నాలుగు దుప్పులను, ఓ యాభై పావురాలను, పది తెల్ల కుందేళ్ళను తోటలో మచ్చిక చేసి వుంచుదా మనుకున్నాను. ఆ[illegible]

కూడా ఇచ్చేశాను. వాటితోబాటు మరో రెండు చిలకలకూ ఆర్డ రిస్తాను. నాకు వాటన్నిటితో ఆడే తీరికా, ఓపిక వుండేడ్చిందా ఏమిటి? పుస్తకాలలానే విలువగల వస్తువుల లానే, ఇవీ ఓ 'షో' ఓ కొత్తదనం-అంతే!'' అంది.

తనకు రుక్మిణి వస్తువులేమీ వద్దు. ఈ చిలకలు మాత్రం చాలు!

తనూ ఓ నిర్దిష్టమైన జీవన సరళి ఏర్పాటు చేసుకుంటుం దిక మీదట. తన ఊహలలోని ఆ జీవితంలో ఈ చిలకలూ ఓ భాగంగా మారి తీరుతాయి.

ఊర్మిళ రెంటినీ ప్రేమగా కాస్సేపు నిమిరి, పంజరాల్లో పెట్టి, వెళ్ళి హాయిగా పడుకుంది. ఎప్పుడూ పట్టనంతటి గాఢనిద్ర పట్టిం దామెకు మరుక్షణంలో.

# 9

ఉదయం నుంచీ అన్నపూర్ణకు పిచ్చిపట్టి నట్లుంది. ఎంతకూ పని తెమల్లేదు. అవతల ఉరుకులు పరుగులమీద వస్తున్నాడు సూర్య భగవానుడు. ఈ మహా నగరంలో ఇల్లనబడే ఈ 'గూడు' దొరికే సరికి ఎన్ని అవస్థలు పడ్డారో గుర్తుకొచ్చింది అన్నపూర్ణకు. కారణం ఆ విషయాన్ని గుర్తుకు తెచ్చిన సంఘటన జరిగింది ఆముందు రాత్రి. ప్రక్క-వాటాలోవున్న తన లాటి ఉద్యోగస్థురాలు శ్రీ లక్ష్మిని ఆవిడ భర్త తాగుబోతు రాఘవరావు, రాత్రి పదకొండు గంటలవేళ తాగివచ్చి, చావుదెబ్బలు కొట్టడం మొదలెట్టాడు దాంతో అన్ని వాటాలవాళ్ళూ, కలవరంగా లేచి పరుగెత్తారు. అందరికీ కలిపి ఒకే పెరడూ. ఒకే వరండా కావటంవల్ల, ఏ వాటాలో ఏం జరిగినా, పబ్లిక్ రోడ్డుమీద జరిగినట్లు, పదుగురికీ తెలుస్తుంది. ప్రణయాలు, అంతే ప్రమాదాలు అంతే! ఒక వాటాకూ, మరోవాటాకు మధ్య రహస్యాలు లేవు. ఉండటానికి అవకాశంలేని విధంగా నిర్మించబడ్డ 'గూళ్ళు' అవి.

తలో వేపూ పట్టుకున్నాక కూడా, ఇంకా గింజుకుని గింజుకుని, భార్యను కొట్టాలని ఊగిపోయాడు రాఘవరావు. ఆ సరికే దెబ్బలతో అలిసి పోయిన ఆమె ఇక ఏడ్చే ఓపిక కూడా లేకుండా కూర్చుండి పోయింది. మరో వాటాలో వున్న ముప్పైఏడేళ్ళ కుమారి రాధ వచ్చి, ఉక్కుతోచక ఏడుస్తున్న శ్రీలక్ష్మి పిల్లలను ముగ్గురినీ సముదాయిస్తూ తన వాటాలోకి తీసుకెళ్ళింది. ఆ రాత్రికి శ్రీలక్ష్మిని తమ ఇంట్లో పడుకో బెట్టుకుంది అన్నపూర్ణ.రాఘవరావును అతగాడి వాటాలో వేసి, బయట గొళ్ళాలు పెట్టారంతా కలిసి.ఈ అసహ్యాకరమైన 'వినోదం' ప్రతి పది, పదిహేను రోజులకూ జరిగేదే అయినా, ప్రతి సారీ అన్నపూర్ణ శరీరం జలదరించి పోతుంటుంది. ఈ రోజు ఆ కంపరం పరాకాష్ఠ నందుకుంది.

"ఇలా చావు దెబ్బలు తింటూ పడివుండటం నీ కసహ్యంగా లేదూ శ్రీలక్ష్మీ? లక్షణంగా వుద్యోగం చేసుకుంటున్నదానివి. హాయిగా, వేరుగా వుండరాదూ? ఈ దెబ్బలైనా తగ్గుతాయి!" అంది అన్నపూర్ణ- శ్రీలక్ష్మి ఏడుపు ఆపుకుని కుదుటబడ్డ తర్వాత.

శ్రీలక్ష్మి ఏడుస్తూనే నవ్వింది-"ఎక్కడ వుండేదండీ? ఆదరించే పుట్టింటివారా? మెట్టినింటివారా? ఇరువేపులా ఎవరికి వారికి తడిపి మోపెడంత సంసారా లున్నాయి. నేనూ ఓ బరువుకానూ వారికి? పోనీ వేరుగా వుందామంటే, ఈ పిల్లలతో ఒంటరిగావుండే నాకు రక్షణ ఎక్కడ చెప్పండి? తప్పు నాది కాకున్నా. అందరూ చులకనగా చూడరూ? అసలాయన్ని వదిలి పిల్ల లుండలేరు! తాగిన మైకంలో ఎప్పుడైనా నన్నిలా కొడతారుగానీ, పిల్లల్ని కసురుకోవడం కూడా చెయ్యరు, పిల్లలకి వాళ్ళ నాన్నమీద వల్లమాలిన ప్రేమ ..."

"బావుంది!" నిట్టూర్చింది అన్నపూర్ణ. "పోనీ కొట్టే కారణం ఏమిటో తెలుసా నీకు?" నిర్లిప్తంగా అడిగింది అన్నపూర్ణ.

"ఆహా! 'ఉద్యోగం చేస్తున్న దానివి, పది మందిలో తిరగ నేర్చిన దానివి, నువ్వు పవిత్రంగా వున్నావా?' అనే అనుమానం అంతరాంతరాలలో వుందాయనకు. అది ఏదో ఓ సాకుతో ప్రకోపించి

నప్పుడు, బాగా మైకంలో ఏడుస్తున్నప్పుడు [illegible]
ఆయనే పశ్చాత్తాప పడ్డారు.''

"భగవాన్!" లోలోపల అనుకోబోయి పైకే అనేసింది, అన్నపూర్ణ "మరి మీరా ఉద్యోగం మానేసెయ్యరాదూ? ఆయనే సంపాదించి పెడతాడు," అంది.

"ఊఁహూఁ! నా పిల్లల భవిష్యత్తుకోసమైనా నేను ఉద్యోగం చెయ్యాలి! ఆయన గారికి పిల్లల మీద ప్రేమ వుందేగాని, బాధ్యత లేదు. అలాటప్పుడు కేవలం ఆయనగారి సంపాదనమీద ఆధార పడితే, పిల్లల భవిష్యత్తు మాటేమిటి?''

అన్నపూర్ణకు తల తిరిగిపోవడం ప్రారంభించింది. ఇదెక్కడి సంసారం! అంత బాధ పడుతూ, ఆ మొగుణ్ణే నమ్ముకు పడుంటానంటుం దీవిడ!

కాస్సేపట్లో శ్రీలక్ష్మి నిద్రపోయింది—అన్నపూర్ణకు నిద్ర ఎగిరిపోయింది.

"మీరూ మేలుకునే వున్నారా, అన్నపూర్ణగారూ? పిల్లలు నిద్రపోయారు. తోచక నేనిలా వచ్చాను'' అంటూ వచ్చింది కుమారి రాధ.

అందాకా పక్కగదిలో పిల్లల దగ్గర పడుకుని నిద్రపోతున్నట్లు నటిస్తున్న నారాయణరావు దిగ్గునలేచి వచ్చాడు- రాధ గొంతు విని, మంచినీళ్ళుతాగే నెపంతో.

"ఊఁ!'' మూలిగింది అన్నపూర్ణ.

"అబ్బబ్బ! వీళ్ళ సంసారం కాదు గానీండి. నాబోటి పెళ్ళి గాని అమ్మాయిలకు పెళ్ళాడటమంత మహా పాపం మరొకటి లేదని నిరూపిస్తున్నారు!'' అంది రాధ నిట్టూర్పుతూ.

"వాళ్ళొకళ్ళే దొరికారా ఉదాహరణకు?" నవ్వుతూ చర్చలోకి దిగాడు నారాయణరావు.

రాధ సిగ్గుపడుతూ, "మీ సంసారం మంచి ఉదాహరణే అనుకోండి....'' అంటూ నాన్చింది. గొప్పగా కళ్ళు చికలించి నవ్వాడు నారాయణరావు.

చూస్తూ మురిసి మూర్ఛపోతున్నందుకుగాదు. ఆ అమ్మాయికీ, అత గాడికీ ఇలాటి చిన్న చిన్న 'సరసాలు' అలవాటే. అది తను లెక్క చేసుకోదు కూడా. కానీ ఈ అర్ధరాత్రివేళ ఈ కుమారీమణి, తన శ్రీవారు ఏదో ఓ సాకుతో అనవసర చర్చ సాగించటం తన కసలే దూరమైన నిద్రను మరి కస్త దూరం చెయ్యటమేనని చిరాకుగా ఉంది.

"మీ దాంపత్యం చూడ ముచ్చటగా వుంటుంది అన్నపూర్ణ గారూ! తగువులు లేవు, పోట్లాటలు లేవు. హాయిగా ఇద్దరి కిద్దరూ అర్థం చేసుకుని...."

రాధ మాటలు మధ్యలో వుండగానే, కోపం గొంతుకలోనే అణుచుకుంటూ, అంది అన్నపూర్ణ—"అంతా బావుంది గానీ రాధా! నువ్వూ పెళ్ళిచేసుకోరాదూ? ఈ అర్ధరాత్రి లెక్చర్స్ తగ్గుతాయి!"

రాధ త్రుళ్ళిపడి అరిచింది—"ఒద్దండీ! ఒద్దు—పెళ్ళి నా కొద్దు! హాయిగా సంపాదించుకుంటున్నాను. ఇష్టమైతే ఒకరికి నాలుగు రూపాయలు ఇస్తాను. కష్టమైతే మానేస్తాను. పెళ్ళి, పిల్లలూ అంటూ జంజాటంలో దిగదల్చుకోలేదు."

"మంచిది. పోయి పడుకో!" ఇక ఆ చర్చకు అంతుండదని, అక్కడితో తేల్చేసింది అన్నపూర్ణ. రాధ విధిలేక వెళ్ళిపోయింది. నారాయణరావూ పడుకున్నాడు.

అన్నపూర్ణకు నవ్వూ, జాలీ కూడా వచ్చాయి. పెళ్ళినిగురించి అంత అసహ్యం ప్రకటించిన రాధ అస్తమానం పెళ్ళిని గురించే ఆలోచిస్తూంటుందని తనకు తెలుసు. ఎన్నో మార్లు "మీకేమండీ, చల్లనినీడ వుంది. చక్కని పిల్లలున్నారు. నా కెవ రున్నారు, నా ఆలోచనలూ, ఆనందాలూ పంచుకోవటానికి!" అని అన్యాపదేశంగా అనటం తనకు తెలుసు. తీరిక చిక్కినపుడల్లా చౌకబారు సెక్స్ మాసపత్రికలూ, ఇంగ్లీషు సెక్స్ నవలలూ చదువుతూ, వుప్పొంగే తృష్ణకు అడ్డు కట్ట వెయ్యాలని వ్యర్థప్రయత్నం చెయ్యటం తనకు తెలుసు. 'ఏం జీవితం నాది? ఈ జీవితం నా కొద్దు.' అని నిట్టూర్చటం తనకు తెలుసు. వీలు చిక్కినపుడల్లా తన భర్తతో, పక్క

వాటాల్లోని మగవారితో, ఏదో ఓ సాకుతో తర్క, వితర్కాలుచేసూ అందరినీ ఆకర్షించాలని, అదో సరదాగా మానసికంగా తృప్తిపొందటం తనకు తెలియని విషయం కాదు.

అయితే 'నాకు పెళ్ళి వొద్దు' అన్న వాచకంలో 'నా కింకా పెళ్ళవుతుం దనేనా మీ ఆశ? నా వయసు ముప్ఫై ఏడు! నేను పైకి చెప్పుకొనేది యిరవై ఏడు!' అనే ధ్వని వుందేమో!

మొత్తంమీద ఈ సజ్జుతో తన మతి పోతోంది. ఇంతకంటె మంచి యిల్లు నరొకటి తీసుకుందా మనుకుంటే, ఆ మంచి ఇళ్ళ బాడుగలు వింటూ వుంటే, కళ్ళు తిరుగుతాయి! తన జీతంలో సగం ఇంటి బాడుగకు పెడితే, ఇక తినేదేమిటి?

అలా ఆలోచిస్తూనే పడుకుంది. ఎప్పుడో, ఏ నాలుగు కొడుతున్నప్పుడో నిద్ర పట్టింది.

నిద్ర మెలుకువ వచ్చేసరికి ఆరుదాటింది.! ఇక మూడు గంటల వ్యవధిలో కాఫీలు, టిఫిన్లూ, వంట, పిల్లల భోజనాలు పూర్తయి, ఇల్లు సర్దుకుని, తాళంవేసి బయల్దేరాలి. బస్‌స్టాప్‌లో ఓ గంట సర్కస్ చేస్తే గాని బస్సుదొరకటం, గమ్యం చేరుకోటం జరగదు.

అందులో ఈ వేళ కొళాయిలో నీళ్ళు బంద్ అయిపోయాయి. మధ్యాహ్నం ఊర్మిళ వస్తుంది, రాత్రికి భోజనానికి రమ్మంది తను. ఈ పూట ఆఫీసుకు వెళ్ళి, మధ్యాహ్నం సెలవు పెట్టి రావాలి.

ఊర్మిళను తలుచుకున్న కొద్దీ తనకి ఏదో ఈర్ష్యగా ఉంది. ఊర్మిళ ఎంత నిండు కుండలా వుంది!. చీకూ చింతా లేని దానిలా వుంది, గంభీరంగా వుంది.

అవును. ఆవిడకు తనలా వుద్యోగం చెయ్యాల్సిన అవసరం లేదు. ఇలా నురగలు గ్రక్కుతూ పరుగులు తీయాల్సిన అవసరం లేదు. ఇలాటి ఇరుకు అద్దె కొంపల్లో, రకరకాల సమస్యల సంసారాల మధ్య ఇరుకుగా జీవితం గడపాల్సిన బాధలేదు! అందుకే అంత హాయిగా వుంది. గుంభనగావుంది. తను.... తనకా అదృష్టం లేదు.

ఊర్మిళ ముందు తనూ బయట పడకూడదు. కాని ఎలా? తనున్న వాతావరణమే తన పరిస్థితుల్ని పట్టి యిస్తుంది కదా!

పోనీ! స్నేహితురాలు — దానిదగ్గర దాపరికాలేమిటి? ఆలోచనలతో తల పగిలిపోయింది — గంట ఎనిమిది కావొస్తోంది. గబగబ ఒళ్ళు తెలియనంతటి వేగంతో పనులు చేసుకోవటం మొదలెట్టింది అన్నపూర్ణ.

# 10

సాయంత్రం ఊర్మిళ వచ్చింది, రుక్మిణి కారులో. ఆ సరికే వంటంతా సిద్ధం చేసి, విశ్రాంతిగా కూర్చుని వుంది అన్నపూర్ణ. నారాయణరావూ, పిల్లలూ కూడా ఇంటి దగ్గరే వున్నారు.

పక్కవాటా వారిని బ్రతిమాలుకుని, ఆ ఒక్కరోజుకూ, వారు వాడుకుంటున్న డాబా మీద పడుకోవటానికి అనుమతి తీసుకుంది అన్నపూర్ణ.

అన్నపూర్ణ, ఊర్మిళ మేడ మీదకు వెళ్ళి కూర్చున్నారు.

"చుట్టుప్రక్కల ఎలావున్నా, నా ఈచిన్న పోర్షన్ నాకు బాగా నచ్చింది ఊర్మిళా! ఈ మహా నగరంలో ఈ మాత్రం ఇల్లు దొరకాలంటే, ఆరునెలలు తపస్సు చెయ్యాల్సిందే! పగలంతా ఉద్యోగం చేసివచ్చినా, సాయంత్రం అయ్యేసరికి ఇలా హాయిగా, స్వేచ్ఛగా వుంటుంది." అన్నపూర్ణ అనర్గళంగా అబద్ధం చెప్పేసింది.

'స్నేహితురాలితో ఎందు కింత అబద్ధం చెప్పానా!' అన్న మీమాంసలో పడిపోయింది. అయినా, నగర జీవితంలో, 'కాఫీపొడి వుందా?' అన్న ప్రశ్నతో తెల్లారితే, 'లేదు' అన్న జవాబులు అలా పొడిగిస్తూనే వుండక తప్పని అలవాటయిపోయింది. తా నీరోజు వున్నది లేదని అబద్ధ మాడటంలేదు, లేని గొప్పవున్నట్లు ప్రదర్శిస్తోంది. తప్పేముందీ అనుకుని సమాధాన పడింది.

ఊర్మిళ తలూపింది. ఆమె హృదయంలోనూ సన్నని ఈర్ష్యలాంటి భావం రేగింది. ఇల్లు, పరిసరమూ చూస్తే, తమ వూళ్ళో

ఇల్లూ, లోగిలితో పోల్చుకుంటే, ఇరుగ్గావున్నట్లు తోచినా, అన్నపూర్ణ అనుభవిస్తున్న స్వేచ్ఛాయుతమైన జీవితం తనకు లేదన్న అసంతృప్తి ఆమె కళ్ళల్లో కొట్టవచ్చినట్లు కనిపించింది అన్నపూర్ణకు.

"పల్లెటూళ్ళో మా అత్తగారూ, మామగారూ ఉన్నారు. కొంత ఆస్తీ, పెద్ద ఇల్లూ వున్నాయి. అక్కడ హైస్కూలూ వుంది. కాలేజీ కూడా పెడదామంటున్నారు త్వరలోనే..." అన్నపూర్ణ తిరిగీ మొదలెట్టింది.

"మరి మీ రక్కడే వుండకూడదూ అన్నపూర్ణా! హాయిగా పెద్ద ఇల్లూ, పాడీ, పంటా, తక్కువ ఖర్చూ వుంటాయి! పిల్లల చదువుకీ ఇబ్బందిలేదు" అంది ఊర్మిళ, ఆశ్చర్యం ప్రకటిస్తూ.

అన్నపూర్ణ కళ్ళు పెద్దవి చేసి గుండె మీద చెయి వేసుకుని "అయ్య బాబోయ్! అక్కడా? మేముండటమా." అంది.

"ఏం?" మరింత విస్మయంతో అడిగింది ఊర్మిళ.

"ఏ మేమిటే వెర్రిదానా! అక్కడ మా అత్తగారికి అన్నీ చాదస్తాలే. మడీ, ఆచారం అంటూ, ప్రాణాలు తోడేస్తుంది. ఇక మామగారు సరే సరి! మా వారి జీతం డబ్బులు పైసలతో సహా లాక్కుంటారు. నేనిక ఉద్యోగం చెయ్యటానికి వీలుండదు ఇక పెద్దవాళ్ళిద్దరిదే పెత్తన మౌతుంది. నాకో చీరె కొనుక్కోవాలన్నా, పిల్లలకో చొక్కా కొనాలన్నా, ఓ పిప్పరమెంటు ఇవ్వాలన్నా, అన్నిటికీ వాళ్ళిద్దర్నీ అడగాలి. దేవిరించాలి! తీరా ఆయనగారి సంపాదన ఖర్చుపెట్టి కుంటున్నా, వారి దేదో త్రవ్వి పెడుతున్నట్లు ప్రచారం చేసుకుంటారు మాటలు పడాలి. ఆ మధ్య ఇల్లు దొరక్క, ఓ నెలరోజు లక్కడ వున్నాలే— భోగమంతా అప్పు డనుభవించాను! అంతే—సుస్థిర నిర్ణయాని కొచ్చాను. ఎట్టి పరిస్థితుల్లోనూ ఉద్యోగం వదలను. హాయిగ స్వేచ్ఛగా బ్రతుకుతాం. పిల్లల్ని నా యిష్ట ప్రకారం పెంచుకుంటాను. పెట్టుకుంటాను. ఏమంటావ్?"

ఊర్మిళ ఏమీ అనే స్థితిలో లేదు. సుధాకర్‌తో మాట్లాడాలి తార పలుకుబడితో ఓ ఉద్యోగం సంపాదించుకోవాలి. తనూ తన దైన ఓ వ్యక్తిత్వాన్ని ఏర్పరచుకోవాలి.

"ఏమిటి ఊర్మిళా? ఉన్న పళాన పరధ్యానంలో పడ్డావ్? శ్రీవారు జ్ఞాపకమొచ్చారా ఏమిటి? "అంది అన్నపూర్ణ భుజం తడుతూ.

ఉలిక్కి పడింది ఊర్మిళ. "ఊఁహూఁ! లేదు పొద్దు పోయింది — క్రిందికి వెడదాం పద భోజనం చేశాక-రుక్మిణి కారు పంపిస్తానంది—వెళతాను" అంది ఊర్మిళ లేస్తూ.

అన్నపూర్ణ అభ్యంతరం చెప్పదల్చుకోలేదు. తమకే యిరుగ్గా వున్న ఈ కొంపలో మూడోవ్యక్తిని భరించగల శక్తి తనకు లేదు. అసలురంగు బయటపడటమూ తన కిష్టంలేదు. అయినా పైకి మాత్రం అంది—"అదేం? రుక్మిణిలా నేను సర్వసౌకర్యాలూ అమర్చలేక పోవచ్చుకానీ, వున్నంతలో పచ్చడి. అన్నం పెట్టలేక పోనుగా!"

ఊర్మిళ తల అడ్డంగా వూపింది—"లేదు.... లేదు.... అలా అనుకోవటం లేదు, అన్నపూర్ణా, నేను. ఎలాగా ఇక్కడే వుంటా నుగా నేను కొన్నినెలలు .. వస్తూ వెళ్తూవుంటాను. మరో మారు వచ్చి మీయింట్లో నాలుగు రోజులుంటాను."

"ఇక్కడ కొన్ని నెల లుంటావా?"—పుట్టినింటిలో కూడా పట్టుమని పదిరోజులుండని ఊర్మిళ, ఇక్కడ కొన్ని నెలలుంటా ననటం విడ్డూరంగా తోచింది అన్నపూర్ణకు.

"ఊఁ — ఉద్యోగం చేస్తాను." ఆసరికే ధృఢ నిశ్చయాని కొచ్చిన ఊర్మిళ చాలా నెమ్మదిగా, స్థిరంగా అంది

"ఉద్యోగం చేస్తావా?" అదిరిపడి అడిగింది అన్నపూర్ణ. "ఊఁ! కొంపదీసి మీ వారితో ప్రణయ కలహం లాటిదేదైనా జరిగి వచ్చేశావా? ప్రళయం సృష్టించ బోతున్నావా?" ఆందోళన వెలిబుచ్చింది.

ఊర్మిళ నవ్వింది- "లేదు అలాటిదేం లేదు. ఈమధ్య నా ఆరోగ్యం అంత బాగా లేదు. కొన్నాళ్ళు పుట్టింట్లో వుండమని డాక్టరు సలహా! అమ్మ, నాన్నగారూ కంగారు పడతారని ఇలా ట్రిప్స్ వేసు కున్నా! వూరికే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవటం నాకు బాగాలేదు. అందుకే ఉద్యోగం చేద్దామని బుద్ధి పుట్టింది!" ఊర్మిళకు తన సమా ధానం తనకే వింతగా తోచింది.

అన్నపూర్ణ ఊర్మిళకేసి నిశితంగా చూచింది. ఆ మసక చీకటిలో ఆమె ముఖంలోని భావాలు స్పష్టంగా కనిపించలేదు కానీ, కొద్దిగా కంపిస్తున్న ఊర్మిళ కంఠస్వరంబట్టి 'ఏదో దాస్తూంది' అన్న విషయం మాత్రం బోధపడింది.

"పదపోదాం!" ఇక సంభాషణ పొడిగించటం ఇష్టం లేనట్లు మెట్లకేసి నడిచింది ఊర్మిళ. అనుసరించింది అన్నపూర్ణ.

పిల్లలకూ, నారాయణరావుకూ భోజనాలు పెట్టి. తర్వాత ఊర్మిళ, అన్నపూర్ణ భోజనానికి కూర్చున్నారు. నారాయణరావూ వచ్చి కూర్చున్నాడు వంటింటి గడపమీద.

"మీరు మళ్ళీ ఆవిడతో అనకండి గానీ—ఊర్మిళగారూ! మీ రెందుకు ఆవిడ ఇంట్లో వుంటున్నారూ?" అన్నాడు. అసలే అతగాడి రాకతో ముద్ద మింగుడు పడని ఊర్మిళకు ఆ ప్రశ్న, ఆ ప్రశ్నలోని 'ఆవిడ' పచ్చివెలక్కాయలా అడ్డుపడి, గొంతుక పట్టినట్లయింది.

అన్నపూర్ణ ఛర్రుమంది. 'ఏం? ఎందుకుండ కూడదూ? మా రుక్మిణేం కాని పని చేసింది? మే మంతా ఉద్యోగాలు చేస్తున్నట్లే, అదీ 'నటన' అనే ఉద్యోగం చేస్తోంది. మన మంతా, ఇష్టమున్నా లేకున్నా—ఆఫీసర్లు నవ్వితే నవ్వటంలా? వాళ్ళు విసిరే జోకులు, డోకులు తెప్పిస్తున్నా, వింటూ భరించటంలా? జీవితంలో ఇంతగా నటిస్తున్న మనం, తెరమీద నటించే దానిని అసహ్యించుకోవటం, తెలివితక్కువతనం కాదూ?"

ఊర్మిళ నిర్ఘాంత పోయింది. భర్తను అంత నిశితంగా విమర్శించే అన్నపూర్ణ, అతగాడిని మరొక రెవరయినా ఓ మాట అంటే చాలు. విరుచుకు పడుతుంది!

నారాయణరావు- వెకిలిగా నవ్వాడు. "నువ్వేమైనా చెప్పు. పరువుగల మనబోటి వాళ్ళుం వుండవలపిన చోటు మాత్రం కాదు."

"మళ్ళీ అదే మాట." అన్నపూర్ణ ఎగిరి పడింది. "మొన్నను నాకెన్ని చీరెలు, పిల్లలకు బట్టలు పెట్టింది! మీరు చెప్పే 'పరువుగల' చోట్ల ఎంద రెంత అభిమానంతో పెడుతున్నారు?"

నారాయణరావు వికవిక నవ్వాడు. "పెట్టకేం చేస్తుందోయ్! దిక్కులేనంతగా వచ్చి పడే డబ్బు నేం చేసుకుంటుంది ఒక్కర్తీ? ఓ మొగుడా మొద్దులా? పిల్లా పీచా? మీకూ కొనిచ్చిందాండీ బహూ మతులు?" అన్నాడు ఊర్మిళకేసి తిరిగి.

ఊర్మిళ మాట్లాడలేదు. రుక్మిణి ఇతగానిగురించి చెప్పిన మాటలు నెమరువేస్తున్న ఆమె మనసు, అందుకు నిదర్శనం దొరికి, అసహ్యంతో, కోపంతో నిండిపోయిం దా క్షణంలో. మంచి నీళ్ళు తాగే నెపంతో పూరికే వుండి పోయింది ఊర్మిళ.

"మీ కెందు కా వూసు?" ఈసడింపుగా అంది అన్నపూర్ణ.

"నా కెందుకులే! మీ ఆడవాళ్ళ కబుర్లు! ఊర్మిళగారూ! నే నిలా అన్నానని మళ్ళీ ఆవిడగారితో అనకండేం!" అంటూ ముందు గదిలోకి వెళ్ళిపోయాడు నారాయణరావు.

ఊర్మిళ కిక ఆకలి చచ్చిపోయినట్లయింది. ఎలాగో భోజనం ముగించింది. అన్నపూర్ణ మాత్రం ఇల్లు సర్దుతూ గొణుక్కుంటూ నే వుంది భర్త మాటలకు. ఇంతలో, రుక్మిణి పంపిన కారు వచ్చింది.

"నే వెళతా!" అంది ఊర్మిళ.

అన్నపూర్ణ తాంబూలం ఇస్తూ, "అలాగే! కానీ ఉద్యోగం సంగతి బాగా ఆలోచించి మరీ ఆ పని చెయ్యి ఊర్మిళా!" అని మాత్రం అంది. "అలాగే!"

కారు కదలి వెళ్ళిపోయాక, చాలా సేపు మౌనంగా వుండి పోయింది అన్నపూర్ణ. నిండుకుండలాటి ఊర్మిళ.... కొద్దిపాటి అనా రోగ్యం కారణంగా, డాక్టర్ సలహా యిస్తే మాత్రం! మాధవరావు లాటి విదానమైన భర్త సహకారంతో, నిగ్రహంతో కొన్ని నెలలు గడప లేదా? అందుకు ఉద్యోగం సాకు చేసుకోవడం అవసరమా?

"అన్నపూర్ణా! సరదాగా నే నన్నమాటలు లెక్కచేసుకోకు. ఆవిడ మరో సారి పిలిపిస్తే, తప్పక వెళ్ళు. చీరెలూ గివ్వీ ఇస్తే నిరాకరించకు." భుజం మీద చెయ్యి వేసి మెల్లిగా చెబుతున్న భర్త మాటలకి ఉలిక్కిపడి, అతగాడివేపు కంపరంగా చూసింది అన్నపూర్ణ.

వాటి హద్దులూ నాకు తెలుసు. ప్లీజ్! మీ రెళ్ళి పడుకోండి.''




''వీరే సుధాకర్! ఈమె నా స్నేహితురాలు ఊర్మిళ'' పరిచయం చేసింది రుక్మిణి.

ఒక్క చూపులోనే అందగాడు అనిపించే సుధాకర్ వేపు రెప్ప పాటు కాలం చూచి, 'నమస్కారం' అంటూనే కళ్ళు వాల్చేసుకుంది ఊర్మిళ.

ముగ్ధత్వం రూపు దాల్చినట్లున్న ఊర్మిళను చూస్తూ, క్షణ కాలం తనను తాను మర్చిపోయాడు సుధాకర్. ఇద్దర్నీ గమనించిన రుక్మిణి చిరునవ్వు నవ్వుకుంది. తనకూ మొదట్లో ఇలాగే వుండేది ఆ సిగ్గూ, భయమూ ఈనాడు ఏ దిగంతాలకు పారిపోయాయో తనకే తెలీదు.

''అన్నట్టు, నువ్వూ ఏదో ఫిలిం డిస్ట్రిబ్యూషన్ కంపెనీ పెడుతున్నావని విన్నాను. నిజమేనా సుధాకర్?'' మౌనాన్ని భంగం చేస్తూ అంది రుక్మిణి.

సుధాకర్ నవ్వాడు. ''ఇంకా ఆ ఆలోచన నా బుర్రలో నే ఓ షేప్ తీసుకో లేదు. నీ దాకా వచ్చేసింది! ఇక పెట్టక తప్పేలా లేదు—''

''అక్కడికి నన్నేదో ఉద్ధరించ బోతున్నట్లు!''

''వినండి మీ స్నేహితురాలి మాటలు!'' ఊర్మిళకేసి మరో సారి పరకాయించి చూసే అవకాశం తీసుకుంటూ అన్నాడు సుధాకర్. ''పొద్దున లేచి—'ఇలా చేద్దాం సుధాకర్, అలా చేద్దాం సుధాకర్' అంటూ సవాలక్ష ఆర్డర్లూ, సలహాలూ ఫోన్ లోనూ, ముఖా ముఖీని జారీ చేస్తుంటుం దీవిడ. ఒక్కో సారి నేను తన మాట విన

లేదని అలక సాగిస్తుంది కూడాను.... మళ్ళీ నా మీదే నింద వేస్తుంది!"

ఊర్మిళ మాట్లాడ లేదు. భర్తతో తప్ప చనువుగా మరెవ తోనూ మాట్లాడలేని ఊర్మిళకు సుధాకర్ ధోరణి చిరాకనిపించి మధ్యలో తనను ఇరికించటం ఎందుకో?

"సర్లే. ఈ కబుర్లకేం గానీ—ఓ సాయం కావాలి!"

"జీ హుజూర్!" తమాషాగా నవ్వాడు సుధాకర్.

"మా ఊర్మిళకు మీ కంపెనీలో ఏదైనా ఉద్యోగం ఇవ్వాలి గౌరవానికీ, జీతానికీ లోటుండ కూడదు. రుక్మిణి మాట లింకా పూర్తి కాకముందే, అదిరి పడి ఊర్మిళ కేసి చూసాడు సుధాకర్—

"మీకా? ఉద్యోగమా?"

ఊర్మిళ తలూపింది కానీ ఆమె మనసులో కోపం సుడుల తిరిగింది. మొన్నను అన్నపూర్ణా అంతే—"నువ్వా? ఉద్యోగం చేస్తావా?"అంది. ఆ రోజు రాత్రి రుక్మిణితో తన నిర్ణయం చెప్పినపుడు రుక్మిణి కూడా అచ్చు ఇలాగే, "నీకేం పిచ్చా? నీ కెందుకు వుద్యోగం?" అంది. వీళ్ళందరి దృష్టిలో తనంత బెదురు గొడ్డా? అనర్హురాలా?

ఊర్మిళ ఆలోచన చెదరగొడుతూ, రుక్మిణి నవ్వుతూ అంది "అలా అనకు. ఆ మాటే నే నన్నానని ఓ రోజంతా నాతో మాట్లాడ లేదు అలిగి!"

"మీరు అలగ గలరా?" సుధాకర్ చిత్రంగా నవ్వాడు.

ఊర్మిళ పలకలేదు.

"ఓ! మా బాగా! సర్లే—ఇంతకూ నే చెప్పిన పని?" రుక్మిణి ప్రశ్నించింది.

"నువ్వు చెప్పటమూ, నే చెయ్యక పోవడమూనా! ఊర్మిళ గారు తప్పని సరిగా ఉద్యోగం చేస్తానంటే, నేనూ తప్పని సరిగా ఇస్తాను. రేపే జాయిను కావచ్చు," అన్నాడు సుధాకర్. మరో మారు ఊర్మిళను నఖశిఖ పర్యంతం పరిశీలిస్తూ.

"సరే! రేపు మీ ఆఫీసూ అదీ చూపించి, వర్క్ అదీ చెప్పు. ఈ పరిసరాలకూ, పనులకూ అలవాటు పడేవరకూ జాగ్రత్తగా దగ్గరుండి చెబుతూండు! అసలే భయస్థురాలు. నాలా కాదు సుమా!''

ఆ చివరి ముక్కలో కోటి అర్థాలు స్ఫురించాయి ఊర్మిళకూ, సుధాకర్‌కూ.

"యస్, కమాన్! సుధాకర్ నీతో చాలా మాట్లాడాలి!'' రుక్మిణి మేడ మీదకు వెళ్ళిపోయింది. సుధాకర్ కూడా వెళ్ళాడు.

ఓ గంట తర్వాత రుక్మిణీ సుధాకర్‌లు హుషారుగా మేడ దిగి వచ్చారు. వెంటనే కారులో వెళ్ళిపోయారు.

ఊర్మిళ కిదేం నచ్చక పోయినా, తను రేపట్నుంచీ చేయబోయే ఉద్యోగాన్ని గురించి, ఆ సంగతి తెలిసి మాధవరావు ఏమంటాడో, పరిణామా లెలా వుంటాయో అనుకుంటూ ఊహా గానాలు చెయ్యటంలో తనను తాను మర్చిపోయింది.

## 12

వారం రోజుల్లో ఊర్మిళ కేదో కొత్త ఉత్సాహం వచ్చినట్లయింది. మొదటి రోజు సుధాకర్ తన ఆఫీసుకు తీసికెళ్ళి, తనకో సీటు చూపించి, చేయవలసిన వర్క్ వివరంగా చెప్పాడు. ఏదైనా సందేహాలొస్తే, పక్కనున్న సాటి ఉద్యోగినులనూ, ఉద్యోగులనూ అడిగి తెల్సుకోవచ్చని చెప్పాడు. హాళ్ళందరితోనూ- ఆవిడ క్కాస్త పని అలవాటు అయ్యేవరకు, సాయం చెయ్యమనీ చెప్పాడు.

తను చెయ్యాల్సిన పని ఏ మంత ఎక్కువగా లేదు ఊర్మిళకు. కొన్ని కాగితాలు కాపీలు రాయటం, మరి కొన్ని రాసిన కాగితాలు సరి చూచి, పోస్ట్‌కు పంపేవి పంపెయ్యటం ....

ఉదయాన్నే లేచి, పది గంటల లోపుగా తయారై, ఆఫీసుకు రావటం, సాయంత్రం ఐదున్నరకు ఇంటికి వెళ్ళటం, మధ్య మధ్య మిగతా వారితో కబుర్లు చెప్పటం-చాలా సరదాగా వుం దామెకు.

ఓ మూల, ఈ రోజో రేపో మాధవరావు వస్తాడేమో. తన ఉత్తరానికి జవాబు ఏమని వస్తుందోనన్న శంక పీడిస్తున్నది. తనకు లభ్యమయిన ఈ స్వేచ్ఛాయుత జీవితపు మాధుర్యంలో ఆ ఆలోచన లకు అట్టే ప్రాముఖ్యం వుండటంలేదు కూడాను.

"ఈ నెల కాగానే నేను వేరే రూం గాని, ఇల్లు గాని తీసు కుంటాను!" అందా రోజు ఊర్మిళ రుక్మిణితో.

"ఏం! నాతో అక్కర తీరిపోయింది కాబట్టా?" నిష్ఠూరంగా అంది రుక్మిణి.

"ఛ....ఛ....అదేంలేదు...." నావ్వేసింది ఊర్మిళ. "నాకూ ఇల్లు ఎక్కువై ఏడుస్తున్నాను. తోడుగా వుంటావని ఆశించాను. మేడ మీద మూడు రూములూ నీకు కేటాయించాను. మీ శ్రీవారొచ్చినా ఇబ్బంది లేకుండా మరోరూం మీకు బెడ్‌రూంగా మార్చాను. నీ యిష్టం. ఈ సౌకర్యాలు చాల వనుకుంటే, మరెక్కడైనా ఇల్లు చూడ మంటే చూస్తాను!" అంది రుక్మిణి గంభీరంగా.

ఊర్మిళ నొచ్చుకుంది "సౌకర్యాలు లేక కాదు...."అంది.

"మరి? డబ్బెక్కువైందా? బాడుగ ఇద్దామనివుందా? ఆల్‌రైట్. ఇవ్వు—పుచ్చుకుంటాను."

ఊర్మిళ మాట్లాడలేదు. తప్పుచేసిన దానిలా తలవంచుకుంది.

"ఏడ్చావులే, పద-గట్టిగా మాట్లాడటమైనా చేతకాదు. నీకు వైర్ వచ్చింది ఇందాక-మీ శ్రీవారు ఈరోజు సాయంత్రం వస్తు న్నారట. తెరమీద రోజుకో మొగుడితో కాపురాలు వెలగబెడుతున్న నేను—నిజమైన దాంపత్యం ఎలా వుంటుందో నన్న కుతూహలంతో తమ ఇద్దరినీ చూడాలని వువ్విళ్ళూరుతూంటే, ఇల్లు చూచుకుం టుందిట!" రుక్మిణి టవల్ తీసుకొని బాత్‌రూం వేపు వెళ్ళింది.

సాయంత్రం మాధవరావు వస్తున్నాడు! ఏమంటారో? దెబ్బ లాడుతారా? దెప్పుతారా? 'నేను నీకేంలోటు చేశా'నని నిలవేస్తారా? ఏమో? ఇక ఆలోచించలేకపోయింది ఊర్మిళ.

"స్టేషన్‌కు వెళ్ళవూ ఊర్మిళా?" అంది రుక్మిణి, అలాగే కూర్చుని వున్న ఊర్మిళని పలకరిస్తూ.

"ఊఁహూఁ"

ఆ ఒక్క మాటలోనూ-వెళ్లాలన్న కౌతుకమూ వుంది; ఆ సంగతి తెలిస్తే రుక్మిణి అట పట్టిస్తుందేమో నన్న భయమూ వుంది. రుక్మిణి తెలుసుకుంది.

"సర్లే! నేనే వెళ్ళి రిసీవ్ చేసుకుంటాను. బై దిబై-స్టేషన్‌లోనే చెప్పేస్తాను-మీ ఆవిడ మీ మీద అలిగినట్టుందండి అని...."

"నీ యిష్టం"-ఊర్మిళ నవ్వింది. నిజానికి తన భర్త వచ్చాక, తమ ఇద్దర్నీ ఏకాంతంగా వదుల్తుందో లేదో ఈ రుక్మిణి అన్న బెంగ ఆమెలో వుంది ఆ క్షణంలో.

"సర్లే. నా కెందుకు మీగొడవ. నాకు షూటింగ్ వుంది. స్టేషన్‌కు కారు పంపిస్తాను. మీ వారికేమేం కావాలో, ఏ ఇంట్లో లానే ఇక్కడా జరుపు-సరేనా?" జవాబు ఆశించకుండా రుక్మిణి వెళ్ళిపోయింది.

వచ్చిన మాధవరావును తలెత్తి చూడలేక పోయింది ఊర్మిళ. క్షణకాలం "అదేం అలా చిక్కిపోయావు? ఒంట్లో బాగాలేదా." అన్నాడతగాడు, దగ్గరగా వస్తూ.

తనను తాను నమ్మలేక పోతూంది ఊర్మిళ. కారుమబ్బులు క్రమ్ముకుని, ఇప్పుడో, ఇంకో క్షణంలోనో ఉరుములు, పిడుగులతో కుండపోతగా వర్షం పడుతుంది కాబోలని భయపడుతున్న తరుణంలో హఠాత్తుగా పండువెన్నెల కాస్తే మనిషి మనస్థితి ఎలా వుంటుంది? సరిగ్గా అలాగే వుంది ఊర్మిళకు.

"బాగానే వుంది!"

రుక్మిణి హెచ్చరిక ఫలితంగా, నౌకర్లు మాధవరావుకు సకల సదుపాయలూ అమర్చి వుంచారు.

మేడ మీద తమకై కేటాయించబడిన బెడ్‌రూంలోకి దారి తీసింది ఊర్మిళ.

"నా ఉత్తరం చేరిందా? నేను ఉద్యోగంలో చేరానని మీకు తెలిసిందా?" అందాకా ఆందోళనగా వున్న ఊర్మిళ ఒక్కసారిగా అడిగింది.

మాధవరావు చిరునవ్వునవ్వాడు-"ఉత్తరం చేరింది అన్నీ తెలుసు-ఏం?''

"మరి మీకు కోపం రాలేదూ, మీ అనుమతి లేకుండా నేనిలా-"

మాధవరావు సుతారంగా ఆమె పెదవుల మీద చూపుడు వేలుంచి వారించాడు.

"ఇందులో కోపపడేందు కేముంది? నీ కిలా బావుంటుందను కున్నావ్! నువ్వేం చిన్న పిల్లవు కావు. చదువూ, సంస్కారం లేని దానివి కావు. నీ బాగేమిటో, ఓగేమిటో తెలియని దానివి కావు. మధ్య నా అనుమతి ఎందుకు?''

ఊర్మిళ కా సమాధానం నచ్చలేదు- అంత కంటే, 'ఎందు కిలా చేశా'వని అతగాడు కోప్పడినా హాయిగ వుండేది అలాకాక, తనకు పట్టని వారెవరి విషయమో అయినట్లు నిర్లిప్తంగా వూరుకోవడం ఆమెకు బాధ అనిపించింది.

తనంత తానుగా రెచ్చిపోతూ అంది- "ఆ పంజరపు బ్రతుకు ఆ ఎదుగూ బొదుగూ లేని కీలుబొమ్మ బ్రతుకు, నాకు దుర్భర మని పించింది! నా వ్యక్తిత్వాన్ని ఇలా స్వేచ్ఛగా మలుచుకుందా మను కున్నాను-తప్పా?''

మాధవరావు సున్నితంగా ఆమె దేహం చుట్టూ చేతులు పెన వేశాడు. "తప్పన్న దెవరు ఊర్మిళా? అమ్మా, నాన్నగారూ బాధ పడ్డారు. ఊళ్ళోవాళ్ళు విస్తుబోయారు. అమ్మయితే, నాతో కూడా బయలేరుతానంది. నిన్ను వెనక్కి తీసుకు వెళ్ళటానికి-నేను వద్దన్నాను. నేనైనా ఎందు కొచ్చానో తెలుసా?"

"నీ కోసం మాత్రం కాదు అని చెప్పటానికి!" కోపంగా అంది ఊర్మిళ.

"ఊహూఁ! నీ ఇష్ట మొచ్చినంత కాలం ఉద్యోగం చెయ్యి. నీకు కష్టమని తోచినప్పుడు నాకు రాయి-వస్తాను, పిల్చికెడతాను అని చెప్పటానికి.''

"అంటే-మీరు మాత్రం అక్కడేవుండి పోతారన్నమాట?"

"ఆఁ!'' దృఢంగా పలికింది మాధవరావు స్వరం.

“నీకు పంజరం అనిపించింది నాకు హాయిగా వుం దనిపించ వచ్చు. నీకు హాయి అనిపించింది నాకు వెగటు అనిపించవచ్చు. అంత మాత్రాన మన మిద్దరం ఒకరి కొకరం మానసికంగా దూరం ఎందుకు కావాలి? నీ మార్గంలో నువ్వూ, నామార్గంలో నేనూ, ఆత్మీయంగా, మన మధ్య ఆత్మీయత ఏ మాత్రం తరగకుండా వ్యవహరించ కూడదా?”

ఊర్మిళ నిరుత్తర అయింది.

“నేను నాలుగు రోజు లుంటా నిక్కడ. చాలా రోజులుగా నాన్నగారు ఆలోచిస్తున్న వ్యాపారం తాలూకు భోగట్టాలు కొన్ని కావాల్సివచ్చాను. బహుశా ఆ పనిమీదే అప్పుడప్పుడూ వస్తూంటాను” మాధవరావు ఇక ఏమీ మాట్లాడనివ్వలేదు. ఊర్మిళను మాట్లాడలేదు.

మాధవరావు ఉన్న నాలుగురోజుల్లోనూ రుక్మిణికి అట్టే షూటింగులు లేవు ఊర్మిళ ఆఫీసుకు సెలవు పెట్టలేదు. “నేను ఫోన్‌లో చెబుతాను సుధాకర్‌తో-మీ శ్రీవారొచ్చారనీ. నువ్వు ఆఫీసుకు రావటానికి వీలు కాదనీ.... అతగా డేమీ అనడు. వడ్డించే వాడు మనవాడైనప్పుడు చివరి పంక్తిలో కూర్చున్నా ఫర్వాలేదు....” అని రుక్మిణి చెప్పకపోలేదు.

అయితే ఊర్మిళ మండి పడింది—“నిన్ను ఉద్యోగం ఇచ్చే మనిషిని చూపించ మన్నానే కానీ, ఉట్టినే జీతం ఇప్పించమనలేదు. అలా అడుగడుక్కీ నీ పలుకుబడి ఉపయోగించి, నీ స్నేహితురాలిని కదా అని మొగమాటంపెట్టి డ్యూటీ ఎగగొట్టి డబ్బు తీసుకోవటం కంటే నీచమైన పని మరొకటిలేదు,” అని ఒప్పుకోలేదు.

రుక్మిణి ఇక మాట్లాడలేదు.

కాస్సేపు బయటి పనేదో చూచుకు వచ్చి, తన గదిలో అస్తమానం అలా ఖైదీలా కూర్చుని వుండే మాధవరావును చూస్తుంటే రుక్మిణికి ఎంతో జాలి కలిగేది. “ఈ భార్యా భర్త లిద్దరికీ, ఒకరితో ఒకరికి తప్ప, ఇతరులతో మాటలూ, సరదాలూ లేవల్లే వుంది!” అనుకుం దెనో.నూగు

“మీ వారిని చూస్తుంటే జాలేస్తోంది—పంజరంలో చిలకలా గదిలో జపం చేస్తుంటారు అస్తమానూ!” అనేసింది ఊర్మిళతో.

“మా వాళ్ళే నేనూ అంతేనని, ఇన్నాళ్ళకయినా వారికి అర్థమయి వుండాలి ” ఆ మాట అక్కసుతో పైకి అన్న ఊర్మిళ నాలిక కరుచుకుంది. అంతలోనే మాట మార్చేస్తూ. “అంత జాలికలదానివి ఎలాగూ ఖాళీగానే వున్నావుగా, కాస్త కాలక్షేపం అయ్యేలా చూడ రాదూ నే నొచ్చేవరకూ!” అంది నవ్వుతూ.

ఊర్మిళ అన్న మొదటి ముక్కలోనే కథేమిటో చాలా వరకూ, తెలుసుకుంది రుక్మిణి. ఊర్మిళ ఉద్యోగంకోసం తహతహ లాడినపుడే కొంత ఊహించుకో గలిగింది.

“అలాగే! నీకు చనువువల్ల నిర్లక్ష్యం వుండొచ్చు. కానీ నాకు మాత్రం ఆయనగారు అరుదైన అతిథి! అంచేత ఆయనగారికి కాలక్షేపం అయ్యేలా నేనే చూస్తాను” అంది రుక్మిణి.

“రక్షించావు....” అనేసి వెళ్ళిపోయింది ఊర్మిళ.

## 13

“ఎంత సేపలా గదిలో కూర్చుని పుస్తకాలు చదవగలరూ? అలా బీచికి వెళ్ళొద్దాం. రాగలరా?”

హఠాత్తుగా రూంలో అడుగెట్టి, అడుగుతున్న రుక్మిణి ప్రశ్నకు క్షణకాలం ఆశ్చర్యపోయాడు మాధవరావు. అంతలోనే సంబాళించుకున్నాడు

“పదండి, వెళదాం” అన్నాడు.

అంత త్వరగా అతడు అంగీకరిస్తాడని రుక్మిణి అనుకోలేదు.

“ఊర్మిళ కీరోజు ఆఫీసులో ఆలస్యమవుతుందిట. వచ్చేవరకూ

ఆరడుగుల మనిషి అలా-గోచిపోసి కట్టిన పంచెతో, సిల్కు-లాల్చీతో హుందాగా మెట్లు దిగుతూంటే, క్షణకాలం రుక్మిణి హృదయం గుబగుబ లాడింది.

"ఎంత అందం.... ఏం పర్సనాలిటీ.... దర్పం.... చాలా బావుం టాడు మాధవరావు. ఊర్మిళ చాలా చాలా అదృష్టవంతురాలు...." అందామె మనస్సు నందమార్లు.

కారు డ్రైవ్ చేస్తూ క్రీగంట అతణ్ణి పరిశీలిస్తూనే వుందామె. అతడు రోడ్డుమీద నిలిపిన స్థిరమైన చూపులు అతడి నిగ్రహాన్నీ, నిశ్చల సంకల్పాన్నీ, హృదయాన్నీ ప్రతిబింబిస్తున్నట్లు తోచింది.

ఊర్మిళలో ఏదో అసంతృప్తి రేగిందనీ, తాను ఆ వాతావర ణంలోనుంచి బయట పడాలని ఆరాట పడుతోందని ఆమె చెప్పక పోయినా — రుక్మిణి గ్రహించుకోగల్గింది మాధవరావు ఇక్కడికి వచ్చాక-అతడికీ, ఊర్మిళకూ మధ్య పెద్ద రగడే జరుగుతుందని భయ పడింది. అందుచేతే, పిలవంది అటువేపు వెళ్లొద్దని నౌకర్లను కట్టుదిట్టం చేసింది తానూ షూటింగ్ల నెపంతో బయట గడిపింది. కాని వా రిద్దరి మధ్యా ఏ రభసా జరుగ లేదు. అంత నమ్మకం వుండబట్టే, ఊర్మిళ, ఆతగాడి అనుమతి తీసుకోకుండానే, ఉద్యోగంలో చేర గలిగింది. ఎంత మంది భార్యల కంతటి అదృష్టం వుంటుంది?

కానీ.... తనకు అర్థంగాని విషయమల్లా ఒక్కటే. ఇంత చక్కటి రూపమూ, సంస్కారమూగల మాధవరావు సమక్షంలో, తానైతే యుగమొక క్షణంగా, నరకంలో నయినా గడిపి వెయ్య గలదు. ఎంత చేదు జీవితాన్నయినా అమృతంలా అనుభవించ గలదు. ఎంతటి అసంతృప్తినయినా తృప్తిగా మార్చుకో గలదు. తనకి కావల్సింది ఇలాటి భర్తే!

"ప్లీజ్.... స్పీడు తగ్గించండి....!" మాధవరావు తనవేపు చూసి, నవ్వుతూ స్నేహపూర్వకంగా చేసిన హెచ్చరికతో రుక్మిణి వులికి పడింది.

తనెంత స్పీడ్గా డ్రైవ్ చేస్తోందో, తన ఆలోచన లెంత

కళ్ళలోకి చూస్తున్న అతడి లోతైన చూపులు, తన గుండె చీల్చి అంచులో చెలరేగుతున్న ఆలోచనల్ని పసిగడుతు న్నట్లనిపించింది కూడా. ఛ....చ స్నేహితురాలి భర్త.. ఏమి టీ పాడు ఆలోచనలు?

''స్పీడ్‌గా డ్రైవ్ చెయ్యడం నా హాబీ. ఎక్స్క్యూజ్ మీ. మెల్లిగా, జాగ్రత్తగా డ్రైవ్ చేస్తాను!'' అంది మెల్లిగా.

మొదటిసారిగా తన స్వరంలో కలవరమూ, తన ఎదలో ఏంత స్పందనా గుర్తించిం దామె.

మాధవరావు చిరునవ్వు నవ్వాడు. అదే సమ్మోహనకరమైన నవ్వు! బీచిలో కూర్చున్నాక కానీ రుక్మిణికి తెలిసి రాలేదు. ఒక పర పురుషుని ప్రక్కన తాను ఒంటరిగా కూర్చున్నానన్న విషయం. ఇన్నేళ్ళుగా ఎందరు పురుషుల ప్రక్కనో భార్యగా నటించింది. నవ వధువుగా శోభనపు గదుల్లో నటించింది. వెన్నెలలో విహరించింది. ఏ నాడూ తన శరీరంలో గానీ, హృదయంలో గానీ ఇలాటి తీవ్ర సంచలనంగానీ, సిగ్గుగానీ, స్త్రీ సహజమైన కలవరం గానీ అనుభవంలోకి రాలేదు. అది కేవలం నటన. ఆ కాసేపూ తన పెదవుల కదలికమీదా, తన డైలాగ్ డెలివరీమీదా, తన ఫేషియల్ ఎక్స్ప్రెషన్స్ మీదా, తన మేకప్ మీదా, కెమెరా యాంగిల్స్ మీదా మాత్రమే తన దృష్టి, మనసూ కేంద్రీకరించబడి వుండేవి ఆ 'టేక్' అయిపోగానే. 'ఫర్వా లేదు, బాగా నటించాను. ఈ పిక్చర్‌తో నా ప్రతిష్ఠ, నటనా మరో మెట్టు పైకి పోవచ్చు' అన్న ఫీలింగే తప్ప, మరో భావానికి ఆస్కారం వుండేది కాదు.

కానీ యీనా డలా కాదు మాధవరావును చూచిన మరు క్షణంలో నే, విలక్షణమైన ఆలోచనలు బయల్దేరాయి. ఇక్కడ నటన ప్రసక్తే లేదు. నరనరమూ శ్రుతి చేయబడి నట్లు, అంతు తెలియని వీణానాద, మేదో మృదువుగా ప్రతి ధ్వనిస్తోంది లోలోపల!

చాలా సేపు మౌనంగా గడిచిపోయింది.

''ఇంటో పు సకాలతో కాలక్షేపం అయ్యేది. బీచిలో మరింత

పరవశంగా చూస్తున్న రుక్మిణి సర్దుకుంది.

"సారీ! ఇలా ఎప్పుడో గానీ, బీచికి రావటం పడదు నాకు. అలా సముద్రంకేసి, కెరటాలకేసి చూస్తూ నన్ను నేనే మర్చి పోయాను!" అంది, సంజాయిషీ చెప్పుకుంటున్నట్లు. గడగడ వాగే తన వాగ్ధార అంతా ఏమైపోయినట్టు?

"ఆ కెరటాల్ని మీలోనే ఇముడ్చుకోవా లన్నంతగా ఆవేశ పడుతున్నారు కూడాను!" అన్నాడు ఆమెకేసి చూస్తూ.

రుక్మిణి తల దించుకుంది. తనని చూచి మూర్ఛపోయే మగవా ళ్ళెందరి ముందో తను తలెత్తుకు కూర్చునేది! ఇతగాడిలోని ఏ ఇంద్రజాలమో తనని తల వంచుకునేలా చేస్తోంది.

"ఊర్మిళ ఉద్యోగం మూలంగా, మీ ఇంట్లో తిష్టవేశాను. అల్లుడి వెంట గిల్లుడిలా, స్నేహితురాలితోబాటు ఆమె భర్తను కూడా భరించాల్సి వస్తోంది కదూ మీకు?" మాధవరావే అన్నాడు మళ్ళీ.

"లేదు.... లేదు.... అలా అనకండి! నిజానికి ఊర్మిళ వచ్చాక నాకెంతో సందడిగా వుంది మీరు వచ్చాక మరింత...." 'హాయిగా' అనబోయి. అతి ప్రయత్నం మీద, ఆ మాట మింగేసింది రుక్మిణి

"ఊర్మిళకు ఉద్యోగం చెయ్యాలన్న సరదా చాలా కాలంగా వుంది. కానీ అవకాశం కలిసిరాలేదు. ఇప్పుడయినా తన సరదా తీరుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. కాని మీతో పర్స నల్‌గా ఓ మాట చెబుదా మనుకున్నాను - మీరే ఈ అవకాశం కల్పించారు. ఊర్మిళ ఏ చిన్న ఆఘాతానికీ తట్టుకోలేదు నాతోతప్ప మరెవరితోనూ చనువుగా మనసులోని మాట చెప్పుకోలేదు. తను ఏ విషయంలోనైనా బాధపడ్డట్లు చూచాయగా తెలిసినావాలు—మీకు సూక్ష్మగ్రాహిత్వం ఎక్కువ, మిమ్మల్ని చూడగానే నేను గ్రహించా నా విషయం—నాకు తెలియజెయ్యండి,రెక్కలు కట్టుకు వస్తాను. ఊర్మిళను నా వెంట తీసుకు వెళ్తాను. తనంత తానుగా రావటానికి సిద్ధపడేవరకూ ఊర్మిళను నేను తీసుకు వెళ్ళను. రమ్మని బలవంత

మంత్ర ముగ్ధలా అతడివేపు చూస్తూ, అతడి పెదవులు 'ఊర్మిళ' అంటున్నప్పుడల్లా, అతడి కళ్ళలో వెలుగుతున్న మెరుపుల్ని చూస్తూ అవాక్కుగా కూర్చుండి పోయింది రుక్మిణి.

ఊర్మిళ నితగాడు ప్రాణాధికంగా ప్రేమిస్తాడు. ఊర్మిళ తప్పు చేసినా ఒప్పుచేసినా తన గుండెల్లో ఆమెను పొదువుకుంటాడు. ఊర్మిళ సంతోషం కోసం సౌఖ్యం కోసం తన సర్వస్వం త్యాగం చేస్తాడు—తన కిలాటి వ్యక్తి కావాలి! తనని ఇలా ఆరాధించే మనిషి కావాలి! తనని ఇలాగే నిండు హృదయానికి హత్తుకునే భర్త కావాలి! తనని తనుగా ప్రేమించి, తన మీద ఇంతటి అనురాగంతోనూ, కంటికి రెప్పలా చూచుకునే పురుషుడు కావాలి.

అత డెవరో ఎందుక్కావాలి! మాధవరావే ఎందుక్కాకూడదు! ఊర్మిళ .... ఊర్మిళ .... అతగాడి శ్వాసలో కూడా అదేపేరు.... అదే ప్రతిధ్వని.... అదే పలవరింత! రుక్మిణి.... రుక్మిణి ...రుక్మిణి.... అని తనకోసం అలా పరితపించే వ్యక్తి ఇతడు కాకూడదా!

తన కంత అదృష్టమా!

ఊర్మి కెంత అదృష్టవంతురాలు!

సన్నని అసూయాకెరటం ఆమె గుండెల్లో లేచి, మిన్నంటేలా పెరిగి పోయింది

"ఇలా నే చెప్పాననీ ఊర్మిళతో అనకండి—టూ సెన్సిటివ్! తనంత తానుగా ఏ నిర్ణయమైనా తీసుకోనివ్వండి. ఏ మంటారు?"

"అలాగే!" నీరసంగా జవా బిచ్చింది.

"బాగా చీకటి పడింది. మనం వెడదామా?" మాధవరావు లేచి నిల్చున్నాడు, క్రింద పరచిన రుమాలు కంటిన ఇసుక దులుపుతూ.

తనూ లేవక తప్పలేదు. నిజానికి ఈ రోజు, ఈరోజే కాదు-ఎన్ని రోజులైనా, ఎన్ని సంవత్సరాలైనా, అతడి ఎదురుగా ఇలాగే కూర్చుని వుండిపోవా లనిపిస్తోంది.

"ఊర్మిళ వెయిట్ చేస్తూంటుందేమో?" ఆమె కదలకపోవటం చూచి హెచ్చరించాడు మాధవరావు.

"ప్లీజ్! ట్రాఫిక్ గమనిస్తూ, స్పీడ్ కంట్రోల్ చేసుకుంటూ...." స్టీరింగ్ వీల్ మీద ఆమె చేతులు వేయగానే, నవ్వుతూ అన్నాడు మాధవరావు.

ప్రతిగా నవ్వింది రుక్మిణి. "మీకేం భయంలేదు. మిమ్మల్ని జాగ్రత్తగా మీ ఊర్మిళకు అప్పగించే పూచీ నాది!" ఎంత మృదువుగా అన్నా, చివరి వాక్యంలో ఏదో కృత్రిమత్వం ధ్వనించినట్లు తోచింది తనకే.

రుక్మిణీ, మాధవరావూ ఇంట్లో అడుగెట్టే సరికి ఊర్మిళ చిలకల్ని చేతిమీద కూర్చోబెట్టుకుని, కబుర్లు చెబుతోంది. ఆ రాత్రి ఎంతకీ నిద్రపట్టలేదు రుక్మిణికి, మాధవరావు రూపం మాటి మాటికీ ప్రత్యక్షమవుతూ.

# 14

"ఇలా రుక్మిణి ఇంట్లో వుండటం ఏమంత బాగా లేదు, ఊర్మిళా!" అన్నాడు మాధవరావు.

తాను రెండో సారి వచ్చినప్పుడు, ఊర్మిళ ఆఫీసుకు వెళ్ళిన టైంలో, అస్తమానం రుక్మిణి వచ్చి తన దగ్గిర కూర్చుంటూంది! ఆమె కళ్ళలో తనపట్ల ఓ విధమైన ఆరాధనా, ఆకర్షణ ప్రతి బింబిస్తున్నాయి. అలాటి పరిస్థితికి అవకాశం ఎందుకు ఇవ్వాలి? ఇదే మాధవరావు ఉద్దేశం.

"మరి రుక్మిణి ఒప్పుకోవటం లేదు!"

"నే చెబుతాలే!"

ఆ సాయంత్రమే, రుక్మిణి ఇంటికి అర మైలు దూరంలో, చిన్న ఇల్లొకటి చూచి వచ్చారు మాధవరావు, ఊర్మిళ. ఒకే ఒక గది, దానిని ఆనుకుని చిన్న వంట గది, నాలుగు వాటాలకు కలిపి,

ఒక కొళాయి. ఒక మామూలు లెట్రిన్ దానికి యాభై రూపాయలు అద్దె ఇక అంతకు మించి సౌకర్యంగా ఉండే ఇళ్ళు లేవు—ఆ బాడుగలో రావు. పైగా, తన జీతంలోనే అద్దె చెల్లించాలని ఊర్మిళ పట్టుదల. అంతకు మించిన అద్దె ఆమె భరించలేదు.

"మీ సాయానికి థ్యాంక్స్! కానీ మీ ఇంట్లో పర్మనెంట్ అతిథిగా వుండటం నా కిష్టం లేదు....." అన్నాడు మాధవరావు రుక్మిణితో.

రుక్మిణి ఇక ఏమీ మాట్లాడలేక పోయింది. మాధవరావుకు ఎదురు చెప్పటం ఆమెకు ఇష్టం లేదు.

మరునాడు ఊర్మిళ. మాధవరావు బాడుగ ఇంట్లోకి వెళ్ళి పోయారు.

అవసరమైన సామాను కొనుక్కుంది ఊర్మిళ. కానీ ఆ ఒక్క గదీ సామానులతో నిండి పోయింది. ఇక ఒక్క మంచం పట్టేందుక్కూడా చోటు లేదు.

"చాపలు వేసుకుందాం!" అన్నాడు మాధవరావు.

'రేపట్నుంచీ సర్దుకుంటాను సరీగ్గా' అనుకుంది ఊర్మిళ.

ఆ రాత్రి చాపమీద, చుట్టూరా పరచివున్న సామానుమధ్య ఇరుక్కుని, ముడుచుకుని పడుకున్న భర్తను చూస్తే జాలేసింది ఊర్మిళకు. పెద్ద మేడలో విశాలమైన ఆవరణలో—కావలసినంత గాలి, వెలుతురులో వుండే వ్యక్తి కదా అన్న ఆలోచన మరీమరి వేధించ సాగింది.

తెల్లారి లేచాక, ఊర్మిళ కొత్తబొకచే అర్థం కావటం మొద లెట్టాయి ఇబ్బందులు అన్ని వేళలా కొళాయిలో నీళ్ళు రావు. అందుకోసం, తెల్లారుఝామున లేవాలి. నాలుగు వాటాల వారూ ఎవరి స్వార్థానికి వారు ప్రక్క వారితో దెబ్బలాడి మరీ పట్టుకోవాలి నీళ్ళు! ఇక బాత్‌రూంకు 'క్యూ' సిస్టమ్ లెట్రిన్ సరే సరి.

రెండు రోజులుండి మాధవరావు వెళ్ళిపోయాడు.

వారం రోజులు తిరిగే సరికి ఊర్మిళకే అంతా అయోమయంగా కనిపించ సాగింది. దెబ్బలాడే నేర్పు లేదు. అంచేత నీళ్ళు లేవు!

బాత్ రూం ఎప్పుడూ ఖాళీగావుండదు-ఒక పూట స్నానం కూడా లేదు! వంట ఇల్లూ, వున్న ఒక్క గదీ సామాన్లతో నిండిపోయి. అన్నీ తొందరలో తన్నేసుకుంటూ, నరకంలో ఉన్నట్టుంది. దానికి తోడు సుధాకర్ వస్తాడు సాయంత్రం వేళల్లో.

"అబ్బబ్బ! తామరపువ్వు బురదలో వున్నట్లు ఎలా వున్నారండీ ఇక్కడ!" అంటాడు. అతగాణ్ణి కూర్చో బెట్టేందుకు చోటు లేదు. తను స్నానం చేసి వచ్చింది మొన్నా రోజు-సుధాకర్ వచ్చి కూర్చున్నాడు వంటింటికీ, ముందు గదికీ మధ్య తలుపు లేదు. ఇక బట్టలు కటుకోవటం ఎలా?

"ఓ! మీరు బట్టలు కట్టుకోవాలి కదూ! ఇదే డ్రెస్సింగ్ రూం, కమ్ బెడ్ రూం, కమ్ గెస్ట్ రూం అండ్ స్టోర్ రూం....మరి నేను, బయట నా కారు దగ్గర వుంటాను. మీరు డ్రస్ చేసుకోండి!'' అంటూ బయటకు నడిచాడు.

వంటింట్లో ఒదిగి నిల్చుందే కాని, తడి ఒంటితో, అస్తవ్యస్తంగా చుట్టుకున్న చీరెతో తను అతగాడికి కనిపిస్తోందన్న భావం ఆమె నరనరమూ కొరుక్కు తిన్నట్లయింది. అసలీ సుధాకర్ ఎందు కింత తరచూ రావటం?

ఈ నీళ్ళ గొడవ, బాత్ రూం గొడవ, వంట, ఇల్లు సర్దుకోవటం- అంతా అయి, ఆఫీసుకు వెళ్ళేసరికి కాస్త లేటయింది మొన్నవో రోజు—'ఎలాగయినా బాస్‌గారి....కదా! కొంత కన్సెషన్ వుంటుంది. మనల్లయితే, లేటని ముక్క చీవాట్లు వేస్తారు. అంటూ గుసగుసలు మొదలెట్టారు, సహోద్యోగులు.

సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి, కాస్త విశ్రాంతి తీసుకొనేందుకు ఆస్కారం లేదు. నాలుగు వాటాలలో ఎవరో ఒకరు పెద్దగా వాగ్వాదాలు చేస్తుంటారు. లేదా, పంచదార, కాఫీపొడి అంటూ అప్పులకు వస్తారు. ఇవ్వకుంటే మొహమాటం! నెలంతటికీ కొన్న సరుకులు పదిహేను రోజుల్లో అయిపోయాయి. వారం రోజులుగా వర్షం.

ఆ రోజు మాధవరావు వచ్చాడు. ఆ వాతావరణం తనకే జుగుప్స కలిగిస్తోంది. వంటజేసి అతగాడికి పెట్టి, ఆఫీసుకు వెళ్ళింది ఊర్మిళ.

సాయంత్రం నాలుగ్గంటలు కావొస్తుండగా రుక్మిణి వచ్చింది. మాధవరావు సాదరంగా ఆహ్వానించాడు.

ఇద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూండగా ఊర్మిళ వచ్చింది.

కాస్సేపట్లో సుధాకర్ వచ్చాడు!

వాళ్ళకి టిఫిన్ పెట్టేందుకు కూడా సరైన వసతి లేదు కూర్చునేందుకు చోటు లేదు. అదే తన వూళ్ళో, తన ఇంట్లో అయి వుంటే, కొబ్బరి బొండాలు కోయించేవాడు మాధవరావు. ఎప్పుడూ రెడీగా ఇంట్లో టిఫిన్ వుంటుంది. కూర్చోవటానికి కావలసినంత స్థలం....

"ఏమిటే ఊర్మిళా! వంటింట్లో దూరిపోయావ్?" అంది రుక్మిణి. ఏదో సిగ్గుగా, మరేదో సంకోచంగా నిల్చుండి పోయింది

"ఓ సారి మీ ఇద్దరూ మా వూరికి రాండి!" అన్నాడు మాధవరావు రుక్మిణి, సుధాకర్‌లను ఉద్దేశించి.

ఆ మాటే మనసులో అనుకుంది ఊర్మిళ.

ఈ మధ్య రుక్మిణి-మాధవరావు కోసం తరుచు వస్తోంది. ఆమెలో అతిగాడిపట్ల ఆకర్షణ అంత కంతకూ ఎక్కువై పోతుంది. ఏ క్షణాన్నయినా నిగ్రహించుకోలేక బయటపడి పోయేలా వుంది.

ఆ రోజు ఊర్మిళ ఆఫీసుకు వెళ్ళింది. ఏమీ తోచక, బయట పనులేమీ లేక, మాధవరావు ఇంట్లోనే కూర్చుని వున్నాడు. రుక్మిణి వచ్చింది.

"ఊర్మిళ లేదా."అంది-అసలా టైంలో ఆమె వుండదనితెలిసీ.

"ఆఫీస్‌టైం కదా!" అన్నాడు మాధవరావు.

"మీకూ తోచటం లేదల్లే వుంది-రండి మా ఇంటికి వెడదాం!"

"ఒద్దులెండి."

"ప్లీజ్!"

మాధవరావు ఇంటికి తాళం వేసి, బయల్దేరాడు.

పది నిమిషాల్లో కారు రుక్మిణి బంగళా ముందు ఆగింది.

"రండి, మేడ మీదకు వెడదాం!" అని ఆహ్వానించింది. మాధవరావు అనుసరించాడు. "ఈ రోజు మీ రేమనుకొన్నా సరే, మీతో చాలా చాలా మాట్లాడాలి నేను!" అంది రుక్మిణి, అతగాడి కెదురుగా సోఫాలో కూర్చుంటూ.

"తప్పకుండా!" నవ్వుతూ స్థిమితంగా అన్నాడు మాధవరావు.

"మీరు నాకు కావాలి. మీరు నాకు కావాలి!" ఓ విధమైన వేడికోలు, ఉద్వేగం నిండి వున్నాయి ఆ మాటలలో.

మాధవరావు క్షణకాలం మాట్లాడ లేదు. తర్వాత మెల్లిగా నవ్వుతూ అన్నాడు. "ఆవేశ పడకండి. నేను ఊర్మిళ భర్తను...."

"తెలుసు. అయినా నాకు మీరే కావాలి. ఊర్మిళ కాళ్ళు పట్టుకు ఒప్పిస్తాను, మీరు ఊర్మిళ దగ్గరే వుండండి. కాదనను. కానీ. జీవితంలో ఒక్క సారి.... ఒక్క క్షణం నేను మీ దాన్ననే తృప్తి చాలు నాకు! ఒక్క క్షణం నా కోసం పరితపించే వ్యక్తి, నన్ను నన్నుగా ప్రేమించే వ్యక్తి, ఒక్క రున్నారన్న తృప్తి కలిగాక, ఇక నేను చనిపోయినా....నాకు బాధ లేదు. భయం లేదు!"

మాధవరావు రుక్మిణివేపు చూశాడు, నిజమైన తపన, నిజమైన ఆవేదన, ఆరాధన పొంగి పొరలుతున్నాయి ఆమెలో! ఆమెపై ఎనలేని జాలి ముంచుకు వచ్చిం దతగాడికి.

"రుక్మిణీ!" మృదు మధురంగా ధ్వనించింది మాధవరావు కంఠస్వరం. రుక్మిణి కళ్ళలో ఆశ వెలిగింది.

"నీ ఆవేదన, నాపై నీకు కలిగిననాకు సద్భావం అర్థమయాయి. కానీ, నాగురించి కూడా నీకు చెప్పాలి. బహూశా అది విన్నాక నీ అభిప్రాయం మార్చుకుంటావేమో!"

"ఊఁహూఁ! ఏనాటికీ మీ గురించి నా మనసు మారదు!" దృఢంగా అంది రుక్మిణి.

"జీవితంలో ఒకే సారి, ఒక వ్యక్తిని ప్రేమించాను నేను. ఆమె ఎవరో కాదు, ఊర్మిళ—ధర్మబద్ధమైన నా భార్య! ఆ ప్రేమలో కల్మషానికీ, వంచనకూ చోటు ఇవ్వను. అది నా బలహీనతే కావచ్చు. అందువల్లే ఊర్మిళ ఈ రోజు—నువ్వు చూస్తున్నావుగా- ఆ నరకంలో తనతోబాటు నన్నూ దించగలిగింది. కానీ గ్రహించుకుంటుంది, తను తొక్కింది తప్పుదారని ... అది తెలుసుకున్న తర్వాత, ఇక ఆమెకు ఏ అసంతృప్తీ వుండదు. నీ విషయంలో జాలి చూపగలను, సానుభూతి చూపగలను. పదుగురిలా నిన్ను చులకనగా చూడను. కానీ, హృదయాన్ని మాత్రం పంచి యివ్వలేను. క్షమించు .."

రుక్మిణి విద్యుద్ఘాతం తిన్నదానిలా అలాగే నిశ్చలంగా చూస్తూ కూర్చుండి పోయింది.

మాధవరావు తిరిగి అన్నాడు—"నాకు తెలుసు-నువ్వు బాధపడతావని. అంతే కాదు, కాలం గడిచాక, నాలాటి చపలను, ఎలా ప్రేమ అర్థించానా అని కూడా బాధ పడతావేమో కూడాను. ఎవర్నీ నొప్పించే తత్వం కాదు నాది. ఊర్మిళతో మా యింటి వాతావరణం అసంతృప్తిని రేపింది. బయటి ప్రపంచంలో ఏదో ఆకర్షణ ఆమెను పట్టి లాగుతోంది. ఆ కోర్కెను నేను బలవంతంగా 'భర్త' ననే అధికారంతో అణచగలిగినా, ఆమెను మానసికంగా నీరసురాల్ని చేస్తానే తప్ప, నిజమైన విలువను గుర్తించేలా చేయ లేను. ఇప్పుడిప్పుడే పరిసరాల్ని, పరిస్థితుల్ని, వాటి విలువల్ని అంచనా వేసుకుంటోంది ఊర్మిళ. తిరిగి గూటిలో నే నున్న వాతావరణం పట్ల పూర్తిగా ప్రేమ, విలువ కలిగిననాడే పిల్చుకెళతాను...."

రుక్మిణి, కాస్సేపు మౌనంగా వుండి, అంది: "మీ రూహించే మార్పు ఊర్మిళలో రాకుంటే....? ఈ లోగా, మీ కిక్కడి వాతావరణం తెలుసు. ఆమెను ప్రక్క మార్గాలకు లాగే వా రున్నారు, ఊబిలో దిగబడితే....?"

మాధవరావు ఆవేశంగా పిడికెళ్ళు బిగపట్టాడు: "నాకంతా తెలుసు. అందుకే ఊర్మిళను కంటికి రెప్పలా కాచుకుంటున్నాను.

మరొకటి కూడా చెప్ప గలను. నేను ధర్మం తప్పను. నా ఊర్మిళకు ధర్మహాని కలగదు. అంతే! అది నా విశ్వాసం. మరి వెళ్ళొస్తా!" జవాబు కొంచకుండా మాధవరావు వెళ్ళిపోయాడు.

రుక్మిణి చాలా సేపు అలాగే కూర్చుండి పోయింది. ఆమె జీవితంలో తెరమీద గానీ, తెర వెనుకగానీ, ఇంతటి ఆఘాతం ఎప్పుడూ తినలేదు.

## 15

"ఈ కొత్త చిలకని అంత అపురూపంగా చూచుకుంటున్నాడేం మన బాస్!"

రివ్వున వెను దిరిగి చూచింది ఊర్మిళ. క్యాంటీన్‌లో తనకి కొస్త దూరంలో కూర్చుని వున్న ఇద్దరు ఉద్యోగుల్లో ఒకాయన మెల్లిగా అంటున్నాడు.

"అవును- మొన్ననో రోజు ఆయనగారి బంగళాకు కూడా

ఉండేలు దెబ్బతిన్న పక్షిలా గిలగిల లాడింది ఊర్మిళ హృదయం. మొన్న, సుధాకర్ అభ్యర్థన త్రోసి పుచ్చలేక, అతగాడి కారులో అతగాడి బంగాళాకు వెళ్ళిన మాట నిజమే. అతగాడు బంగళా అంతా చూపిస్తా నన్నాడు. తనే నిరాకరించి హాల్లోనే కూర్చుంది. ఖరీదైన ఫర్నీచరూ వగైరా జన్మలో తను చూడనట్లు, అతగాడు తనకి వర్ణించి, వర్ణించి చెబుతుంటే, చిరా కనిపించింది.

"పల్లెటూళ్ళో మా ఇల్లు, మా పశువులు, మా సంసారం ఇంతకు కోటి రెట్లు విలువైనవి." అనుకుంది త నా రోజు.

ఈ ఊబిలో ఏదో ఆకర్షణ వుందని అనవసరంగా ఇన్నాళ్ళూ భ్రమ పడినందుకు, తనను తాను నిందించుకుంది కూడా.

ఒక్క గంటలో "ఇంటికి వెళ్ళాలి!" అంటూ బయల్దేరింది. సుధాకర్ కారులో, తన ఇంటిదగ్గర డ్రాప్ చేసి వెళ్ళాడు.

దానికి వీళ్ళంతా ఇంత నీచంగా ఎలా ఆలోచించ గలుగుతున్నారు?

మొన్ననో రోజు- తన ప్రక్క సీటులోని మాలిని అడగనే అడిగింది.

"మీకు పెళ్ళి అయిందాండీ?"

"ఆఁ!"

"మీ వారేం చేస్తుంటారు?" సరళ అడిగింది.

"బిజినెస్. వస్తూ వెళ్తూ వుంటారు"

"మరోలా అనుకోకండి ఊర్మిళా! మీ స్వగ్రామంలో మీకు బాగా ఆస్తి వుందని విన్నాం. మా అందరిలా మీరు ఉద్యోగం చేయాల్సిన ఖర్మేం వచ్చిందండీ? మా కంటే గతి లేదు మీ కేం? హాయిగా నీడపట్టున వుండ వచ్చు కదా మీరు చేస్తున్న ఈ ఉద్యోగం మరెవరయినా పేద క్యాండిడేటుకు వస్తే, ఎంత బావుంటుంది!"

తనేం జవాబు చెప్పలేక పోయింది.

ఆ బలహీనతే వారిలో తనపట్ల మరింత నిర్లక్ష్యాన్నీ, విమర్శలనూ, బయలుదేర తీసింది.

"ఇప్పుడో ఫ్యాషన్! పెళ్ళిళ్ళు పేరుకు చేసుకుంటారు-"

"ఉద్యోగాల సాకుతో బయట పడతారు!"

"అంతో యింతో ఆర్జిస్తుంటారు కాబట్టి, ఇక అడ్డే లేదనుకుంటారు! నచ్చిన వారితో నచ్చినట్లు...."

ఊర్మిళ గడగడ వణికి పోయింది-ఏమి టిది!

తనని గురించి, ఇంత తేలికగా అంచనా వేస్తున్నా రెందుచేత? తను అందరిలా లిప్‌స్టిక్‌లూ, హెయిర్ స్టయిల్సూ మార్చటం లేదే? తనెవరితోనూ అతి చనువుగా మెలగటం లేదే? కనీసం మాటాడటం లేదే?

# 16

ఒక్క సుధాకర్ మాత్రం తనకు తెలుసు, అనుకుంది ఊర్మిళ. కారణం—అతగాడు రుక్మిణి స్నేహితుడు. తనకు వుద్యోగం యిప్పించిన వ్యక్తి. ఆ ఆఫీసు మేనేజరుగా తనంటే ప్రత్యేకమైన అభిమానం వుంది. ఏనాడూ శ్రుతి మించినది కాదు. వెకిలి సంభాషణలు లేవు. రెండు మూడు సార్లు తన కారులో డ్రాప్ చేశాడు. తర్వాత తనే మెల్లిగా వద్దంది. అందరిలా సిటీ బస్సుల్లో ప్రయాణం చేస్తోంది.

తను గృహిణి. మాధవరావులాటి అపురూపమైన భర్తకు, ప్రియమైన భార్య. మాధవరావుకు తప్ప తన హృదయంలో మరొకరికి స్థానం లేదు.

మరి వీళ్ళంతా ఎందు కిలాంటి అభాండాలు వేస్తున్నారు! ఊహాగానాలు చేస్తున్నారు? ఇవన్నీ తనెలా భరించటం?

"మీరెవ్వరైనా చెప్పండి! నా భార్యని ఛస్తే ఉద్యోగం చేయించను! పదిరోజుల్లో అదీ ఇలాగే తయారౌతుంది. పైకి అందరూ అమాయకంగానే కనిపిస్తారు. లోపల గోతులు తీస్తారు!"

ఆ వాడిబాణం తన వెన్నుకే తగలాలని విసిరారు వాళ్ళిద్దరూ. ఏమి టిది? తనేమైపోతోంది? తను ఏంచేయా లిప్పుడు?

"హల్లో! ఊర్మిళగారూ!" దగ్గరగా వినిపించిన సుధాకర్ కంఠస్వరంతో ఉలిక్కిపడింది ఊర్మిళ.

"ఏమి టలా వున్నారు? ఒంట్లో బాగాలేదా? ఇక ఈ పూటకు వర్క్ చెయ్యొద్దులెండి. ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను రండి.... నేను రుక్మిణితో అర్జంటుగా మాట్లాడాలి కూడాను...."

ప్రవాహంలా, అతిచనువుగా అతగా డలా అంటూంటే, ఏమనటానికీ తోచలేదు ఊర్మిళకు. తన వెనకనే కళ్ళతో సైగలు చేసు

కుంటున్న ఎందరో వ్యక్తులు! ఎన్నో అర్థాలతోచి ఆమె శరీరం కంపించిపోయింది క్షణకాలం.

"అదేమిటి? వణుకుతున్నారు· జ్వరం వస్తోందా? మే ఐ హెల్ప్‌యూ?" జవాబు కోరించకుండా, చుట్టూరా జనం వున్నారన్న ఆలోచనేనా లేకుండా, భుజాలచుట్టూ చెయ్యివేసి రెండోచేత్తో నుదురు పట్టుకున్నాడు సుధాకర్! ఊహించని సంఘటన

వారించే శక్తి మందలించే ఇంగితం కోల్పోయి నిశ్చేష్టురాలైంది తను. తనచుట్టూ భూమి వలయాలుగా తిరుగుతున్నట్లనిపించింది. కుప్పగా కుర్చీలో కూలబడిపోయింది ఊర్మిళ.

"ఓవర్‌వర్క్ అయిందో ఏమిటో? ఒంట్లోబాగాలేదో ఏమిటో, కొంపతీసి వేవిళ్ళో ఏమిటో? ఆ మటుకూ సుధాకర్ స్పెషల్ 'కేర్' తీసుకుంటూనే వున్నారు...." వ్యంగ్యాలూ, విసుర్లూ, వికట సానుభూతులూ విషపు బాణాల్లా రివ్వు రివ్వున తనవైపు దూసుకు వస్తూండటం తెలుస్తూనేవుంది సమాధానం చెప్పేశక్తిగానీ, సహించే శక్తిగానీ లేక నిర్జీవ కళేబరంలా వుండిపోయింది ఊర్మిళ తనెలా రుక్మిణి ఇంటికి తీసుకురాబడిందోకూడా తెలుసుకోలేని అయోమయపరిస్థితి అది.

"థ్యాంక్‌గాడ్! ఈరోజుకు బ్రతికిపోయాం. రుక్మిణీ! నువ్వు నా మెడకుచుట్టే ఉరితాళ్ళు అన్నీ ఇన్నీకాదు. ఈరోజు నీ స్నేహితురాలిని ఇంటికి తెచ్చేసరికి నా పంచప్రాణాలు పైకెగిరిపోయినంత పనైంది!"

సుధాకర్ కంఠస్వరంలో ధ్వనిస్తున్నది కృత్రిమమైన విసుగుదలో, నిజమైన చిరాకో పోల్చుకోలేకపోయింది ఊర్మిళ. తన రూం బయటే, సోఫాలో కూర్చుని. రుక్మిణీ, సుధాకర్ తనను గురించే మాట్లాడు కుంటున్నారు.

"ఇలా ఉరిత్రాళ్ళు వేసివేసి, ఏనాడో ఓనాడు ముక్కుతాడు వేసేస్తానేమో...." తమాషాగా నవ్వుతూ అంటోంది రుక్మిణి.

సుధాకర్ అదేం వివిపించుకున్నట్లులేదు. "నిజంగా వేవిళ్ళేనేమో ఆవిడకు. కనుక్కోరాదూ? మొన్ననే మాధవరావు వచ్చి వెళ్ళా

డుగా మరి!" అంటూ తన ధోరణి సాగించాడు. ఆ స్వరంలో ఏదో భయమూ, మరేదో వ్యంగ్యమూ, ఇంకేదో కంగారూ నిండివుంది.

"నువ్వారోజు మార్చి రోజు వస్తున్నావు ఇక్కడికి. నాకు వేవిళ్ళో, ఏమిటో, తల తిరుగుతోంది!" కిలకిల రుక్మిణి నవ్వు.

"డోంట్ బి సిల్లీ!" సుధాకర్ సుతారంగా మందలించాడు. "తను ఉద్యోగానికి పనికిరాదని నాకు ముందే తెలుసు. కానీ ఆవిడ ఉద్యోగం చెయ్యటమే నాకిష్టం." సుధాకర్ గొంతుకలో ఏదో ఆశ. ఊర్మిళకు శరీరమంతా కంపరం పుడుతోంది.

"ఏమిటి కథ?" జబర్దస్తీగా అడిగింది రుక్మిణి.

"నీకు వేరేచెప్పాలా? సర్లే! ఆవిడ త్వరగా కోలుకొనేలా చూడు. తానొక్కర్తే వుంటేలు ఆఫీసు కలకల్లాడి పోతుం దంటున్నారు అంతా!" సుధాకర్ వెళ్ళటానికి కాబోలు లేచాడు.

"ఆఫీసుకే కాదు, నీముఖంలోకూడా కళ." నవ్వుతూ అన్న రుక్మిణి మాటల్ని మధ్యలోనే కట్ చేస్తూ—"యూ సిల్లీ గర్ల్!" అంటూ వెళ్ళిపోయాడు సుధాకర్.

ఊర్మిళకు కళ్ళు తెరవాలనిపించ లేదు. డబుల్ కాట్ మీద వున్న ఫోమ్ బెడ్ నిండా ముళ్ళున్నట్లూ, అవి తన నరనరంలోనూ దిగ బడిపోతున్నట్లూ, ఆ మంచం చుట్టూ బలమైన ఇనుపచట్రం బిగించ బడి వున్నట్లూ, తను ఆ కమ్ములను ఛేదించి బయటికి పోవటానికి అశక్తురాలై పోతున్నట్లూ అనుభూతి కలిగింది. మరుక్షణం ఎదురుగా పంజరంలోనున్న చిలకలమీదికి దృష్టిమరలించింది. వాటిలానే తనూ మరో పంజరంలో చిక్కుకుందా? తనకు తెలియకుండానే పెద్దకేక పెట్టింది ఊర్మిళ.

"ఏమిటి ఊర్మిళా! ఏమయ్యింది?" కంగారుగా పరుగెత్తుకు వచ్చింది రుక్మిణి. పైన సీలింగ్ ఫ్యాన్ తిరుగుతున్నా, శరీరమంతా చెమటలు పట్టివున్న ఊర్మిళను చూడగానే గాబరా ఎక్కువైంది రుక్మిణికి.

"ఎలావుంది ఒంట్లో? డాక్టరుకు ఫోన్ చేస్తా వుండు." "ఒద్దొద్దు రుక్మిణీ! నా కేమీ కాలేదు. ఒక్కసారి అన్నపూర్ణను పిలిపించగలవా?

వారి వారికి. వెంటనే రమ్మని వైరిప్పించగలవూ?'' తడారిపోతున్న పెదవులతో బాటు, చిప్పిల్లిన కన్నీళ్ళను చూస్తుంటే, రుక్మిణికి తగని భయమూ, జాలీ కలిగాయి: వచ్చి ఊర్మిళ ప్రక్కనే కూర్చుని, ఆప్యాయంగా ఆమె ముంగురులు సవరిస్తూ అంది రుక్మిణి—"నాకు చెప్పవూ? మొహం తిరిగిపడిపోయావట, కారణం?''

ఊర్మిళ ఏదో చెప్పాలనుకుంది. కానీ పెదవులు దాటి మాటలు రాలేదు. "వద్దు రుక్మిణీ: నేనేమీ చెప్పలే నిప్పుడు. వారిని, వారిని ఒక్కసారి రమ్మని, నా పేరుతో వైరివ్వు. అన్నపూర్ణను పిలిపించు.'' అటుతిరిగి పడుకుంది ఊర్మిళ. ఎగసివస్తున్న ఆమె దుఃఖాన్ని, అదురుతున్న ఆమె శరీరం ప్రతిబింబిస్తుంటే, నిర్ఘాంతపోయింది రుక్మిణి.

"నీకోసమే కాదు. నాకోసమూ పిలిపిస్తాను అన్నపూర్ణని. అలాగే మీవారికికూడా వైరిప్పిస్తాను. నువ్వు స్థిమితంగా పడుకో."

అన్నపూర్ణను పిల్చుకురమ్మనీ, మాధవరావుకు వెంటనే రమ్మని వైరిమ్మనీ డ్రైవరుకు చెప్పి పంపింది రుక్మిణి. తనగదిలో కూర్చుందే గాని ఆలోచనలు స్వేచ్ఛా విహంగాల్లా ఎగరటం మొదలెట్టాయి.

ఊర్మిళ ఏదో బాధపడుతోంది.

సుధాకర్‌లో ఏదో స్వార్థం మొదలైంది, అది ఊర్మిళ చుట్టూరా అందమైన వల పన్నేలా చేస్తోంది. ఊర్మిళ మాధవరావును పిలిపించమంది. అతగాడు రాగానే ఆమె వెళ్ళిపోతుంది. ఇక మాధవరావు ఇక్కడకు రాడు.

సుధాకర్‌కు ఊర్మిళ ఉద్యోగానికి పనికిరాదని తెలుసు. అయినా ఆమె ఉద్యోగం మానెయ్యటం అతగాడి కిష్టం లేదు. ఆమెను ఆమె జీవిత పరిధిలోనుంచి మెల్లగా బయటకు, తనవేపు లాక్కోవాలని అతగాడు ఆమెకోసం అందమైన పంజరం తయారు చేస్తున్నాడు.

తనకూ ఊర్మిళలాటి పిరికి మనిషి, పదుగురిలో తిరగటానికి పనికిరాదని తెలుసు. కానీ.... కానీ... ఆమె ఇలాగే, ఏదో ఒక మిష మీద తన దగ్గరుండి పోవాలని వాంఛిస్తోంది మనస్సు.... కారణం: మాధవరావు.

ఊర్మిళ కోసం మాధవరావు వస్తూంటాడు. మాధవరావున్ని ఎలా అయినా లొంగదీసుకోవా లనుకుంటోంది!

ఇక ఆలోచించ లేకపోయింది రుక్మిణి. తను మాత్రం తక్కువ తిన్నదా? తన స్నేహితురాలి భర్త ... ఆమెకు ద్రోహం చేస్తున్నానేమో నన్న ఆలోచనేనా తనకు వచ్చిందా?

పది రోజుల క్రితం, మాధవరావు వచ్చినపుడు తనెంత ఆవేశ పడింది! ఎంత ఆలోచనా రహితంగా ప్రవర్తించింది! ఎన్నో మార్లు తెలియనట్లే అతణ్ణి స్పృశించింది. కవ్వించేలా చూపులు విసిరింది. ఒంపు సొంపులు బహిర్గత మయ్యేలా, పనిగట్టుకుని అత గాడి కళ్ళముందు తిరిగింది. ఇన్ని చేసినా చలించని అతగాడి నిగ్ర హానికి చికాకు పడింది. ఊర్మిళ అదృష్టానికి ఈర్ష్య పడింది.

ఎలాగైనా సరే ఊర్మిళలో నగర జీవితంలోని ఆకర్షణల పట్ల మరి కాస్త మోజు పెంచి, తన దగ్గరే వుండి పోయేలా చూడా లని తను ప్రయత్నిస్తూనే వుంది. ఊర్మిళనుంచి మాధవరావును నేర్పుగా వేరుచేసి తన బాహుపంజరంలోకి తెచ్చుకోవాలని ఏ క్షణాని కా క్షణం వువ్విళ్ళూరుతూనే వుంది. అందుకు సవాలక్ష మార్గాలు వెతుకుతోంది అందులో ఒకటి, ఊర్మిళకు చెడ్డ పేరు తెప్పించాలని, తద్వారా మాధవరావును తాను ఆకర్షించాలనీ. అందుకే సుధాకర్ సంగతి తెలిసీ,, ఊర్మిళ విషయంలో అతగాణ్ణి మందలించ లేదు. ఇది ఏం సబబు?

ఈనాడు తను మాధవరావును చేపట్టినా, మాధవరావు మనసు తనమీద లగ్నమౌతుందా? తన ఈ స్వేచ్ఛాయుతమైన బతుక్కి స్వస్తి చెప్పి వివాహ బంధంలో తనను తాను బంధించుకున్నా, స్వేచ్ఛకు అలవాటు పడిన తన మనస్సు ఆ పరిధిలో ఇముడుతుందా?

ఆ రోజు అన్నపూర్ణ విదిల్చి వేసిందని, ఊర్మిళతో చెప్పు కుంది తను. పెళ్ళి చేసుకోమంటూ ఊర్మిళ సలహా యిచ్చింది. కానీ ఈనా డనిపిస్తోంది. తనలా పెళ్ళి అనే బంధంలో ఇమడలేదు? వద్దు వద్దు. తనకు పెళ్ళి వద్దు. ప్రేమ వద్దు. ఇలా విశృంఖలంగా సాగే జీవితమే హాయిగా వుంది- లేని పోని బంధాలూ, అనుబంధాలూ తనకు వద్దు!

# 17

"ఏమిటి ఊర్మిళ కేమైందిట?" అదుర్దా పడుతూ వచ్చిన అన్న పూర్ణ మాటలతో రుక్మిణి ఆలోచనలకు అంతరాయం కలిగింది.

"ఏం కాలేదు. కాస్త మొహం తిరిగిందిట! వెర్రి పిసుగ. ప్రతిదీ భయమే! ఏమిటో భయపడి పోయింది! ఇప్పుడే కళ్ళు మూసుకు పడుకుంది. ఇలా రా! ముందు నేను ఎన్నో నీతో మాట్లాడాలి!" బరబరా బాల్కనీలోకి లాక్కెళ్ళింది.

"అన్నపూర్ణా. మనం ముగ్గురం ప్రాణ స్నేహితురాళ్ళం! మనలో అరమరిక లొద్దు. మన అంతస్తులూ, అంతరాలూ మర్చిపోదాం. మనసు విప్పి మాట్లాడుకుందాం... " రుక్మిణి కంఠం గాద్గదికమై పోయింది.

"ఏమిటి రుక్కూ! ఏమి టిదంతా!"

"ఏముందీ! ఊర్మిళ ఇక్కడి కొచ్చే వరకూ బాగానే వుంది కథ. తర్వాత నువ్వూ, నేనూ కలిసి చెరి కాస్తగా దాని మనసు పాడు చేశాం. ఈనాటి పరిస్థితికి మనిద్దరికీ సమాన బాధ్యత వుంది."

"ఏమిటే? నువ్వు చెప్పేదంతా అగమ్యగోచరంగా వుంది."

"అర్థంగాని దేమీ లేదిందులో! దాని పల్లెటూరి జీవితం దానికి నచ్చలేదల్లే వుంది ఉద్యోగం చేస్తానంటూ కూర్చుంది. వద్దని చెప్పినా వినలేదు! మీ ఇంటికి వచ్చింది మూడావూ? ఆ రోజునుంచీ మరింతగా మంకు పట్టు పట్టింది ఉద్యోగం కోసం... " రుక్మిణి ఆగింది.

అన్నపూర్ణకు క్షణకాలం ఊపిరి ఆడ లేదు. ఆ రోజు తన స్వేచ్ఛాయుతమైన జీవితం.... ఉద్యోగినిగా తన జీవితం.... రకరకాలుగా వర్ణించి, తద్వారా తన బ్రతుకులోని బాధలను కప్పి పుచ్చుకోవాలని ప్రయత్నం చేసిందే తప్ప, ఊర్మిళ ఏమై పోతుం దన్నది ఆలోచించలేక పోయింది.

"ఈ లోగా, నా మనస్సు కోతిలా మాధవరావు చుట్టూరా..."

ఇక చెప్పలేక ఆగి పోయింది రుక్మిణి. అన్నపూర్ణ క్షణ కాలం నిశ్చేష్ట రాలైంది. మరుక్షణం ఏదో నిర్ణయించుకున్న దానిలా తల విదిల్చింది.

"ఇక చెప్పకు రుక్కూ! జరిగిం దేదో జరిగింది. ఇక ఇద్దరం కలిసి, ఊర్మిళను మాధవరావు వెంట పంపట మొక్కటే కర్తవ్యం. అంతే కాదు. నీ బ్రతుకులోని 'స్వారస్యం' నీవూ, నా బ్రతుకులోని 'స్వేచ్ఛ' నేనూ సృష్టం చేద్దాం. మరొక్కమాట అడగనా?" క్షణకాలం ఆగింది అన్నపూర్ణ.

"ఆహా!"

"మా శ్రీవారు నీ దగ్గర ఎప్పట్నుంచీ డబ్బు పుచ్చుకుంటు న్నారు? ఇప్పటికి ఎంత మొత్తం ఇచ్చావు?"

నిర్ఘాంత పోయింది రుక్మిణి.

"ఎవరు చెప్పా రీ పిచ్చిమాటలు! నారాయణరావు నా దగ్గరకు రాందే! కాకన్నా మీకూ, మీ కుటుంబాలకూ డబ్బు సర్దుబాటు చేసే కాంట్రాక్టు నే నెప్పుడూ పుచ్చుకో లేదే!" అని బుకాయించింది రుక్మిణి.

"అలా బుకాయించకు రుక్కూ! నాకు తెలుసు నీవు ఒప్పు కోవని.... అందుకే ఆయనగారి చేత చెప్పించుకున్నాను."

"ఏమిటి నారాయణరావు చెప్పాడా?" ఆశ్చర్యంగా అడిగింది రుక్మిణి.

"అవును నా జీతం, ఆయనగారి జీతం ఎంతో నాకు తెలుసు నా కుటుంబానికయ్యే ఖర్చెంతో నాకు తెలుసు నెల నెలా పిల్లలిద్దరి పేరా చెరో పదిహేను రూపాయలు మాత్రం ఎస్. బి. లో వేయ గలను_అదయినా ఎంతో కష్టం మీద. కానీ నా కదే ఆనందం. కష్ట పడుతున్నాను. నా స్వార్జితం, పైసల లెక్కనయినా సరే, కూడ బెడుతున్నాను. ఎప్పుడేనా, ఎవరి నేనా అప్పు అడుగుతాను. కరెక్టుగా తీర్చేస్తాను. ఆ నీతి నాకు చాలు. ఆ తృప్తి నాకు చాలు....కానీ, విన్న పాయంత్రం ఆయనగారి పెట్టె సర్దుతుంటే, అడుగున బ్యాంక్

పుస్తకం [illegible]
బ్యాలన్స్' వుంది. అదీ గడచిన నాలుగు నెలల లోగా! ఈ నెలలో మొన్న నేను మీ ఇంటికి వచ్చి వెళ్ళానే.... తిరిగీ ఆరు వందలు! ఎక్కడిదీ డింత డబ్బు? ఆయనగారు అంతం పుచ్చుకోరు. పుచ్చుకొనే అవకాశమూ లేదు. నేను ఒప్పు కోను. ఆయన స్నేహితుల్లో లక్షాధికార్లు ఎవరూ లేరు. ఉన్నా ఇంతలేపి డబ్బు వుట్టినే ఇచ్చే ఉదారులెవరూ లేరు. ఇక మిగిలింది నీవు.... నిన్నడిగితే నువ్వు చెప్పవు....రాత్రి ఆయన గారిని నిలవేశాను. మొదట నీలాగే బుకాయించినా, చివరకు ఒప్పుకున్నారు. బాబుకు జబ్బుచేసి, హాస్పిటల్‌లో వున్నపుడు కూడా, డబ్బు పుచ్చుకున్నారు కదూ?"

రుక్మిణి మాట్లాడలేదు.

"చూడు రుక్కూ! నా ఆత్మాభిమానం నీకు తెలుసు. అది ఆత్మ విశ్వాసమే కానీ, దురభిమానం మాత్రం కాదని నీకు తెలుసు. ఇతరుల ఐశ్వర్యం కోసం, దయా ధర్మ భిక్షకోసం చేయి చాచి, పడిగాపులు పడే స్త్రీ పురుషులంటే—భర్తయినా సరే నాకు తగని అసహ్యం! అక్కరలు రావచ్చు. కానీ యాచన పనికి రాదు. ఇక మరోమా రెప్పుడయినా ఆయనగారు నీ దగ్గరకు డబ్బు కోసం వస్తే నువ్వివ్వద్దు. ఇచ్చి నీ గొప్ప చూపించుకోదల్చుకుంటే మాత్రం, ఆయన గారిలో ఆ అసహ్యాకరమైన బలహీనతను పెంచి పోషించకు. ఇదిగో! ఈ రోజు ఉదయమే ఈ డబ్బు బ్యాంక్ నుంచి 'విత్‌డ్రా' చేయించాను. తీసుకో. స్నేహాన్ని స్వార్థానికి ఉపయోగించుకోవటాన్ని నేను సహించను!"

రుక్మిణి అవాక్కుగా నిల్చుండి పోయింది.

# 18

ఆ రోజు ఊర్మిళ తిరుగు ప్రయాణం.

"నీకేం కావాలి? ఏంకావాలన్నా తీసుకో ఊర్మిళా!" అంది

రుక్మిణి. ఏదో పెన్నిధిని పోగొట్టుకుంటున్నట్లు దామె మనస్సు.

"ఏమీ వద్దు-ఈ చిలకలు మాత్రం కావాలి" అంది ఊర్మిళ.

"దానికేం భాగ్యం-తీసికెళ్ళు"

స్టేషనుకు అన్నపూర్ణ, రుక్మిణి వచ్చారు. మాధవరావు ప్లాట్ ఫారమ్మీదే వుండిపోయాడు. అన్నపూర్ణ, రుక్మిణి-ఊర్మిళ ప్రక్కగా కంపార్ట్మెంటులో కూర్చున్నారు.

"చూడు ఊర్మిళా! నేను ఏదో సుఖం బావుకుంటున్నానని అనుకుంటున్నావు కదూ! నీకూ అనుభవమైంది కదూ, చాలావరకూ.... నన్నడిగితే, ఈ ప్రపంచమే పెద్ద పంజరం ఊర్మిళా! ప్రతిమనిషి జీవితమూ, పరిసరాలూ పంజరాలే! తమాషా ఎక్కడంటే, ఎవరికి వారు తా మొక్కరే పంజరపుబ్రతుకు బ్రతుకుతున్నట్లూ, ఎదుటివారు చాలా స్వేచ్ఛాయుతమైన జీవితం గడుపుతున్నట్లూ.... అపోహపడతారు ... అప్పుడే ప్రారంభమౌతుంది అసంతృప్తి ... మనకు భగవంతుడు జాగ్రత్తగా అల్లియిచ్చిన పంజరాలే క్షేమకరమైనవి అవి ఛేదించుకుని మరేదో క్రొత్తవలలో పడటం అవివేకం. నా జీవితాన్ని విసుగు పుట్టినపుడు తిట్టుకుంటూనే వుంటాను. కానీ అందులోంచి బయటపడటం ఇష్టం లేదు పడనుకూడాను.... రుక్మిణిచూడు. అశాంతి,అశాంతి ... అంటుంది. పెళ్ళి అనే పంజరంలో ఇరుక్కోవటం దాని కిష్టంలేదు!" అన్నపూర్ణ ఆగింది—

రుక్మిణి తలూపింది. "అవును ఊర్మిళా! నా కీ స్వేచ్ఛాయుతమైన జీవితమే బావుంది. ఈ పంజరమే నాకు సరిపోయింది! "

ఊర్మిళ ఏమీ మాట్లాడలేదు. ఆమె మనస్సంతా పల్లెటూళ్ళో, తమ మేడమీద గదిలో, మాధవరావు బాహువలయంలో, నిశ్చితంగా, హాయిగా....

"ఇంక వుంటాం. ట్రెయిన్ కదలబోతోంది!"

అన్నపూర్ణ, రుక్మిణి దిగిపోయారు. మాధవరావువచ్చి కూర్చున్నాడు.

ఇంటికొచ్చేసరికి, ఊర్మిళకు ఏదో స్వర్గంలోకి తిరిగి వచ్చినట్లు విపించింది. గతించిన రోజులన్నీ పీడకలలా తోచింది. పనివాళ్ళు,

పాలేర్లు, గ్రామంలో తెలిసినవాళ్ళు, ఆప్యాయంగా పలకరించటానికి వచ్చారు. అందరి ముఖాల్లోనూ ఏదో సంతోషం, ఇంకేదో హాయి వెల్లివిరుస్తోంది.

"మా తల్లి! మాయింటికి వెలుగు! మళ్ళీ వచ్చింది. అంతే చాలు! మా కింకేం కావాలి! మంగమ్మా! ఈ రోజునుంచీ వంట ఏంచెయ్యాలో తనే చూసుకుంటుంది, ఇంటిపనులన్నీ తనే చూసుకుంటుంది. ఆమెకే చెప్పి చెయ్యాలి మీరంతా పనులన్నీ!" అంది అత్తగారు.

"ఒరే మాధవా! నేనూ, మీ అమ్మా అట్లా యాత్రలు చేసి వస్తాంరా! అలా అయితేతప్ప ఇహబంధాలు వదిలించుకోలేం," అన్నారు మామగారు ఊర్మిళ వినేలా.

ఊర్మిళ యీ మార్పుకు ఆశ్చర్యపోయింది. కారణం ఏమిటంటూ మాధవరావు నడిగింది.

మాధవరావు నవ్వాడు: "నీలానే వాళ్ళూ, ఎవరిహద్దులు వాళ్ళు తెలుసుకున్నారు. నువ్వు ఇక్కణ్ణించి వెళ్ళిపోవటంతో, ఇక రావేమోననే భావంతో, ఒంటరిగా తిరుగుతున్న నన్నూ, బోసిపోయిన ఇంటినీ చూస్తూ రోజూ బాధపడేవాళ్ళు అమ్మా, నాన్నా. తమ అతి అజమాయిషీ ఇలాటి ఫలితాలకు దారితీసిందని గ్రహించారు. పులిమీద పుట్రలా, ఎవరు ఇంటికివచ్చినా, 'పాపం! ఒక్కగా నొక్కకోడలు దగ్గరుంచుకునే యోగ్యత లేకపోయింది!' అని సానుభూతి కురిపిస్తూనే, మరోవంక 'మీకా ఓర్పులేకపోయింది' అని చెప్పేవారు. దాంతో అమ్మా, నాన్నగారు—తమ చుట్టూరా ఓ ప్రపంచంకూడా వుందనీ, వయసుమళ్ళిన తాము, వార్ధక్యానికి తగ్గ వ్యాపకాన్ని ఎంచుకోకుండా, ఇహ బంధాలు పెంచుకుంటే, లోకం దృష్టిలోకూడా చులకనై పోతామనీ, చివరకు పనివాళ్ళలోకూడా తమ పెద్దరికం సాగదనీ తెలుసుకున్నారు. కథ సుఖాంతం అయింది!"

ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది ఊర్మిళ. తెల్లవారుఝామున మెలకువ వచ్చింది. తమగది బయట వరండాలో చిలకల పంజరం తగిలించింది. చిలకలు పంజరపు కమ్మలకేసి టపాటపా రెక్కలు

కొటుకుంటున్నాయి. గది బయటకు వచ్చింది ఊర్మిళ. ఆమెకో క్రొత్త ఊహ వచ్చింది.

"పాపం! ఈ చిలకలు.... స్వేచ్ఛకోసం పరితపిస్తున్నాయేమో!" వెంటనే ఆమె పంజరపు తలుపులుతీసి, చిలకల్ని బయటకు తీసి, ఎగరవేసింది.

"ఊర్మిళా! అప్పుడే లేచావేం!" మాధవరావు మృదువుగా అడిగాడు. "ఏం చేస్తున్నావక్కడ?" అన్నాడు మళ్ళీ.

"చిలకల్ని వదిలివేశాను. పాపం! అవి స్వేచ్ఛకోసం.... మనం బంధించటం పాపంకాదూ?" అంది.

మాధవరావు నిద్రమత్తు వదిలిపోయింది పూర్తిగా. లేచి కూర్చొని నవ్వాడు. "కానీ కాస్సేపటికి అవి తిరిగి వస్తాయి!" అన్నాడు.

"ఎందుకని!"

"బయట వాటికెవరూ పాలూ, పండ్లూ అమర్చిపెట్టరు నీలా! పైగా కొన్నేళ్ళుగా సుఖంగా పంజరంలో వుండటానికే అలవాటు పడ్డాయి. బయట వాటికి క్షేమమూలేదు సుఖమూలేదు. అంచేత!"

ఊర్మిళ ఆలోచిస్తూ కూర్చుండి పోయింది. ఓ అరగంట గడిచిందో లేదో, చిలకలు వదిలంగా పంజరంలోకి వచ్చి కూర్చున్నాయి!

"కాస్సేపిలా పడుకో!" ఆమెచుట్టూ మృదువుగా చేతులువేసి పడుకున్నాడు మాధవరావు....

ఆ తెల్లవారుఝామున—చిరుచలిలో, భర్త బాహు పంజరంలో, ఊర్మిళ హాయిగా కళ్ళుమూసుకుంది. ఆమె మనసు పదే పదే అంటోంది—'నాకీ పంజరమే బావుంది! నాకీ పంజరమే బావుంది!'




# 101 నుండి ఎమెస్కో-పాకెట్ పుస్తకాలు

*101. లలితా పట్టణపురాణి-విశ్వనాథ సత్యనారాయణ (నవల)
*102. చిల్లరదేవుళ్ళు-దాశరథి రంగాచార్య (నవల)
*103. దాంపత్యాలు-కోమలాదేవి (నవల)
*104. హాస్యసంజీవని-కందుకూరి వీరేశలింగము (ప్రహసనములు)
105. అనుభవం-కొడవటిగంటి కుటుంబరావు (నవల)
106. సమత-వాసిరెడ్డి సీతాదేవి (నవల)
*107. అడకత్తెర-'హరికిషన్' (నవల)
108. యముడిముందు చలం-గుడిపాటి వెంకటచలం (నాటికలు)
109 కొడిగట్టిన దీపాలు-ఐ. వి. యస్. అచ్యుతవల్లి (నవల)
110. అదృష్ట రేఖ-శివరాజు సుబ్బలక్ష్మి (నవల)
*111. విధి వంచితలు-డి. కామేశ్వరి (నవల)
*112. గోమతి-ద్వివేదుల విశాలాక్షి (నవల)
113. జైజవాన్-యద్దనపూడి సులోచనారాణి (నవల)
114 (పి) నీతిచంద్రిక-రావి కొండలరావు (హాస్య రచన)
*115. దయ్యాలు లేవూ-లత (నవల)
116. ఊబిలో దున్న-వినుకొండ నాగరాజు (నవల)
117. రాజరాజు-శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (నాటకం)
118. బ్రతుకుబాట-పి. సత్యవతి (నవల)
119. ఎదురద్దాలు-ఇచ్ఛాపురపు జగన్నాథరావు (కథలు)
120. ఎక్కడుంది ప్రశాంతి?-కొలకలూరి ఇనాక్ (నవల)
*121. జాజిమల్లి-కీ. శే. అడవి బాపిరాజు (నవల)
122. నవదేవత-వి. యన్. రంగస్వామి (నవల)
123. రంగుల వల—ఎమ్. పార్థసారథి (నవల)
124. సహజీవన సౌభాగ్యం-అవసరాల రామకృష్ణారావు (నవల)

126. దంతపు దువ్వెన-విశ్వనాథ సత్యనారాయణ (నవల)
127. గిరీశం ది గ్రేట్ ఫిలిం ప్రొడ్యూసర్-
వడ్లమన్నాటి కుటుంబరావు (నవల)
128. విధి వినోదం- రోషన్ (నవల)
129. రామచంద్ర విజయము—చిలకమర్తి లక్ష్మీనరసింహము (న)
130. జీవిత సమరంలో-వాసమూర్తి (నవల)
131. నవోదయం-బోలాప్రగడ సత్యనారాయణమూర్తి (నవల)
132. రాండో పెళ్ళి-భూపతి (నవల)
133. చివరకు మిగిలేది (1)-బుచ్చిబాబు (నవల)
134. అంతుపట్టని మనిషి-మురళీధర్ (నవల)
135. ఉపనిషత్కథలు-డి. శ్రీధర్ బాబు (కథలు)
136. సంతప్తులు-ఉషశ్రీ (నవల)
137. చివరకు మిగిలేది(2)_బుచ్చిబాబు (నవల)
138. విద్యార్థి సాహితి: కథాంజలి-2.
139. అక్కయ్యే మళ్లీ పుట్టింది-ఎన్. వేదవతీదేవి (నవల)
140. రాగి-యోగి-పి. వి. కృష్ణమూర్తి (నవల)
141. నాగమల్లిక-పి. గణపతిశాస్త్రి (నవల)
142. సీలి-(ఐదు పెద్ద కథలు)-పురాణం సుబ్రహ్మణ్యశర్మ
143. పైపాటు-'కృష్ణ' (నవల)
144. సంపంగి-బలివాడ కాంతారావు (నవల)
145. మళ్ళీ రైలు తప్పిపోయింది_గొల్లపూడి మారుతీరావు (నవల)
146. ఆకర్షణ-కొమ్మూరి వేణుగోపాలరావు (నవల)
147. మలుపు-మెరుపు—ఎమ్మీయల్ (నవల)
148. తల్లి మనసు-పి. రామలక్ష్మి (నవల)
149. రమణి రాసిన ఉత్తరం-కప్పగంతుల సత్యనారాయణ (కథలు)
150. ప్రమదావనమ్-వేంకట పార్వతీశ్వర కవులు (నవల)
151. నౌకాగమనం-పోల్కంపల్లి శాంతాదేవి (నవల)
152. ఏది గమ్యం? ఏది మార్గం?_మాలతీ చందూర్ (నవల)
153. మిథ్య-శిఖా వెంకటరమణ రాజా (నవల)
154. విధి విన్యాసాలు-శ్రీమతి కావిలిపాటి విజయలక్ష్మి (నవల)

155. ఆద్యంతాలు-మధ్య గాథ—బుచ్చిబాబు (నవల)
156. జీవన స్రవంతి-పాలంకి వెంకట రామచంద్రమూర్తి (నవల)
157. శారద (నా స్పృషిః కురుతే కావ్యం) సి. ఆనందారామం (నవల)
158. విద్యార్థి సాహితి: కథాంజలి-3
159. రాక్షసీ నీ పేరు రాజకీయమా?—ఆదివిష్ణు (నవల)
160. ధనమూల మిదం జగత్-రంగనాయకమ్మ (నవల)
161. మనిషి-మచ్చ-ఎ. వి యస్. రామదాసు (నవల)
162. వైతరణి.వాసిరెడ్డి సీతాదేవి (నవల)
163. అరుణ-చలం (నవల)
164. వివాహం-చలం (కథలు)
165 చలంగారి కల్ప-స్టేషన్ పంపు-చలం (కథలు)
166. ఆ రాత్రి.చలం (కథలు)
167. వడ్లగింజలు.కీ॥ శే॥ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి (కథలు)
168. ఉద్యోగపర్వాలు-లేళ్ళపల్లి వెంకట లక్ష్మీనారాయణ (నవల)
169. పునాదిరాళ్ళు-వేదుల శకుంతల (నవల)
170. నరుడు-అడవి బాపిరాజు (నవల)
171. ఎ మేటరాఫ్ నో యింపార్టెన్స్-బీనాదేవి (కథలు)
172. మమత-నండూరి విఠల్ (నవల)
173. ఒకే రక్తం-ఒకే స్పర్శ—పన్యాల రంగనాథరావు (నవల)
174. విధి విధానం-పిల్లలమర్రి వేదవతి (నవల)
175. చిన్నప్రపంచం సిరివాడ—మధురాంతకం రాజారాం (నవల)
176. నవ్వింది నాగావళి-గండికోట బ్రహ్మాజీరావు (నవల)
177. అలకాపురి-చామర్తి దుర్గాప్రసాద్ (నవల)
178. గతించని గతం-గోపీచంద్ (నవలికలు)
179. పెళ్ళానికి ప్రేమలేఖ-ముప్పాళ రంగనాయకమ్మ (కథలు)
180. సీతాకల్యాణం—ముళ్లపూడి (కథలు)
181. పున్నమి మసకలు-కళ్యాణ సుందరీ జగన్నాథ్ (కథలు)
182. అత్తగారూ-నక్సలైట్లూ—భానుమతీ రామకృష్ణ (కథలు)
183. దాంపత్యోపనిషత్తు-మునిమాణిక్యం నరసింహారావు
184. దైవఘటన-మద్దంశెట్టి హనుమంతరావు (నవల)

